# శ్రీ మద్భగవద్గీత

## విజ్ఞానదీపిక



సంకలనకర్త

శ్రీ ఆచంట శివరామకృష్ణమూర్తి

# శ్రీమద్భగవద్గీత విజ్ఞానదీపిక



సంకలనకర్త
**శ్రీ ఆచంట శివరామకృష్ణమూర్తి**
బెండపూడి వారి వీధి, డోర్ నెం. 23ఎ-8-22,
ఆర్.ఆర్.పేట, ఏలూరు.
పశ్చిమగోదావరి జిల్లా. ఫోన్ : 08812 - 20882





ప్రతులు : 1000

ప్రతులకు :
శ్రీమతి ఎ.ఎస్. రత్నం
బెండపూడివారి వీధి, డోర్ నెం. 23ఎ-8-22,
ఆర్.ఆర్.పేట, ఏలూరు, ప॥గో॥జిల్లా

డి.టి.పి.
ఐ క్యాచ్ గ్రాఫిక్స్, ఏలూరు.

ప్రింటింగ్ ప్రెస్
శ్రీ శ్రీనివాసా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
శనివారపుపేట, ఏలూరు.

**వెల : రూ. 50/-**

## రచయిత తల్లిదండ్రులు



**కీ.శే. ఆచంట రాధాకృష్ణమూర్తి**

**కీ.శే. ఆచంట కృష్ణవేణమ్మ**



## రచయిత దంపతులు



**ఆచంట శివరామకృష్ణమూర్తి**

**ఆచంట నాగరత్నం**



## కలౌ వేంకటనాయకః

"ధార్మిక గ్రంథ ప్రచురణమునకు ఆర్థిక సహాయము" అను పథకముననుసరించి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఒసంగిన ధనసహాయముతో ఈ గ్రంథము ముద్రితమైనది

# అభిప్రాయములు

**శ్రీ ఆచంట శివరామకృష్ణమూర్తి** గారిచే వ్రాయబడిన **శ్రీమద్భగవద్గీతా విజ్ఞానదీపిక** అను ఆధ్యాత్మిక గ్రంథము చూచితిని హింసాత్మక ప్రవృత్తి కలిగిన నేటి కాలములో నిష్కామ్యకర్మయోగము ఆచరణీయము. సాధకులు ఆచరించుటకు వీలగు విజ్ఞాన సూక్తులు ఇతర మార్గములు ఇందులో బాగుగా సూచింపబడినవి ఇటువంటి గ్రంథములు నేటి కాలములో చాలా అవసరము

**K. Suwarchala**
II Additional District and Sessions Judge
Eluru

**శ్రీ ఆచంట శివరామకృష్ణమూర్తి** గారిచే వ్రాయబడిన **శ్రీ భగవద్గీతా విజ్ఞానదీపిక** అను గ్రంథమును చూచినాను ఈ గ్రంథములోని నూతన విషయములు సాధకులకు, భక్తులకు బాగుగా ఉపయోగపడతాయి ప్రత్యేకముగా ఓంకార స్వరూపము - ప్రకృతి - విజ్ఞాన సూక్తులు సాధకులకు మిక్కిలి ప్రయోజనకారిగా తోచుచున్నవి ఇటువంటి గ్రంథము వారుమనకు అందించుట చాలా అదృష్టముగ భావించాలి

**Sarva Suryanarayana Murthy** B.Sc., B E
Retd. Head of Mech Engg
Govt. Polytechnic, Ongole
Retd. Engineer, Machilipatnam

శ్రీ విద్యాదీక్షితులు, జ్యోతిష్య, వాస్తు శాస్త్రాది విద్యలలో ప్రవీణులగు **శ్రీ ఆచంట శివరామ కృష్ణమూర్తి**, ఏలూరు వాస్తవ్యుల వారి గ్రంథము మిక్కిలి అభినందనీయము వారి సాధనా అనుభవముతో భగవద్గీతను పరిశోధన గ్రంథమువలె సంకలనము చేయుట ముదావహము పాఠకులకు ఎన్నో నూతన విషయములను పరిచయము చేసిరి క్రొత్త ఒరవడిలోనున్న ఈ గ్రంథము పాఠకుల ఆదరణ పొందుననుటలో అతిశయోక్తిలేదు. శ్రీ మహాగణపతి వారిచే మరిన్ని గ్రంథములు ప్రచురించగలరని ఆశించుచున్నాను

**Nori Rajeswara Rao** M.A., (Triple)
Telugu Lecturer,
Vivekananda Degree College, Secunderabad.

ప్రియమిత్రులు **శ్రీ ఆచంట శివరామకృష్ణమూర్తి** గారిచే వ్రాయబడిన **శ్రీమద్భగవద్గీతా విజ్ఞానదీపిక** అనుగ్రంథమును పరిశీలించితిని సామాన్యుల నుండి పండితుల వరకు అందరికి నేటి కాలమునననుసరించి ఆచరణ యోగ్యమగు భక్తి, జ్ఞాన, యోగ విషయములను గీతాశాస్త్రమాధారముగ వివరించిరి గీతాపారాయణ విధానము విపులముగ వ్రాయబడినది. ఇటువంటి గొప్ప గ్రంథములు వారి కలము నుండి ఇంకను వెలువడవలయునని కోరుచున్నాను

**J. Venu Gopal** M.Com., M.B.A.,
Indian Airlines, Secunderabad.

# భగవద్గీత విజ్ఞానదీపిక గ్రంథమునకు ఉపయుక్త గ్రంథములు

వేదములు

ఉపనిషత్తులు

మహావాక్యరత్నావళి (రామాంజనేయ సంవాదము)

జ్ఞాన వాసిష్ఠము (వశిష్ఠ రామ సంవాదము)

శివగీత (శివుడు రామునకు చెప్పినది)

శక్తిగీత (పరాశక్తి దేవతలకు చెప్పినది)

గురుగీత (శివుడు పార్వతికి చెప్పినది)

గురుచరిత్ర (దత్తాత్రేయ అవతార చరిత్ర)

దత్తగీత

మహాభక్త విజయము (సుమారు 64 మంది భక్తుల గాథలు)

పురాణములు

రామాయణ భారత భాగవతములు

జ్ఞానేశ్వర భగవద్గీత (జ్ఞానేశ్వరుల వ్యాఖ్య)

గీతా రహస్యము (లోకమాన్య బాలగంగాధర తిలక్)

గీతా భాష్యములు (త్రిమతాచార్యులు)

గీతా భావలహరి (కీ.శే. ఆచంట రాధాకృష్ణమూర్తిగారు)

పూర్ణ విజయము (కీ.శే. ఆచంట రాధాకృష్ణమూర్తిగారు)

సాధన (కీ శే. ఆచంట రాధాకృష్ణమూర్తి గారు) గీతా వ్యాఖ్యాన గ్రంథములు

ఆధునిక సాధకుల అనుభవ రహస్యములు మొ॥ ఇతర గ్రంథములు

# శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

## విజ్ఞప్తి (అవతారిక)

శ్రీకృష్ణ భగవానునిచే తెల్పబడిన "భగవద్గీత" ఆధ్యాత్మిక రంగములోని అన్ని స్థితులలో నున్నవారికి విజ్ఞానదీపిక. ఉపనిషత్తులు, పురాణములు, దర్శనములు, సంహితలు, తాంత్రిక గ్రంథములు మొదలగు ఎన్నో గ్రంథములు, రచయితలు వారి అనుభవములను విపులముగ చెప్పగలిగిరి. కాని జిజ్ఞాసువులకు సందేహములు నివృత్తియగుటలేదు. "బ్రహ్మసూత్రములు" వ్రాసి వ్యాసుడు కొంత కృతకృత్యుడయ్యెను. వ్యాసుని కంటె మిన్నగ విషయమును బోధించి శ్రీహరి తాను ప్రత్యక్షముగ "విశ్వరూపమును" చూపి అర్జుననకు విశ్వాసము కలిగించెను. మిగిలిన గ్రంథములు పండితులు చదువుటకే సాధ్యము. సంస్కృత భాషలో ఉన్నవి. గీత సరళమైన సంస్కృతభాషలో వ్యాసునిచే రచింపబడి అన్ని గ్రంథములకు సారభూతమై మకుటాయమానముగ నిలిచినది. దీనికి అన్ని భాషలలో అనువాదములు వ్యాఖ్యానములు కలవు. ఆధ్యాత్మిక రంగములో ఒక స్థాయికి చేరినవారు, మతప్రబోధకులు, యోగులు, భక్తులు, సాధకులు, ఉపన్యాసకులు తమ అనుభవములను గీతరూపములో దర్శించి వారు తరించి మనకు గీతాసూక్తుల రూపములో తెలియజేయుచున్నారు. గీతాభాష్యములు వెలువడినవి. విదేశీయులు కూడా దీనికి ప్రాధాన్యమిచ్చుచున్నారు. బ్రహ్మవిద్య మిక్కిలి కష్టమైనది. కాని కృష్ణుడు అర్జుననకు స్వధర్మమును ఉపదేశించి, కర్మఫల త్యాగము (నిష్కామ్యకర్మ యోగము) బోధించి ధన్యునిగావించెను. మిక్కిలి క్లిష్టమైన బ్రహ్మవిద్యను పూర్వము పండితులు గుప్తముగా ఉంచిరి. భగవంతుడు ప్రజలందరకు 'అరటిపండు వలచి ఇచ్చినట్లు' ఉపదేశము గావించెను. ఇది "గీత" యొక్క గొప్పతనము. 'అసాధ్యమైన విద్య'యని భయపడువారికి సుసాధ్యమైనదని గీతాచార్యుడు అర్జునుని ద్వారా నిరూపించెను. మోక్షము కొరకు ఎక్కడికో వెళ్ళనవసరము లేదని అన్ని ఆశ్రమముల వారు కర్మయోగము, బుద్ధియోగము, జ్ఞాన (ధ్యాన), రాజయోగములను మార్గముల ద్వారా లేదా భక్తి మార్గము ద్వారా దీనిని సాధించవచ్చునని తెలియజేసెను. 'గీత' అనెడి అమృత సాగరము నుండి ఎవరికి కావలసినంత అమృతము వారు గ్రోలవచ్చును. ఎంతమంది స్వీకరించినను అక్షయమైనది గీత. త్రిమతాచార్యులు, రాఘవేంద్రుడు, వివేకానంద, చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి శ్రీ ఎక్కిరాల

రామస్వామి ఆచార్య, మళయాలస్వామి మొదలగువారు దీనిపై కృషిచేసిరి. భారతదేశ స్వాతంత్ర్యమునకు కృషి చేసిన లోకమాన్య బాలగంగాధరతిలక్, అరవింద ఘోష్, మహాత్మాగాంధీ, వినోబా, మురార్జీదేశాయ్ మొదలగువారు ఎందరో గీతను సాధనము చేసికొని స్వరాజ్య సాధనకు పూనుకొని కృతకృత్యులైరి.

నేటి నాయకులు, అధికారులు, ప్రజలు నిష్కామ్యసేవతో తాము పునీతులై దేశాభివృద్ధికి పాటుపడుటకు ఇది యెంతగానో ఉపయోగపడును. విద్యార్థులకు పాఠ్యాంశములుగా కొన్ని విషయములు చేర్చవచ్చును. (స్థిత ప్రజ్ఞ, భక్తి లక్షణాలు, నిష్కామ్య సేవాభావము)

గీతను గూర్చి ఎంతమంది విపులముగా వ్రాసినను ఎన్నో క్రొత్త విషయములు కాలమును బట్టి మారుచుండును. కనుక సాధకులు, భక్తులు, సహృదయులు ఈ విషయము గ్రహించి "హంసనీర న్యాయము" వలె మంచిని గ్రహించి, దోషములు ప్రమాదవశాత్తు వచ్చినప్పటికి మన్నించి తగిన సలహాలను, సూచనలను ఇచ్చినచో సంతోషముగా స్వీకరించి సరిదిద్దుకొనగలవాడను. దీనిని అందరు ప్రోత్సహించి మా రాబోవు పుస్తకములకు సహకరించగలరని ఆశించుచున్నాము. "హంసనీర న్యాయము" వలే మంచి గ్రహించి దోషములు విడువవలెను.

ఓం తత్ సత్

ఇట్లు
బుధజన విధేయుడు
ఆచంట శివరామకృష్ణమూర్తి

## ఓం తత్సత్

# కృతజ్ఞతాభివందనములు

## "ఎందరో మహానుభావులు"

సప్తసంతానములలో 'ఒకటిగ' పేరు పొందినది మంచి గ్రంథము. అందులో ఆధ్యాత్మిక గ్రంధము మరింత శ్రేష్ఠమైనది. వేదవ్యాసుడు చెప్పగ 'మహా గణపతి' ఏకదంతుడై వ్రాయగ పురాణాది గ్రంధములుద్భవించినవి. ఆ పరంపర నాటి నుండి నేటి వరకు కొనసాగుచుండగ, అనేక లక్షల గ్రంధములు ఆణిముత్యముల వలె విరాజిల్లుచున్నవి. జీవితము అశాశ్వతము, మంచి పనులు శాశ్వతము. ఒక మంచి కార్యక్రమము సఫలీకృతమగుటకు ఎందరో చేయూతనివ్వవలసిన అవసరముండును. ఈ గ్రంధము విషయములో అనేక మంది ప్రోత్సాహకులు సలహాదారులు సహాయకులు, కార్యకర్తలు, మిత్రులు, రసజ్ఞులు తమవంతు కృషి చేయుగ "శ్రీ మద్భగవద్గీత విజ్ఞాన దీపిక" సాకారమును దాల్చినది. వారందరికి హృదయపూర్వక కృతజ్ఞతలు. భగవంతుడు వారినందరిని ఆచంద్రార్కము అనుగ్రహించుగాక!

ఆధ్యాత్మిక గ్రంధములు వ్రాయుట మిక్కిలి కష్టము. రచనాశక్తి, సాధనానుభవము, పుస్తకపరిజ్ఞానము పెద్దల అనుభవ పూర్వక విశేష విషయములు ఆకళింపు చేసుకొని వ్రాయవలసియున్నది. ఈ కాలములో తగిన ప్రోత్సాహము లేని కారణముగ ఎందరో ఆధ్యాత్మిక రహస్యములను గ్రంధరూపమున వెల్లడించుటలేదు. అందువలన బ్రహ్మవిద్య మరుగున పడిపోవుచున్నది.

యోగ మార్గమునననుసరించిన మా ముత్తాతగారి యొక్క (కీ.శే. శ్రీ ఆచంట రామయోగి గారు - ఆచంట (గ్రామనివాసి) జ్ఞాన, యోగ మార్గములననుసరించిన మా తాతగారి (కీ.శే శ్రీ సర్వేశ్వరుడు గారు) యొక్క భక్తి, జ్ఞాన, యోగమార్గములనవలంభించిన మా తండ్రిగారు కీ.శే. శ్రీ రాధాకృష్ణమూర్తి గారి యొక్క ఆశీస్సులు, వారి గ్రంథములు, అనుభవములు, ఎందరో రచయితల యొక్క అనుభవ రహస్యములు మా గురువుల యొక్క దీవెనలు మాకు సహకరించినవి. వీరందరికి నా హృదయపూర్వక నమస్కారములు.

# ప్రత్యేక కృతజ్ఞతలు

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థికముగ సహాయమును దేవాదాయశాఖ (తిరుమల తిరుపతి) ద్వారా పొందుటకు సహకరించిన గౌ॥ **శ్రీ దండు శివరామరాజు** గారు ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖామాత్యుల వార్కి, **టిటిడి దేవస్థానము** వార్కి, పండితమండలికి, ఇతర ప్రముఖ అధికారులకు, పశ్చిమగోదావరి జిల్లా కలెక్టరు, ప్రధానమంత్రి గారి అవార్డు గ్రహీత (అక్షరాస్యత) **శ్రీమతి పూనం మాలకొండయ్య**I.A.S., ఏలూరు వార్కి, పశ్చిమగోదావరి జిల్లా దేవాదాయశాఖ వార్కి, ఏలూరు వాస్తవ్యులు ఉపాధ్యాయసంఘ ప్రముఖ ఉద్యమ నాయకులు రిటైర్డు ప్రధానోపాధ్యాయులు మా ప్రియమిత్రులు **శ్రీ కడియాల వెంకట సుబ్బారావు**B.A., B.Ed., గార్కి, మా మిత్రులు **శ్రీ జి. శేషగిరిరావు**B.Sc., B.Ed., రిటైర్డు ప్రధానోపాధ్యాయులు తోట్లవల్లూరు కృష్ణాజిల్లా వార్కి, సద్గురు మళయాళస్వామి వారి గీతాతాత్పర్యాదులను ఆశ్రమము వారి అనుమతితో సేకరించి మాకు అన్ని విధముల సహకరించిన **శ్రీ ఈడ్పిన చంద్రరావు** భీమడోలు వాస్తవ్యులు, పశ్చిమగోదావరి జిల్లా వార్కి, ఈ గ్రంథముద్రణలో బుక్కును అందముగా డి.టి.పి. చేసిన ఐక్యాచ్‌గ్రాఫిక్స్ గార్కి మరియు పుస్తకమును అందముగా తీర్చిదిద్దిన ముద్రణా సంస్థ వార్కి, ప్రూఫ్ రీడరు చి॥ **శ్రీ కృష్ణభాస్కర్**కు తగిన సలహాలను అందించిన **శ్రీ జి. కృష్ణారావు** గార్కి, మరియు మిత్రులు **జి. ప్రభాకరరావు** రిటైర్డ్ హిందీ పండితుల వార్కి మా హితులకు మా ప్రత్యేక ధన్యవాదములు.



# ఓం తత్సత్ అంకితము ఓం తత్సత్

శ్రీ అఖండ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపుడు, మహాతేజోవిరాజమానుడు షోడశకళా ప్రపూర్ణుడు, నామ, రూప, గుణ, రహితుడు, నిరాకారుడు, సనాతుడు, షడ్విధ లక్షణశోభితుడు, అబ్రహ్మకీటపర్యంతము వ్యాపించినవాడు, అవాక్, మానసగోచరుడు, పంచకృత్య పరాయణుడు, నిరాకారుడైనప్పటికీ, సాకారముగ భక్తులచే పూజింపబడుచున్న శ్రీ సహిత ఓంకార స్వరూపునకు, **శ్రీమద్భగవద్గీత విజ్ఞాన దీపిక** అను గీత వివరణ గ్రంధము అంకితము చేయబడినది.

ఓం తత్సత్

సర్వేజనాః సుఖినోభవంతు

లోకాః సమస్తా సుఖినోభవంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇట్లు

బుధజన విధేయుడు

**ఆచంట శివరామకృష్ణమూర్తి**

విక్రమదీపావళి 26/10/2000

# విషయసూచిక

## ప్రథమ భాగము



## ద్వితీయ భాగము

# 1. సర్వదేవతా స్తోత్రములు

"సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అని పెద్దల వచనము. సమస్త దేవతా స్వరూపుడు మహావిష్ణువు, తన విశ్వరూపములచే సమస్త దేవతలను మరియు సృష్టి, స్థితి, సంహారాదులను భక్తులకు చూపించెను. సమస్త సృష్టియందు తాను ఉన్నట్లు తెల్పెను. వాసుదేవస్సర్వమితి సమహాత్మసుదుర్లభః అను గీతావాక్యము కూడా పై విషయము తెల్పుచున్నది. తనలోనే కాకుండ అంతట భగవంతుని చూచువారు చాలా అరుదుగా ఉందురు. యోమాంపశ్యతి సర్వత్ర అని కృష్ణుడు పేర్కొనెను. అటువంటి వారికి మోక్షము సులభమని చెప్పెను. కనుక భగవంతుని భిన్నత్వములో ఏకత్వముగాను, ఏకత్వములో భిన్నత్వముగాను చూచుట జరుగుచున్నది. ఇటువంటి పరిస్థితిని అవగాహన చేసికొని సర్వదేవతా స్తోత్రముతో భగవంతుని ప్రార్థించుట మన కర్తవ్యము. ఆయా సందర్భములను బట్టి భక్తుల వరములను బట్టి భగవంతుడు అనేక రూపములను ధరించును. కనుక అన్ని రూపములలో నున్న భగవంతుని కొలుచుట మంచిది. ఆదిత్యం, శక్తిం,విష్ణుం, గణేశాయ, మహేశ్వరమని పంచాయతన దేవతలను మన పూర్వీకులు యేర్పరచిరి. వ్యాసుని పురాణ గాథలు వీటికి అనుగుణముగా నున్నవి. భక్తి తత్వమునకు చెందిన స్తోత్రములను ఏకా గ్రతతో చేసి భగవంతుని అను గ్రహమును మనము పొందవచ్చును.

మహాగణాధిపతయేనమః - తర్పణముచే గణపతి సంతుష్టినొందును.

గణేశ ప్రాతఃస్మరణము - ( సర్వైశ్వర్య ప్రదము )

శ్లో॥ ప్రాతస్మరామి గణనాథమనాథ బంధుం ।
సింధూర పూర పరిశోభిత గండయుగ్మం ।
ఉద్దండ విఘ్న పరిఖండన చండ దండం ।
అఖండలాది సురనాయక బృందవంద్యమ్ ।

తా॥ అనాథలకు బంధువగువాడు. గంగ సింధూరముచే ప్రకాశించెడు చెక్కిళ్ళ జంట కలవాడు, విఘ్నములను ఛేదించెడు తీవ్రదండము కలవాడు, దేవేంద్రాదులచే స్తుతింప బడువాడు నగు గణపతిని ప్రాతఃకాలమునందు స్మరించుచున్నాను.

శ్లో॥ ప్రాతర్నమామి చతురానవ వంద్యమాన
మిచ్ఛానుకూల మఖిలంచ వరందదానం ।
తంతుందిలం ద్విర సనాధిప యజ్ఞ సూత్రం
పుత్రం విలాసచతురం శివయోశ్శివాయ ॥

తా॥ బ్రహ్మాదిదేవతలచే నమస్కరింప బడువాడు,భక్తుల కోరికలను తీర్చువాడు, పెనుబొజ్జగలవాడు, నాగయజ్ఞోపవీతమును దాల్చిన వాడునగు శివ పార్వతుల కుమారుని ప్రాతః కాలమునందు స్మరించు చున్నాను.

శ్లో॥ వక్రతుండం మహాకాయం కోటి సూర్యసమప్రభం
అవిఘ్నం కురుమే దేవ సర్వ కార్యేషు సర్వదా ।

|| వక్రతుండము కలవాడు, మహాకాయము కలవాడు, కోటి సూర్య సమమైనకాంతితో ప్రకాశించు హాగణపతిని విఘ్ననాశనమునకై ఎల్లప్పుడు ప్రార్థించెదము.

## శ్రీ గణేశ షోడశ నామస్తోత్రము

| 1. సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజోగణాధిపః ||

ధూమకేతుర్గణాధ్యక్షః పాలచంద్రో గజాననః
వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబ స్కంధ పూర్వజః ||

షోడశైతాని నామానియఃపఠేత్ శృణుయాదపి
విద్యారంభే వివాహేచ, ప్రవేశే, నిర్గమే తధా ||

సంగ్రామే సర్వ కార్యేషు విఘ్నస్తస్య నజాయతే ||

| గణపతి యొక్క పదునారు పేర్లు విద్యారంభ సమయమున, వివాహారంభము, గృహ ప్రవేశాది సమయమున, ప్రయాణ సమయమున, యుద్ధమునకు వెళ్ళు సమయమున, సర్వకార్యములు ప్రారంభించునపుడు, స్మరించిన యెడల వారికి అపజయములు గాని, విఘ్నములు గాని రావని భావము.

## లక్ష్మీ గణపతి స్తవము

వందేనిరంతర సమస్త కళాకలాపమ్ ।
సంపత్కరం భవహరం గిరిజాకుమారమ్ ।
లంబోదరం గజముఖం ప్రణవస్వరూపమ్ ।
లక్ష్మీ గణేశమఖిలాశ్రిత కల్పభూజమ్ ||

| సకల విద్యా విశారదుడు, సర్వ సంపదలను ఇచ్చువాడు భక్తుల కోర్కెలు తీర్చువాడునగు లక్ష్మీ గణపతిని ప్రార్థించుచున్నాను.

గణపతికి యిష్టమైన గరిక, తెల్లజిల్లేడు పువ్వులతో పూజించ వలయును. మోదకములు నైవేద్యములు గా ఇవ్వవలెను. చతుర్థి, చిత్త, హస్త, నక్షత్రములు, మంగళ, బుధవారములు, ప్రత్యేక పూజకు మంచిది.

"శివస్య హృదయం విష్ణుః
విష్ణుశ్చ హృదయం శివః"

శత్రు సంహారము కొరకు రాముడు,సంతానాదులకు కృష్ణుడు శివుని పూజించినట్లు పురాణాదుల వ తెలియ చున్నది. శివకేశవులకు భేదము లేదు. సందర్భమును బట్టి హరిహరాదుల లీలలు భక్తులకు ంచును. రామ నామము వీరి ఇరువురి మంత్రముల సంపుటికి సంకేతముగను, హరిహరులు

అభేదమును సూచించునదిగను ఉన్నది. విష్ణు స్వరూపుడైన రాముడు శివుని కొలుచుట రాముని గొప్పదనమునకు శివుడు ఆనందించుట రామాయణాదులు మనకు తెలుపుచున్నవి. రుద్రాంశ సంభూతుడైన ఆంజనేయుడు రాముని ఆశ్రయించు కొని యుండుట మొదలగునవి శివకేశవుల అభేదమును సూచించుచున్నవి. కృష్ణార్జునుల రథమున గల జండా పై కపిరాజు కూడా పై సంకేతములను సూచించుచున్నది. చిరంజీవియైన హనుమంతుడు, రామ,కృష్ణులనిద్దరిని సేవించుట విశేషము.

## ద్వాదశలింగ స్తోత్రము

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాధంచ, శ్రీశైలే మల్లిఖార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాళం, ఓంకారే పరమేశ్వరమ్
కేదారం హిమవత్పృష్టే, ఢాకిన్యాం భీమశంకరమ్
వారణాస్యాంచ విశ్వేశం, త్ర్యంబకం గౌతమీతటే
వైద్యనాధం చితాభూమౌ, నాగేశం దారుకావనే
సేతుబంధే చరామేశం ఘుశ్మేశంచగుహాలయే ॥

తా॥ పైద్వాదశలింగ స్తోత్రము మూడుపూటలు చేయుట మిక్కిలి ఉత్తమము.

ముక్తి ప్రదాయకములు :

శ్లో॥ కాశ్యాంతుమరణాన్ముక్తిః స్మరణాదరుణాచలే
దర్శనాదేవ శ్రీ శైలే పునర్జన్మ నవిద్యతే ॥

శ్రీశైల మహిమ :- శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే ॥

తా॥ కాశీలో మరణించిన ముక్తి లభించును. అరుణాచలేశ్వరుని స్మరించునచో ముక్తి లభించును. శ్రీ శైల శిఖరము చూచినంతనే ముక్తి లభించును. కాశీ విదేహము ముక్తి, అరుణాచలము, శ్రీశైలము జీవన్ముక్తికి కారణములుగచున్నవి.

## పార్వతీ పరమేశ్వర స్తోత్రము
## అర్ధనారీశ్వర స్తోత్రము
## ( ప్రకృతి పురుష సంయోగము )

శ్లో॥ 1. నమశ్శివాభ్యాం - నవయౌవ నాభ్యాం
పరస్పరాశ్లిష్టవపుర్ధ రాభ్యాం ।
నగేంద్ర కన్యా వృష కేతనాభ్యాం
నమోనమశ్శంకర - పార్వతీభ్యాం ॥

2. నమశ్శివాభ్యాం - సరసోత్సవాభ్యాం
నమస్కృతాభీష్ట - వర ప్రదాభ్యాం ।
నారాయణీనార్చిత పాదుకాభ్యాం
నమోనమశ్శంకర - పార్వతీభ్యాం ॥

3. నమశ్శివాభ్యాం - వృషవాహనాభ్యాం
విరించి విష్ణ్వింద్ర - సుపూజితాభ్యాం ।
విభూతి పాటీరవి లేపనాభ్యాం
నమోనమశ్శంకర - పార్వతీభ్యామ్ ॥

4. నమశ్శివాభ్యాం - జగదీశ్వరాభ్యాం
జగత్పతిభ్యాం - జయ విగ్రహాభ్యాం ।
జంభారిముఖ్యైరభివందితాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

5. నమశ్శివాభ్యాం పరమౌషదీభ్యాం
పంచాక్షరీ పంజర రంజితాభ్యాం ।
ప్రపంచ సృష్టిస్థితి సంహృతాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

6. నమశ్శివాభ్యామతి సుందరాభ్యాం
అత్యంత మాసక్త హృదంబు జాభ్యాం ।
అశేష లోకైక హితం కరాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

7. నమశ్శివాభ్యాం కలినాశనాభ్యాం
కంకాల కళ్యాణ వపుర్ధరాభ్యాం ।
కైలాస శైల స్థిత దేవతాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

8. నమశ్శివాభ్యామశుభా2 పహాభ్యాం
అశేష లోకైక విశేషితాభ్యాం ।
అవకుంఠి తాభ్యాం స్మృతి సంభృతాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

9. నమశ్శివాభ్యాం రథవాహనాభ్యాం
రవీందు వైశ్వానరలో చనాభ్యాం ।
రాకాశ శాంకాభ ముఖాంబు జాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

10. నమశ్శివాభ్యాం జటిలం ధరాభ్యాం
జరామృతిభ్యాం చవివర్జితాభ్యాం ।
జనార్ధనాబ్జోద్భవ పూజితాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

11. నమశ్శివాభ్యాం విషమేక్ష ణాభ్యాం
బిల్వచ్ఛదా మల్లికదామ భృద్భ్యాం
శోభావతీ శాం తవతీశ్వరాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

12. నమశ్శివాభ్యాం పశుపాలకాభ్యాం
జగత్రయీరక్షణ బద్ధ హృద్భ్యాం ।
సమస్తదేవాసుర పూజితాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీ భ్యామ్ ॥

13. స్తోత్రం త్రిసంధ్యం శివ పార్వతీభ్యాం
భక్త్యాపఠేద్ద్వాదశకం నరోయః ।
ససర్వ సౌభాగ్య ఫలా నిభుంక్తే
శతాయురంతే శివలోకమేతి ॥

అభిషేక ప్రియుడైన శివునకు మారేడు ధళములు పద్మ దళములతో పూజించుట శ్రేష్ఠము. కొబ్బరి కాయ నివేదించుట మంచిది. చతుర్దశీ, సోమవారము, ఆరుద్ర నక్షత్రము, తెలుపురంగు, 2,3 అంకెలు, రుద్రాక్షలు, విభూతి, కుంకుమ తగిన మంచి ఫలమును సాధనకునకు యిచ్చును.

## మోక్షప్రదాత, సత్వగుణ సంపన్నుడు, జలతత్వ స్వరూపుడు
## భక్తరక్షకుడు సర్వత్రవ్యాపించిన వాడు అగు

## విష్ణు స్తోత్రము - దశావతార స్తుతి

1. మత్స్యావతారము - ఫలము - వాస్తుదోష నివారణ

శ్లో॥ భూతలాతల మధ్యస్తో
హత్వాతు మధుకైటబౌ
ఉద్ధృతాం యేనవై
వేదాస్తస్మైమత్స్యాత్మనే నమః ॥

2. కూర్మవతారము - ఫలము - వాస్తు దోష నివారణ

శ్లో॥ నవసాగర వనాం చిభ్ర
త్సప్త ద్వీపాంవసుంధరాం ।
యధారీయ తిపృష్ఠీన
తస్మై కూర్మాత్మనే నమః ॥

3. వరహావ తారము - ఫలము - సంతాన ప్రాప్తి - జ్ఞానము

శ్లో॥ ఏకార్ణ కేహి మగ్నంతాం
వారాహం రూపమాస్వింతః
ఉద్దధార మహం య్యోసా
తస్మైక్రోడా త్మనే నమః ॥

4. నరసింహావతారము - శత్రునాశనము - గ్రహపీడ తొలగుట

శ్లో॥ నారసింహ వపుఃకృత్వా
యస్త్రై లోక్య భయంకరం
హిరణ్య కశిపుం జఘ్ను
తస్మై సింహాత్మనే నమః ॥

5. వామనావతారము - బ్రహ్మచర్యదీక్ష, విద్య - దానము - త్యాగము మోక్షము ( ఫలము )

శ్లో॥ వామనం రూపమాస్థాయి
బలింసంయమ్య మాయయా
ఇమేక్రాం తాస్త్రయో లోకా
తస్మైవాంతా త్మనేనమః ॥

6. పరశురామావతారము - ఫలము - శత్రునాశనము - మాతృపితృభక్తి త్యాగము.

శ్లో॥ జమదగ్ని సుతో భూత్వా
పరశుద్భుగ్విభాః రామః
సహిసోద్జున హంతైవ
తస్మై ఉగ్రాత్మ నేనమః ॥

7. రామావతారము - ధర్మనిష్ఠ - పితృభక్తి - రాజ్యప్రాప్తి - శత్రు నాశనము

శ్లో॥ రామోదశరధ ర్భూత్వా
పౌలస్త్యకుల నందనమ్
జఘాన రావణం సంఖ్యే
తస్మై క్షత్రాత్మనే నమః ॥

8. కృష్ణావతారము - ఫలము - సంతానము - సంపద - జ్ఞానము - ఆకర్షణ - భోగము

శ్లో॥ వసుదేవ సుతఃశ్రీమాన్
వాసుదేవో జగత్పతిం ।
జహార వసుధా భారం
తస్మై కృష్ణాత్మనే నమః ॥

9. బుద్ధావతారము - జ్ఞానము - వైరాగ్యము

శ్లో॥ బుద్ధ రూపం సమస్థాయ
సర్వరూప పరాయణం ।
మోహయన్ సర్వ భూతాని
తస్మై మోహాత్మనే నమః ॥

10. కల్కి అవతారము - ఫలము - సంపద - జ్ఞానము - మోక్షము

శ్లో॥ హవిష్యతిక వేదంతే
మేచ్ఛాంస్తురగ వాహనం ।
ధర్మ సంస్థాపనార్థాయ
తస్మైకల్క్యాత్మనేనమః
( ఇది భారతమందలి భీష్మునిచే రచించబడిన స్తోత్రము )

[illegible]

శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమేరామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

శ్లో॥ అపదామప హర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయోనమామ్యహం ॥

శ్లో॥ స్మరణాత్ కీర్తనాచ్చైవ శ్రవణా ల్లేఖనాదపి
దర్శనాద్ధారణాదేవ రామ నామా ఖిలేష్టదమ్ ॥

తా॥ రామనామమును స్మరించినను, కీర్తన చేసినను, ఆలకించినను, లిఖించినను, దర్శించినను, ధారణ చేసినను, సర్వాభీష్టములు సిద్ధించును. ( బృహన్నారదీయ పురాణము )

[illegible]

శ్లో॥ కౌసల్యా సుప్రజా రామపూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్ ।
ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమాలా కాంత త్రైలోక్యం మంగళం కురు ॥

## శత్రు నిగ్రహమునకు

శ్లో॥ ధర్మాత్మా సత్య సంధశ్చ రామోదాశ రధిర్యది
పౌరుషేచఅ ప్రతిద్వంద్వ శరైనంజహి శాత్రవం ॥

## సర్వత్రా జయము లభించుటకు

శ్లో॥ జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।
రాజాజయతి సుగ్రీవో రాఘు వేణాభిపాలితః ॥

[illegible]

(ఓం నమోభగవతే వాసుదేవాయ )

శ్లో॥ కస్తూరీ తిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తి కం కరతలే వేణుం కరే కంకణమ్
సర్వాంగే హరి చందనం చకలయన్ కంఠేచముక్తావళిం
గోప స్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడా మణిః ॥

శ్లో॥ పుల్లేం దీవరాకాంతి మిందు వదనంబర్హావ తంసప్రియం ।
శ్రీ వత్సాంక ముదార కౌస్తుభధరం పీతాంబరం సుందరం ।
గోపీనాం నయనోత్పలార్చిత తనుం గోపాల సంఘావృతం ।
గోవిందం కలవేణునాదన ఫలం దివ్యాంగ భూషంభజే ॥

## ఏక శ్లోకీ గీత ( గీతా పారాయణ ఫల ప్రాప్తి )

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణోయత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయోభూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥

## ఏక శ్లోకీ భాగవతము

శ్లో॥ అదౌదేవకి దేవి గర్భజననం గోపీగృహే వర్ధనం ।
మాయాపూతన జీవితాపహరణం గోవర్ధనోద్ధారణమ్ ।
కంసచ్ఛేదన కౌరవాదిహననం కుంతీ సుతాన్పాలనం
హ్యేతద్భాగవతం పురాణ కథితం శ్రీ కృష్ణలీలామృతమ్ ॥

## భాగవత స్తుతి ( భక్తి వర్ధకము )

శ్లో॥ శ్రీ గాయత్రీ భాష్య భూతోసౌ వేదార్థ పరిబృంహితః
అర్థో 2యం బ్రహ్మ సూత్రాణాం భారతార్థ వినిర్ణయః
పురాణనాం సామరూప స్సాక్షాద్భగవతోదితః
గ్రంధో 2ష్టాదశ సాహస్ర శ్రీ మద్భాగవతాభిధః ॥

## శ్రీ కృష్ణాష్టకమ్

1. వసుదేవ సుతం దేవం కంస చాణూరమర్దనమ్ ।
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

2. అతసీ పుష్పసంకాశం హారనూపుర శోభితమ్ ।
రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

3. కుటిలాలక సంయుక్తం పూర్ణచంద్రనిభాననమ్ ।
విలసత్కుండల ధరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

4. మందార గంధ సంయుక్తం చారుహాసం చతుర్భుజమ్ ।
బర్హిపింఛావ చూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

5. ఉత్ఫుల్ల పద్మ పత్రాక్షం నీలాజీమూత సన్నిభమ్ ।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

6. రుక్మిణీకేళి సంయుక్తం పీతాంబర సుశోభితమ్ ।
అవాప్త తులసీ గంధం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

7. గోపికానాం కుచద్వంద్వం కుంకుమాంకిత వక్షసమ్ ।
శ్రీ నికేతనం మహేష్వా సం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

8. శ్రీ వత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితమ్ ।
శంఖచక్రధరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

నారాయణాయ విద్మ హే ! వాసు దేవ ధీమహి !
తన్నో విష్ణుకృష్ణం వందే జగద్గురుమ్ !! ః ప్రచోదయాత్ !

## శ్రీ మహా లక్ష్మీ అష్టకము

1. నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురపూజితే ।
శంఖ చక్రగదా హస్తే మహాలక్ష్మీః నమోస్తుతే ॥

2. నమస్తే గరుడా రూఢే డోలాసుర భయంకరీ ।
సర్వ పాప హరే దేవీ మహాలక్ష్మీః నమోస్తుతే ॥

3. సర్వజ్ఞే సర్వ వరదే సర్వదుష్ట భయంకరీ ।
సర్వ పాప హరే దేవీ మహాలక్ష్మీః నమోస్తుతే ॥

4. సిద్ధి బుద్ధి ప్రదేదేవి భుక్తి ముక్తి ప్రదాయినీ ।
మంత్ర మూర్తే సదాదేవీ మహాలక్ష్మీః నమోస్తుతే ॥

5. అద్యంతరహితే దేవీ అది శక్తి మహేశ్వరీ ।
యోగజ్ఞేయోగ సంభూతే మహాలక్ష్మీః నమోస్తుతే ॥

6. స్థూల సూక్ష్మే మహారౌద్రే మహాశక్తి మహోదరీ !
మహా పాపహరే దేవీ మహాలక్ష్మీః నమోస్తుతే ॥

7. పద్మాసనస్థితే దేవీ పరబ్రహ్మ స్వరూపిణీ ।
పరమేశీ జగన్మాతః మహాలక్ష్మీః నమోస్తుతే ॥

8. శ్వేతాంబర ధరే దేవీ నానా లంకార భూషితే ।
జగస్థితే జగన్మాతః మహాలక్ష్మీః నమోస్తుతే ॥

మహాలక్ష్మ్యష్టకం స్తోత్రం యః పఠేద్భక్తి మాన్నరః
సర్వసిద్ధి మవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా ॥
ఏకకాలే పఠేన్నిత్యం మహాపాప వినాశనమ్
ద్వికాలం యః పఠేన్నిత్యం ధనధాన్య సమన్వితమ్ ॥
త్రికాలం యః పఠేన్నిత్యం మహాశత్రు వినాశనమ్
మహాలక్ష్మీ భవేన్నిత్యం సర్వదా వరదా శుభా ॥
ఇత్యింద్ర కృత శ్రీ మహాలక్ష్మ్యష్టకస్తవం సంపూర్ణమ్.

ఇంద్రుని చేస్తుతింపబడిన ఈ స్తోత్రము సమస్త పాపములు నశింపజేసి రాజ్యము, సంపద, శత్రునాశనము కలిగించును. సమస్త కోరికలు నెరవేరును. తులసీ దళములు, పసుపు, కుంకుమ, పద్మములు, మారేడు దళములు పూజకు శ్రేష్టము.

పాయసాన్న నివేదన మంచిది. మంగళ, శుక్రవారములు చతుర్దశీ, అష్టమీ, ఏకాదశీ,పూర్ణిమ, సంక్రాంతి యిష్టమైన పర్వదినములు. శ్రావణ, అశ్వీయుజ, మార్గశిర, మాసములు మంచివి.

## నవగ్రహ స్తోత్రము

శ్లో॥ నమస్సూర్యాయ సోమాయ మంగళాయ, బుధాయచ
గురుశ్శుక్రశ్శనిభ్యశ్చరాహవేకేతవేనమః ॥

తా॥ ఈ శ్లోకము నిత్యము యథాశక్తిగ చదివినచే నవగ్రహ దోషములు తొలగి గ్రహములు అనుకూలించును. దేవాలయమలు సందర్శించినపుడు నవగ్రహములు చుట్టు 9 సార్లు ప్రదక్షిణములు చేయూచు 9 పర్యాయమలు ఈ స్తోత్రము చేయవలెను. 18,27,36,45,54 మొదలగు సంఖ్యాక్రమములో కూడా స్తోత్రము చేయవచ్చును. సకల కార్యములు ప్రతి దినము నిర్వహించుటకు ముందు, గణపతిని ప్రార్థించి ఈ స్తోత్రము చేయుటవలన సర్వత్ర జయము లభించును.

## మాతృ దేవోభవ

నగాయత్ర్యాః పరం మంత్రమ్
నమాతుః పరదైవతమ్ ॥

తా॥ సప్త కోటి మహామంత్రములలో గాయత్రీ మంత్రమునకు మించినది లేదు. ప్రతి దేవతకు గాయత్రీ మంత్రము చెప్ప బడినది. సర్వపాపహరము, బుద్ధివికాసము, రక్షణ, జ్ఞానము , మోక్షములను ఈ మంత్రము అను గ్రహించును. బ్రహ్మ, వశిష్ఠ, విశ్వామిత్ర, గౌతమాదులు, రాముడు మొదలగు వారు ఈ మంత్రము యొక్క ప్రయోగమును బాగుగ ఉపయోగించిరి.

తల్లిని మించిన దైవము లేదు. తల్లి భూమి, ఆకాశము కంటే గొప్పది. అనిర్వచనీయమైన ప్రేమ స్వరూపిణి ॥

## ఆచార్య దేవోభవ

నగురో రధికం నగురో రధికం

తా॥ గురువును మించిన అధికులు లేరు త్రిమూర్తి స్వరూపుడైన గురువు దైవముతో సమానమైనవాడు - శివుడు, దత్తాత్రేయుడు, మొదలగువారు గురువు ప్రాధాన్యతను వివరించిరి. గురువు, సర్వత్ర, సర్వావస్థలయందు పూజనీయుడు.

శ్రీ గురుపాదుకాభ్యాంనమః

## పితృదేవోభవ

ఆకాశము కంటే గొప్పవాడు తండ్రి కనుక తండ్రి మిక్కిలి పూజనీయుడు, పరశురాముడు, శ్రీ రాముడు పితృవాక్య పరిపాలకులుగా పేరు పొందినారు.

## అతిధి దేవోభవ

తిధి నియమము లేకుండ వచ్చు అతిధి అభ్యాగతులు సత్కరింపదగినవారు. విష్ణు స్వరూపులు పూర్వము అతిధికి పెట్టకుండ ఎవరు భుజించెడివారు కాదు. కాలమును బట్టి అతిధిని గౌరవించవలెను.

శ్రీ కృష్ణుడు పితృ - మాతృ - గురు అతిధి సత్కారములు చేసి లోకమునకు ఆదర్శ పురుషుడు అయ్యెను.

**[illegible]**

శ్లో॥ హరేరామ, హరేరామ, రామ రామ హరే హరే
హరే కృష్ణ, హరే కృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే ॥

తా॥ చైతన్య మహాప్రభువు దీనిని మిక్కిలి ప్రచారము చేసెను. గౌడీయమఠము వారికి ఇది మిక్కిలి పవిత్రమైనది మిక్కిలి మహిమాన్వితము ॥

ఓం త్రయంబకం యజామహే సుగందిం పుష్టివర్ధనమ్

ఉర్వారుకమివ బంధనాన్ మృత్యోః ముక్షీవ మామృతాత్ ॥

స్వామి శివానంద ( హృషీకేశ్ ) వారు దీని ప్రాముఖ్యతను వివరించిరి అద్భుతమైన శివ మంత్రము అకాలమృత్యువు, అనారోగ్యము పోగొట్టి, జ్ఞాన సంపద, మోక్షములను ప్రసాదించును.

## నవగ్రహ స్తోత్రము

ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవేనమ ః
వందే నవగ్రహాన్ దేవాన్ సూర్యం చంద్రం కుజం బుధం
గురుం శుక్రం శనిం రాహుం కేతుం సర్వార్థ సిద్ధయే

జపాకుసుమసంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్ ।
తమోఽరిం సర్వ పాపఘ్నం ప్రణతో స్మి దివాకరమ్ ॥
దధి శంఖతుషారాభం క్షీరార్ణవ సముద్భవమ్ ।
నమామి శశినం సోమం శంభో ర్మకుట భూషణమ్ ॥
ధరణీ గర్భ సంభూతమ్ విద్యుత్కాంతి సమప్రభమ్ ।
కుమారం శక్తి హస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥
ప్రియంగు కలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్ ।
సౌమ్యం సౌమ్య గుణోపేతం తం బుధమ్ ప్రణామామ్యహమ్ ॥
దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభమ్ ।
బుద్ధి భూతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ ॥
హిమకుందమృణాళాభం దై త్యానాం పరమం గురుమ్ ।
సర్వ శాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణామామ్యహమ్ ॥
నీలాంజనసమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్ ।
ఛాయా మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్ ॥
అర్థ కాయం మహావీర్యం చంద్రా దిత్య విమర్దనం ।
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్ ॥
పలాశ పుష్ప సంకాశం తార కాగ్రహ మస్తకమ్ ।
రౌద్రం రౌద్రా త్మకం ఘోరం ! తం కేతుం ప్రణమామ్యహమ్ ॥

## సూర్యస్తుతి (ఆయు ఆరోగ్య సంపత్ప్రదము)

శ్లో॥ ద్విభుజం పద్మ హస్తం చ । వరదం మకుటాన్వితం ।
ధ్యాయే ద్దివాకరం దేవం । సర్వాభీష్టప్రదాయకం ॥

శ్లో॥ నమోధర్మ విధానాయ। నమస్తే కృత సాక్షిణే ।

నమః ప్రత్యక్ష దేవాయ । భాస్కరాయ నమోనమః ॥

శ్లో॥ సప్తా శ్వరధ మారూఢం । ప్రచండం కశ్యపాత్మజం ।
శ్వేత పద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥

శ్లో॥ లోహితం రధమారూఢం । సర్వలోక పితామహం ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥

శ్లో॥ జపాకుసుమసంకాశం కాశ్యపేయం మహాద్యుతిం ।
తమోరిం సర్వపాపఘ్నం । ప్రణతోఽస్మి దివాకరం ॥

శ్లో॥ ఆదిదేవ నమస్తుభ్యం । ప్రసీద మమభాస్కర ।
దివాకర నమస్తుభ్యం । ప్రభాకర నమోస్తుతే ॥

శ్లో॥ గ్రహాణా మాది రాదిత్యః । లోకరక్షోదివాకరః ।
విషమస్థాన సంభూతాం పీడాం దహాతు మేరవిః ॥

## అర్ఘ్యమునిచ్చునప్పుడు సూర్యస్తుతి

శ్లో॥ ఏహి సూర్యసహస్రాం శోతేజోరాశి జగత్పతిః ।
అనుకంపయ మాం భక్త్యాగృహాణార్ఘ్యం నమోస్తుతే ॥

## సూర్య దర్శనము కానప్పుడు పఠించునది

శ్లో॥ బ్రహ్మ స్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరం ।
సాయం ధ్యాయే సదా విష్ణుం త్రిమూర్తించదివాకరం ॥

## రోగములు, పాపములు, శాంతించుటకై సూర్యస్తుతి

శ్లో॥ సర్వ దుఃఖోప శాంతాయ । సర్వ పాపహరాయ చ ।
సర్వ వ్యాధి వినాశాయ । భాస్కరాయ నమోనమః ॥

## సూర్యాష్టోత్తర శతనామావళి

1. ఓం మిత్రాయనమః
2. ఓం రవయేనమః
3. ఓం సూర్యాయనమః
4. ఓం భానవేనమః
5. ఓం ఖగాయనమః
6. ఓం పూష్ణేనమః
7. ఓం హిరణ్యగర్భాయనమః

8. ఓం మరీచయేనమః

9. ఓం ఆదిత్యాయనమః

10. ఓం సవిత్రేనమః

11. ఓం అర్కాయనమః

12. ఓం భాస్కరాయనమః

13. ఓం మిత్రర విభ్యాంనమః

14. ఓం సూర్యభాను భ్యాంనమః

15. ఓం ఖగపూష్ణాభ్యాం నమః

16. ఓం హిరణ్యగర్భమరీచిభ్యాంనమః

17. ఓం ఆదిత్య సవిత్రాభ్యాంనమః

18. ఓం అర్కభాస్కరాభ్యాంనమః

19. ఓం మిత్ర రవిసూర్య భాను భ్యాంనమః

20. ఓం ఖగపూష్ణహిరణ్యగర్భమరీచి భ్యాంనమః

21. ఓం ఆదిత్య సవిత్రు అర్కభాస్కరాభ్యాంనమః

22. ఓం మిత్రరవిసూర్యభాను ఖగపూష్ణ హిరణ్యగర్భ మరీచాదిత్య సవిత్రు అర్క భాస్కరాభ్యాం నమః

## శ్రీ ఆంజనేయ స్వామి ధ్యాన శ్లోకములు

శ్లో॥ బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వమనోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమాన్ శరణం భవేత్ ॥

శ్లో॥ యత్ర యత్రరఘునాధకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం సమత రాక్షసాంతకమ్ ॥

శ్లో॥ అంజనానందనం వీరం జానకీ శోక నాశనమ్
కపీశ మక్షహంతారం వందే లంకాభయం కరమ్ ॥

శ్లో॥ గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్
రామాయణ మహామాలారత్నం వందే2నిలాత్మజమ్॥

శ్లో॥ ఆంజనేయ మతి పాటలాననమ్ కాంచనాద్రి కమనీయ విగ్రహమ్
పారిజాత తరుమూల వాసినమ్ భావయామి పవమా ననందనమ్॥

శ్లో॥ మనోజవంమారుతతుల్యవేగమ్ జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరాయూధముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి॥

## శ్రీ సుబ్రహ్మణ్య స్వామి ధ్యానం

గాంగేయం వహ్ని గర్భం శరవణ జనితం జ్ఞాన శక్తిం కుమారం ।
సుబ్రహ్మణ్యం స్కంద కేనం గుహమమలగుణం రుద్ర తేజ స్వరూపం ॥
పేధ్యానం తారకఘ్నం గురువ మతిం కార్తికేయ షడాస్యం ।
సుబ్రహ్మణ్యం మయూరధ్వజ రధ సహితదేవ దేవనమామి ॥

## శ్రీ దత్తాత్రేయ స్తోత్రము

శ్లో॥ ఓం నమోబ్రహ్మాది భ్యోష
బ్రహ్మ విద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశర్షి భ్యోనమో గురుభ్యః ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వా తీతం గగన సదృశం తత్వ మస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షి భూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తంనమామి ॥

శ్లో॥ గురుఃబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

శ్లో॥ కాషాయ వస్త్రం కరదండ ధారిణం
కమండలం పద్మ కరేణ శంఖం
చక్రం గదా భూషిత భూషణాఢ్యం
శ్రీ పాదరాజం శరణం ప్రపద్యే ॥
ఔదుంబరః కల్ప వృక్షః
కామధేనుశ్చ సంగమః
చింతామణి ర్గురోః పాదౌ
దుర్ల భాభువనత్రయే
కృతే జనార్దనోదేవః
త్రేతాయాం రఘు నందనః
ద్వాపరే రామకృష్ణాచ
కలౌ శ్రీ పాద వల్లభః
మాలా కమండల ధరః కర పద్మ యుగ్మే
మధ్యస్థ పాణి యుగళే ఢమరు త్రిశూలే
యస్యస్త ఊర్ధ్వ కరయోః శుభ శంఖ చక్రే
వందే తమత్రి వరదం భుజ షట్క యుక్తం
శ్రీ దత్త శరణం మమ.

## [illegible]

1. హే సాయినాథ కరుణాకరదీనబంధో
శ్రీ దాస తాత్య ముఖ పంకజ పద్మ బంధో ।
శ్రీ దత్త దేవ మహిమాన్విత యోగి వంద్య
శ్రీ సాయి నాథ మమదేహి కరావలంబమ్ ॥

2. దేవేంద్ర వంద్య మృదు మంజుల పాదపద్మ
నిత్యాన్నదాన నిరతాఖిల రోగనాశ ।
పాకాది శాస్త్ర పరిపూర్ణ సుసిద్ధ హస్త
శ్రీ సాయినాథ మమదేహి కరావలంబమ్ ॥

3. వజ్రాదిరత్న మణి యుక్త కిరీట హార
పంచామృతేన పరిపూరిత దివ్య దేహో ।
సిద్ధేంద్ర వంద్య మృదు మంజుల వాగ్విలాసా
శ్రీ సాయినాథ మమదేహి కరావలంబమ్ ॥

4. రాజాధి రాజ పరమేశ్వర దివ్య మూర్తే
సంకల్ప సిద్ధ సకలోత్తమ శాంతి రూప ।
కారుణ్యరూప కమనీయ కృపాంత రంగ
శ్రీ సాయినాథ మమదేహి కరావలంబమ్ ॥

5. శ్రీ నారదాది ముని వంద్య దయైక మూర్తే
ఆదిత్య మండల సుసంస్థిత విష్ణు స్వరూప ।
ఓంకార రూప సుమనోహర కాంతిపుంజ
శ్రీ సాయినాథ మమదేహి కరావలంబమ్ ॥

6. ఆనంద రూప నిరుపాధిక నిర్మలాత్మన్
శ్రీ విఘ్నరాజ శివ తాండవ శక్తి రూప ।
బృందారకాది ముని వంద్య శివ స్వరూప
శ్రీ సాయినాథ మమదేహి కరావలంబమ్ ॥

## [illegible]

1. భూతనాథ సదానందా సర్వ భూత దయాపర
రక్ష రక్ష మహాబాహు శాస్త్రేతుభ్యం నమోనమః

2. ద్వి హస్తం, పద్మ సంపంచ శుక్ల యజ్ఞోపవీతనం
పూర్ణ యా పుష్కళాదేవ్యా, యుక్తం శాస్తార, యాశ్రయో

3. ఉత్తుంగ రత్న మకుటం కుటిలాగ్రకేశం
శాస్తార మిష్ట వరదం శరణం ప్రపద్యే

4. అఖిల, భువన దీపం, భక్త చిత్తాబ్జ, శూర
సురగణ, మునిసేవ్యం, తత్వమ స్యాది లక్ష్యం
హరిహర సుత మీశం, తారక బ్రహ్మ రూపం
శబరిగిరి, నివాసం, భావయే శ్రీ భూతనాదమ్

5. నమస్తే సర్వ శక్తాయ నిత్యాయ, పరమాత్మనే
పురుషాయాది, బీజాయ వీరేశాయ నమోనమః
అనంత, రూపిణం, శాంతం, ఘోర సంసార తారకం
సృష్టిస్థిత్యంత రూపంతం శాస్తా రప్రణతోన్వహం

## ౨. గీత మూల సిద్ధాంతము

1. అనాసక్తి 2. కర్మ ఫల త్యాగము 3.భగవంతునికి సంపూర్ణ ఆత్మ సమర్పణ 4. స్వధర్మాచరణము 5. గుణాతీతతత్వము

[illegible]

### 1 . ఒకటవ విశ్వరూపము

జైలులో దేవకీదేవికి పుట్టుట తోడనే తన శంఖు చక్ర గదాయుధములతో కనిపించెను.

అప్పుడు శ్రీ శ్రీముఖనామ సంవత్సరం శ్రావణ బహుళ అష్టమి రాత్రి నిశీధ సమయంలో రోహిణీ నక్షత్రం వృషభలగ్నమందు శ్రీ మదాది నారాయణ పరబ్రహ్మ మూర్తి లీలా గృహీత శరీరుడై దేవకీదేవి గర్భమున జనియించెను.

### 2. రెండవ విశ్వరూపము

నందుని భార్య యశోద యొద్ద పాలు త్రాగుచు ఆవులించగా తననోటిలో విశ్వరూపాన్ని 14 భువనములతో తల్లికి చూపించెను. అది శ్రీముఖనామ సంవత్సరం మార్గశిరమాసం.

### 3. మూడవ విశ్వరూపం

మృద్భక్షణ సమయంలో తన 2వ యేట యశోదకు నోరువిప్పి విశ్వరూపము చూపించెను. అది భావనామ సంవత్సరం శ్రావణమాసం.

### 4, నాల్గవ విశ్వరూపం

బ్రహ్మదేవుడు గోపబాలురను ఒక సంవత్సరము అంతర్ధానము చేసినందున బాలకృష్ణుడు ఆ సంవత్సరమంతా తానే గోవులయి, తానే వత్సములయి, తానే గోప బాలురై కనిపించెను. అప్పుడాయనకు 4 వ యేడు. ఈశ్వరనామ సంవత్సరం.

### 5.అయిదవ విశ్వరూపం

శ్రీ కృష్ణుడు, అక్రూరుడు కలిసి మధురకు వెళ్లుచుండగా దారిలో యమునా నదికి అక్రూరుడు స్నానానికి వెళ్ళియుండగా శ్రీ కృష్ణుడు తన విశ్వరూపాన్ని అక్రూరునికి ఆయమున జలములలో చూపించెను. అప్పుడాయనకు 16 వ యేడు విరోధినామ సంవత్సరం.

### 6. ఆరవ విశ్వరూపం

పాండవరాయ బార సమయంలో కౌరవులు శ్రీ కృష్ణుని కట్టి వైచినపుడు శ్రీ కృష్ణుడు తన విశ్వరూపమును చూపెను. అప్పడాయనకు 90 వ యేడు. శోభకృత నామ సంవత్సరం కార్తీక శుద్ధ ద్వాదశి. రాయబారం 8 రోజులు జరిగెను. ఈ విశ్వరూపము అఖరిరోజున చూపెను.

### 7. ఏడవ విశ్వరూపము

కౌరవ పాండవ యుద్ధ భూమిలో కురుక్షేత్రంలో భగవద్గీతలో అర్జుననకు విశ్వరూపం చూపించెను. శోభకృతనామ సంవత్సరం మార్గశిర శుద్ధ ఏకాదశినాడు. అప్పడు ఆయనకు 90 వ యేడు.

### 8. ఎనిమిదివ విశ్వరూపము

యుద్ధానంతర మందు నాలుగు సంవత్సరములు గడిచిన తర్వాత ఉదంకమహర్షికి తన విశ్వరూపమును చూపించెను. అప్పుడు శ్రీ కృష్ణునికి 94 వ యేడు. ఇదే అఖరి విశ్వరూపం. ప్లవంగ నామ సంవత్సర శ్రావణ మాసం.

## 3. శాస్త్ర విశేషాంశములు

### భగవదుపచారములు

రామానుజుల వారు తమ గీతా భాష్యములో మదీయాని కర్మాణి అనగా ఇట్లు చెప్పిరి. (9 వ అధ్యాయం)
1. అలయ నిర్మాణము, 2. ఉద్యానకరణ, 3. ప్రదీపారోపణ, 4. మార్జన (తుడుపు), 5. అభ్యుక్షణ, 6.లేపన, 7. పుష్పాపహరణ, 8. పూజా ప్రవర్తన, 9. నామ సంకీర్తన, 10. ప్రదక్షణ, 11. స్తుతి, 12. నమస్కారాదీని అని చెప్పినారు.

### విష్ణువు నివాస స్థలములు

1. భక్తులు, 2. వేదములు, 3. తులసి, 4.క్షీరబ్ధి, 5. భగవద్గీత, 6. పతివ్రతలు, 7. పురాణములు, 8. ఉత్సవములు, 9. ఊరేగింపులు, 10. అన్నదానములు, 11. సత్కార్యములు, 12. శంఖధ్వని, 13. ఓంకారము, 14. గోవు, 15. నదీతీరము, 16. రావిచెట్టు మొదలయినవి విష్ణువుకు నివాస స్థలములు.

### లక్ష్మీ నివాస స్థలములు

1. అచారము ఉన్నచోటు, 2. తులసిమొక్క, 3. పూజలు, 4. భక్తి, 5. దానధర్మములు, 6. ముగ్గులున్న ప్రదేశము, 7. సువాసినులు, 8.అన్నదానములు, 9. బ్రాహ్మణ పూజ, 10. శంఖము, 11. శంఖధ్వని, 12. కలహములు లేనిచోటు మొదలయినవి.

## దశావతార ఆలయములు

1. శ్రీకూర్మము - మత్స్యమూర్తి

2.శ్రీకూర్మను - కూర్మావతారము

3. తిరుపతి, సింహాచలము, అహోబిలము - వరహావతార స్వరూపము

4. మంగళగిరి, అంతర్వేది, అహోబిలము - నరసింహస్వామి

5. శివకంచి - వామనావతారము

6. అవనిగడ్డ - పరశురాముడు

7. భద్రాచలము, ఒంటిమెట్ట, రామతీర్థము - శ్రీరాముడు

8. మధుర, బృందావనము - కృష్ణావతారము

9. బందరు, అమరావతి, విజయనగరము - బుద్ధావతారము

10. తిరుపతి - ద్వారకాతిరుమలలో కల్కి అవతారము ఉన్నదని ప్రసిద్ధి.

(సింహళము అని కూడా కొందరు అనుచున్నారు.)

## విష్ణువు దశవిధ లీలలు

1. తిరుపతిలో మేలుకొలుపులు
2. యాదగిరిలో లేచి నిలబడుట
3. ప్రయాగలో స్నానము
4. సింహాచలంలో చందవాలంకారము
5. బదరి కాశ్రమములో జపము
6. పూరీ జగన్నాధములో భోజనము
7. మంగళగిరి లో దాహం ( పానకము)
8. తిరుపతిలో ప్రభుత్వము
9. ద్వారకలో విహారము
10. శ్రీరంగములో శయనము.

## ఈశ్వరుడు పంచముఖములు

ఈశ్వరునికి 5 శిరస్సులు ఉన్నవని చెప్పుదురు.

*1. తత్పురుషము*

తూర్పు వైపు చూచును. పూర్వామ్నాయమంత్రములు దీని నుండి పుట్టినవి.

**2. అఘోరము**

దక్షిణ దిశను చూచును. దక్షిణామ్నాయమంత్రములు దీని నుండి పుట్టినవి.

**3. వామదేవము**

ఇది పడమట వైపు చూచును. పశ్చిమ్నాయమంత్రములు దీని నుండి పుట్టినవి.

**4. సద్యోజాతము**

ఇది ఉత్తరము వైపు చూచును. ఉత్తరామ్నాయ మంత్రములు దీని నుండి పుట్టినవి.

**5. ఈశానము**

ఇది ఊర్ధ్వదిశను చూచును. ఊర్ధ్వమ్నాయమంత్రములు ఈ ముఖము నుండి పుట్టినవి.

## పుణ్య స్త్రీ (ముత్తయిదువ) ధరించవలసిన వస్తువులు

పసుపు, కుంకుమ, మెడలో కృత్తికంటు, మంగళ సూత్రములు, పాదములకు మట్టెలు, చేతులకు గాజులు, కాటుక.

## అశ్వత్థ వృక్ష (రావిచెట్టు) ధ్యానము

మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణు రూపిణే ।
అగ్రతశ్శివరూపాయ వృక్ష రాజాయతేనమః ॥

## శమీ వృక్ష ( జమ్మి చెట్టు ) ధ్యానము

శమీ శమయతే పాపం శమీ శత్రు వినాశనీ ।
ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియ దర్శినీ ॥

## మోక్ష స్థానములు ( పుణ్యక్షేత్రములు )

1. అయోధ్య (శ్రీరాముడు)
2. మధుర (శ్రీకృష్ణుడు)
3. మాయి లేక హరి ద్వారము (దేవి)
4. కాశీ (శివుడు)
5. కంచి (శివుడు, విష్ణువు, దేవి)
6. అవంతి
7. ద్వారక (విష్ణువు)

## సప్త సంతానములు

1.చెఱువులు త్రవ్వించుట, 2. ధర్మ కార్యముల కొఱకు ధనమిచ్చుట, 3. మఠములు లేక ఆశ్రమ నిర్మాణము, 4.తోటలు వేయుట, 5. దేవాలయ నిర్మాణము, 6. నిత్యాన్నదాన సత్రములు, 7. ఉత్తమ గ్రంధములు అచ్చు వేయించుట లేదా ధన సహాయము చేయుట

## సప్త పాతకములు

1. జూదము, 2. మాంస భక్షణ, 3. మద్యపానము, 4. వేశ్య సంపర్కము, 5. వేట, 6. దొంగతనము, 7. పర స్త్రీ సంభోగము

## అన్ని దైవములకు పనికి వచ్చు అష్టబిల్వములు

1. తులసి, 2. మారేడు, 3. వావిలి, 4. ఉత్తరేణి, 5. వెలగ, 6. జమ్మి, 7. పెద్ద ఉసిరి, 8. గరిక.

## వాస్తు విషయములు

1. గృహము నిర్మించ తలపెట్టిన యజమాని తన పేరు బలమునకు దిక్కులు, ద్వారములు, (రోడ్డు) మొదలగునవి గమనించ వలయును. లేని యెడల తరువాత ఇబ్బందులు వచ్చును. దిశ,దశ రెండు ప్రధానము, నామ నక్షత్రము, నామరాశి చూడవలెను.
2. భూమిని ఎన్నుకొనునపుడు పరిసర వాతావరణమును, భూమి లక్షణములను చూచుకొనవలయును.
3. గృహ నిర్మాణ స్థలము యొక్క ఎక్కువ తక్కువలు ముందరే గమనించవలయును. లేనిచో తరువాత మార్పులు చేయుట కష్టము.
4. చతురస్రము, దీర్ఘ చతురస్రము ఆకారములలో నున్న స్థలము మంచిది. ఉత్తర, ఈశాన్య, తూర్పు దిశలు పల్లముగా నుండవలయును.
5. సాధారణముగా తుర్పు, పడమర గృహములు శ్రేయస్కరము.
6. వాస్తు శాస్త్ర విషయము నమ్మిన వారు యధా ప్రకారము చేయుట మంచిది. తూర్పు, ఉత్తరములు ఎక్కువ ఖాళీ ఉండవలెను.
7. వాస్తు మానవుని యొక్క, సంఘము యొక్క శ్రేయస్సునకు ఏర్పడినది కనుక పరిసరగృహములను కూడా దృష్టిలో నుంచుకొనవలయును. పదము కట్టుకొనుట మంచిది.
8. ద్వారములు, అలమారులు, కిటికీలు సమ సంఖ్యలో నున్న రాకుండ ఉండవలయును. అనగా 10,20,30,40,........ఈ విధంగా ఉండరాదు. 2,4,6,8,12,14 ....... ఈ సంఖ్యలు రావలెను. దక్షిణము, పడమరలు తక్కువ ఖాళీ ఉండాలి.
9. గర్భము వెడల్పు 12, అడుగులకు మించకుండా చూచుకొనవలెను.
10. అపార్టుమెంటులు కొనువారు తగినంత గమనించి అవసరమును బట్టి మత్స్య యంత్రము వేయించుకొన వలయును. అపార్టుమెంట్సు కు పూర్తి వాస్తు పాటించుటకు వీలుపడదు.
11. సిద్ధాంతులనడిగి విషయములు తెలిసికొనవలయును. స్వంత నిర్ణయము మంచిది కాదు.
12. నీరు, స్థలము ఎక్కువ తక్కువలు వదలుట, స్నానపు గదులు జాగ్రత్తగా గమనించ వలయును.

దైవ స్మరణతో నిత్యకృత్యములను నిర్వర్తించుకొను విధానము.

1. ఉదయము నిద్రలేవగానే కూర్చుని చేయవలసిన ప్రార్థన
(రెండు చేతులు జోడించి కన్నులు మూసుకొని చేయవలెను)

శ్లో॥ ఓం నమోస్త్వ నంతాయ సహస్రమూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరు బాహవే
సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే
సహస్ర కోటి యుగధారిణేనమః ॥
(ఈ శ్లోకమును చదివి అరచేతిని కన్నుల కద్దుకొనవలెను)

2. పడక మీద నుండి కాలు భూమి మీద మోపుటకు ముందుగా

శ్లో॥ సముద్ర వసనేదేవి పర్వతస్తనమండలే
విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శ క్షమస్వమే॥
పై శ్లోకము చదివి భూమాతకు నమస్కరించవలెను.

3. దంత ధావనము చేయగానే నీళ్ళ శిరస్సున చల్లుకొనుచు

శ్లో॥ గోవిందేతి సదాస్నానం, గోవిందేతి సదాజపః
గోవిందేతి సదాధ్యానం, సదాగోవింద కీర్తనమ్॥

4. స్నానము చేయునపుడు పఠించ దగిన మంత్రము

శ్లో॥ గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు ॥

5. విభూతి ధారణ చేయునపుడు

శ్లో॥ శ్రీకారం చ పవిత్రం చ సోకమోహ వినాశకం
లోకవశ్య కరం చైవ భస్మం త్రైలోక్య పావనమ్ ॥

6. కుంకుమ ధారణ సమయంలో

శ్లో॥ కుంకుమం శోభనం దివ్యం సర్వదా మంగళప్రదమ్
ధారణే న్యాస శుభదం శాంతిరస్తు సదామమ॥

7. తులసి మొక్కకు నీళ్లు పోసి నమస్కరించునపుడు

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః
యదగ్రే సర్వ వేదాశ్చ తులసీం త్వాం నమామ్యహం ॥

శ్లో॥ నమస్తు తులసి కళ్యాణి నమో విష్ణు ప్రియేశుభే
నమోమోక్షప్రదేదేవి నమస్సం పత్ప్రదాయినీ ॥

8. భోజనమునకు ముందు స్మరించవలసిన మంత్రములు

శ్లో॥ అన్నపూర్ణ సదా పూర్ణే శంకర ప్రాణవల్లభే
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం బిక్షాం దేహి చ పార్వతి ।
మాతా చ పార్వతీ దేవీ పితా దేవోమహేశ్వరః
బాంధవాశ్శివ భక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥

శ్లో॥ అహం వైశ్వా నరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం॥

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవతేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥

9. భుజించిన తర్వాత

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణం చ శమంచ బడ బానలం
అహార పరిణామార్థం స్మరామిచ వృకోదరమ్॥

10. నెలపొడుపు చంద్రుని దర్శించినపుడు ఒక నూలు పోగును సమర్పించుచు పఠించదగిన ప్రార్థన

శ్లో॥ క్షీర సాగర సంపన్న లక్ష్మీప్రియ సహోదర
హిరణ్యమకుటాం భాస్వ ద్బాల చంద్ర నమోస్తుతే॥

11. సాయంకాలము దీపము వెలిగించినపుడు నమస్కరించుచు

శ్లో॥ శుభంభవతు కళ్యాణి ఆరోగ్యం ధన సంపదః
మమ శత్రు వినాశాయ సాయం జ్యోతి ర్నమోస్తుతే॥

శ్లో॥ దీపం జ్యోతిః పరబ్రహ్మ దీపం సర్వతమోపహ
దీపేన సాధ్యతే సర్వం సంధ్యా దీపం నమోస్తుతే॥

12. రాత్రి నిద్ర పోవునపుడు పఠించదగినవి.

శ్లో॥ అపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం ॥

శ్లో॥ త్వమేవ మాతాచ పితాత్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవ దేవ॥

శ్లో॥ రామస్కంధం హనూమంతం వైన తేయం వృకోదరం
శయనేయః స్మరేనిత్యం దుస్వప్నః తస్యనశ్యతి॥

పైవిధముగా భగవంతుని ప్రార్థించి కొంత సమయము వారివారి ఇష్టదేవతా స్మరణము చేసికొని నిద్రించవలెను.

## అతిథి దేవోభవ

పూర్వము అతిధిని బగవంతునిగా తలచెడివారు, అతిథులనగా

1. దూరము నుండి వచ్చినవారు.
2. అలసిపోయి వచ్చినవారు.
3. భయము చేత వచ్చినవారు.
4. జ్ఞానమును ఉపదేశించువారు.
5. ధనము లేని వారు.
6. ఆకలితో వచ్చినవారు.
7. అనారోగ్యము తోవచ్చినవారు.
8. అనాధ పిల్లలు.
9. భర్త పోయిన స్త్రీ
10. తల్లిదండ్రులు లేని వారు.
11. ఇల్లు కాలిపోయి వచ్చిన వారు.

వీరికి అన్నము పెట్టుట, ఆదరించుట మహాపుణ్యము.

## పూజకు పనికి వచ్చు పుష్పాలు

చక్కని వాసన, కాంతి, వికసించిన పువ్వులతో పూజించుట మంచిది. పూజ చేయువారికి పువ్వులు కోసి ఇచ్చుట పుణ్యము. కోరికలు నెరవేరుటకు తెల్లని పువ్వులు, ఐశ్వర్యమునకు పచ్చని పువ్వులు శత్రు నాశనమునకు పాపములు తొలగుటకు నలుపు లేక నీలం పువ్వులు, సంపదకు మోక్షమునకు ఎఱ్ఱని పువ్వులతో పూజించవలెను.

శివుడు, పార్వతి , గంగ, గణపతి, కుమారస్వామి, అంజనేయుడు మొదలగు వారిని ఎఱ్ఱని పుష్పములతో పూజించవలెను. వీరికి ఎరుపు రంగు ఇష్టము.

విష్ణు సాంప్రదాయమునకు పసుపు, సరస్వతికి తెలుపు, శనైశ్చరుని నలుపు పుష్పములతో పూజించవలెను.

## దానము

దానము వలన లాభములు

1. రోగములు పోవును.
2. పాపములు నశించును.
3. సంపద పెరుగును.
4. సంతానము కలుగును.
5. నక్షత్ర దోషము, గ్రహదోషములు పోవును.

జాతకులు తమ జన్మ నక్షత్రము లేక నామ నక్షత్రము చూసుకుని ఆ నక్షత్రము వచ్చిన రోజున ఈ క్రింది దానములు చేయవలెను. అట్లే గ్రహదోషములున్నప్పుడు ఆ వారము ఆ గ్రహమునకు దానము చేయవలెను.

నక్షత్ర దోషములకు చెయ్యవలసిన దానములు

1. అశ్విని - నెయ్యి, 2. భరణి - నువ్వులు, 3. కృత్తిక - పటిక బెల్లము, నెయ్యి లేక పాయసము, 4. రోహిణి - పెరుగు, నెయ్యి, 5. మృగశిర - పాలు, 6. ఆరుద్ర - మీగడ, 7. పునర్వసు - మజ్జిగ, 8. పుష్యమి - కుడుములు, 9. ఆశ్లేష - అరిసెలు, 10. మఖ - నెయ్యి, 11. పుబ్బ - మీగడ, 12. ఉత్తర - మజ్జి ఆకులు, 13. హస్త - మిఠాయి, 14. చిత్త - గంధపు చెక్క, 15. స్వాతి - ధనము, 16. విశాఖ - మిఠాయి, 17. అనూరాధ - తియ్యకంద, 18. జ్యేష్ఠ - బెల్లము లేక కలకండ, 19. మూల - అటుకులు, లేక కంద, 20. పూర్వాషాఢ - ద్రాక్షపళ్ళు, 21. ఉత్తరాషాఢ - ఖర్జూరము, 22. శ్రవణం - వస్త్రము, 23. ధనిష్ఠ - మిఠాయి, వస్త్రము 24. శతభిషం - వెన్న, గంధపు చెక్క, 25. పూర్వాభాద్ర - శనగపప్పు, కందిపప్పు, 26. ఉత్తరాభాద్ర - ఉండ్రాలు లేక మిఠాయి, 27. రేవతి - మాదీ ఫలము లేదా కంచు పాత్రలో పాలు పోసి దానము చేయుట.

## గ్రహ దోషములకు చెయ్యవలసిన దానములు

1. రవి - గోధుమలు, 2. చంద్రుడు - బియ్యము, 3. కుజుడు - కందులు, 4. రాహువు - మినుములు, 5. శని - నువ్వులు, 6.గురుడు - శనగలు, 7. బుధుడు - పెసలు, 8. శుక్రుడు - బొబ్బర్లు, 9. కేతువు - ఉలవలు

## గీతా సాధన గ్రహములు

| | | |
|---|---|---|
| నిష్కామ కర్మ | - | గురుడు,శని |
| కర్మఫల త్యాగము | - | శని,కేతువు,9,12, అధిపతులు |
| జ్ఞానయోగము | - | కేతువు, గురుడు |

| | | |
|---|---|---|
| రాజయోగము,ధ్యానము | - | శని,గురుడు,కేతువు, 9,10 అధిపతులు |
| భక్తి యోగము | - | 5,9,10 అధిపతులు, రవి, చంద్రుడు, బుధుడు, శుక్రుడు |
| యోగసిద్ధులు | - | కేతువు,కుజుడు, గురుడు |

గమనిక :- సాధకులు మంచి గ్రంథములు చదువుట వలన జ్ఞానము పెరుగును. రామాయణ, భారత, భగవత పురాణాదులతో పాటు నేటి కాలములో ఉన్న భక్తుల చరిత్రలు ( మహాభక్త విజయం ), మత సిద్ధాంత ప్రవక్తలు, యోగులు, సిద్ధులు, జ్ఞానుల చరిత్రలు చదువుట మంచిది.

## సాధకుల ప్రత్యేక పూజ

కొందరు సాధకులు తమ కోర్కెలు తీర్చు కొనుట, ఆపదలను కాపాడుకొనుటకు భగవంతుని ప్రార్థించెదరు. భగవంతుడు ఒక్కడే అయినను సాధకుని మనస్సుని బట్టి రూపం మారుతుంది. సాధకుని పూర్వ జన్మ పూజను బట్టి గ్రహస్థితిని బట్టి మార్పు కలుగును. ప్రారబ్ధ కర్మ బలీయముగ ఉంటే సాధకుని కోర్కె నెరవేరదు. అందులకు సాధకుడు విచారించరాదు. భగవంతుని నమ్మిన వారికి ఎపుడో ఒకపుడు ఫలితం లభించును.

| | |
|---|---|
| గణపతి, విష్వక్సేనుడు | విఘ్ననివారణ, సంతానము, చదువు, ఋణబాధలు పోవుట, వశీకరణము, సంపద |
| విష్ణుమూర్తి | మోక్షప్రదాత, ఆకర్షణ, సంతానము |
| హనుమంతుడు | సంపద, భక్తి, శత్రునాశనము |
| శివుడు,లక్ష్మి | సంపద, జ్ఞానము, యోగము, ఆయువు |
| సరస్వతి,పార్వతి,శక్తి | విద్య,ఆరోగ్యము,జ్ఞానము,బలము, వాక్కుశుద్ధి, శత్రు నాశనము |
| గాయత్రి,సావిత్రి,సూర్యుడు | పాపములు తొలగుట, మోక్షము, యోగము, సంతానము, ఆరోగ్యము |
| సుబ్రహ్మణ్యస్వామి | సంతానము, సర్పదోషనివృత్తి, ఋణ విమోచన, జ్ఞానము |
| అంగారకుడు | సంతాన దోష, వివాహదోష నివృత్తి, ఋణబాధ నివృత్తి |
| దత్తాత్రేయుడు | మోక్షము, యోగము |
| అయ్యప్ప | భక్తి, ఇంద్రియ నిగ్రహము, కష్టములు తొలగుట, సిద్ధ పురుషులు, గురువులు, జ్ఞానము, మోక్షము. |

## గ్రహస్థితి ప్రభావము

మానవుడు అధ్యాత్మిక రంగములో ఉచ్ఛస్థితికి చేరుకొను వరకు గ్రహముల మంచిచెడుల ప్రభావము ఉంటుంది. ప్రతి సంవత్సరము సిద్ధాంతుల ద్వారా గోచార గ్రహస్థితి, జాతకములోని గ్రహస్థితి గమనించి అవసరమైన తగిన జపములు, దానములు, శాంతులు చేయించుకొనుట మంచిది.

జైమిని, గర్గుడు (శ్రీకృష్ణుని కాలము), పరాశరుడు, వ్యాసుడు, వరాహమిహిరాదులు జ్యోతి శ్శాస్త్రమును ప్రశంసించిరి. సమస్త శాస్త్రములు భగవంతుని నుండి వచ్చినవి. నిత్యము నవగ్రహస్తోత్రము చేయుట మంచిది. గ్రహ సంబంధమైన రాళ్ళను ధరించుట మంచిది. నవరత్నముల ఉంగరము ఉత్తమము. రవి కెంపు, చంద్రుడు ముత్యము, కుజుడు పగడము, బుధుడు పచ్చ, గురుడు పుష్యరాగము, శుక్రుడు వజ్రము, శని నీలము,రాహువు గోమేధికము, కేతువు వైఢూర్యము, దశను బట్టి నక్షత్రమును బట్టి వీటిని ధరించవలయును.

## వాస్తు పురుష స్తోత్రము

నూతన గృహము ప్రారంభించు సమయమున (శంఖు స్థాపన ) భూదేవిని, వాస్తు పురుషుని పూజించుట వలన సమస్త గృహ వాస్తు దోషములు హరించబడును. అట్లే గృహము పూర్తి అయిన తరువాత కూడా వాస్తు పూజ, వీలున్న వారు వాస్తు హోమము చేయించు కొనవలయును. చతుష్షష్ఠి పద విన్యాసముతో (64 మంది దేవతలతో కూడిన ) వాస్తు పురుషుని పూజించుట ఉత్తమము. వాస్తు పురుషుడు త్రిమూర్తుల యొక్క, దేవతల యొక్క వరములను పొందినవాడు.

"వాస్తు పురుష నమస్తేస్తు భూశయ్యానిరతప్రభోమద్గృహం ధనధాన్యాది సమృద్ధిం కురుమేసదా"

పై శ్లోకముతో వాస్తు పురుషుని ధ్యానించి ఉపచార పూజలు చేయవలెను.

నూతన గృహములందు భగవద్గీత, విష్ణు సహస్రనామస్తోత్రము, మత్స్యావతారస్తోత్రము, లలితా సహస్రనామస్తోత్రము, లలితా ఉపాఖ్యానము, దేవీ భాగవతాంతర్గత మణిద్వీప వర్ణనము,ఏకాహములు మొదలగునవి చేయుటవలన ఆ గృహములు ఆధ్యాత్మిక వాతావరణ ముతో మరింత శోభిల్లును. యజమానికి అభివృద్ధి చేకూరును.

# 4. గీత గురించి మహాత్ముల అభిప్రాయాలు

### 1. మహాభారతము

శ్లో॥ మల నిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే
సకృద్గీతాం భసి స్నానం సంసారమల నాశనం॥

జల స్నానం వలన శరీర మాలిన్యం తొలగినట్లే, గీతా పారాయణ మనే స్నానం వలన మనోమాలి న్యాలు నశించి పోతాయి.

### 2. మహాత్మా గాంధీ

ఎటువంటి దుఃఖాల మధ్య నైనాసరే ఒక్కసారి చదివితే చాలు. చిరునవ్వులను చిగురింప చేసే దివ్య గ్రంథమే గీత. అనేక కష్టాల నుంచీ, సమస్యల నుంచీ, సందేహాల నుంచి ఈ భగవద్గీతే నన్ను ఉద్ధరించింది.

### 3. స్కాంద పురాణం

శ్లో॥ అపదం నరకం ఘోరం గీతా ధ్యాయీ నపశ్యతి
నిత్యం ధారయతే యస్తు సమోక్ష మధి గచ్ఛతి ॥

భగవద్గీతను అధ్యయనం చేసే వాడు ఇహంలో కష్టాలను కాని, పరంలో నరకాన్ని కాని పొందడు. ఎవడయితే నిత్యమూ పారాయణ చేస్తాడో వాడు మోక్షాన్నే పొందుతాడు.

### 4. వినోబాభావే

శరీరాభివృద్ధికి తల్లిపాలు ఎంత ఉపయోగ పడతాయో అలాగే బుద్ధికీ, మనో వికాసానికీ భగవద్గీత అంతకంటే ఎక్కువగా ఉపయోగ పడుతుంది. చను బాలకన్నా కూడా భగవద్గీత ఎంతో శ్రేష్ఠమైంది.

### 5. వైష్ణవీయ తంత్ర సారము

శ్లో॥ సంసార సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యోనరః
గీతా భ్యాసం సమాసాద్య పారంయాతి సుఖేన సః ॥

ఏ మానవుడయితే దుర్భరమైన ఈ సంసార సాగరాన్ని తరించదలిచాడో వాడు గీతాభ్యాసం అనే పడవ మీద మాత్రమే దానిని సులువుగా దాటి పోగలుగుతాడు.

### 6. స్వామి వివేకానంద

ఉన్నత శిఖరాలను ఎదగాలనుకునే మనిషికి గీతోపదేశాన్ని మించిన సాధనం లేదు.

### 7. జగద్గురు శంకరాచార్య

శ్లో॥ భగవద్గీతా కించి దధీతా గంగా జలల వ కణి కాపీతా
సకృదపీ యేనమురారి సమర్చా - తస్య కరోతి యమోపినచర్చా ॥

ఒకసారైనా కృష్ణుని పూజించి నా, ఒక పురిషెడయినా గంగా జలం సేవించి నా కాస్తంతయినా గీతా ధ్యానం చేసినా అలాంటి పుణ్యాత్ముల మీద యముడి దృష్టి పడదు.

### 8. మాలవ్యా

ఇది మత గ్రంథం కాదు. విశ్వ మాన వాళికీ పనికి వచ్చే విలువైన ధర్మ భాండాగారమే భగవద్గీత. ప్రపంచ వాఙ్మయంలో ఇంత గొప్ప గ్రంథం మరొకటి లేదు.

### 9. మహా భారతం

శ్లో॥ గీతా గంగా చగాయత్రీ గోవిందేతి హృది స్థితే ।
చతుర్గకార సంయుక్తే పునర్జన్మన విద్యతే ॥

గంగ, గాయత్రి, గీత, గోవింద అనే గ కారంతో మొదలయ్యే ఈ నాలుగునూ విడువని వారికి పునర్జన్మము కలుగదు.

### 10. మధు సూదన సరస్వతి

గీ అనగా త్యాగము. త అనగా తత్వము. అనగా త్యాగివై తత్వ జ్ఞుడివి కావలెనని బోధించునదే గీత. త్యాగం కర్మ ఫల త్యాగం, తత్వం ఆత్మ స్పృహ.

### 11. తిలక్

ప్రపంచమున గల సాహిత్య మంతటిలోను గీతకు దీటు రాగల పుస్తకము వొకొకటి లేదు. మహా ప్రకాశమానమగు అమూల్య రత్నమది. అయ్యది మనలను పరమానంద పదవికి గొని పోవు అపూర్వ సాధనము.

### 12. స్వామి వివేకానంద

శ్లో|| క్లైబ్య మాస్మగమః పార్థ నైతత్వ య్యుప పద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్య క్త్వోత్తి ష్ఠ పరంతప ||

తా|| శత్రు దాహ కుడ వైన అర్జునా ! ఇలా పౌరుషాన్ని కోలు పోవడం నీకు తగని పని. క్షుద్రమైన మనో దౌర్బల్యం ( పిరికి తనం ) వదిలి పెట్టి యుద్ధా చరణ కైలెమ్ము.

ఈ ఒక్క శ్లోకాన్ని చదివితే చాలు. గీత మొత్తమూ చదివిన ఫలితాన్ని పొంద గలుగుతారు. మొత్తం గీతా ప్రయోజనమంతా ఈ ఒక్క శ్లోకంలో నే సమ కూడుతోంది.

నరకం కన్నా పీడా కరమైన పిరికి తనాన్ని హృదయం లోంచి పెరికి పారేసి, యుద్ధరంగం లాంటి జీవితంలో ధైర్యంగా బ్రతకాలి. అని కృష్ణుడు మన వెన్ను తట్టి చెబుతూన్నాడు.

ఏర్చి కూర్చిన పుష్ప గుచ్ఛంలా , ఎంచక్కగా అల్లినా పూలమాలికలా, అత్యంత నైపుణ్యం తో కూర్చిన ధర్మసముచ్ఛయమే భగవద్గీత.

### 13. మహర్షి శ్రీ మలయాళ స్వాముల వారు

సంసార సాగరమును సులభముగ దాటుటకు భగవద్గీతను పఠించుటయు, దానియందు చెప్పినట్లు ఆచరించుటయు చాలును.

### 14. అరవింద యోగి

మానవుడు తన మేధ నంతను ధార బోసినను గీతా జ్ఞానమున ఒకానొక అంశమును మాత్రమే తెలిసికొని, తెలుపగలడు.

### 15. బంకించంద్.

భగవద్గీతలో వలె అపూర్వ ధర్మ సమన్వయము, అద్భుత వ్యాఖ్య ఏ దేశమునను ఏ కాలమునను ఎవడును కనియుండడు. వినియుండడు.

# 5. శ్రీ వరహ పురాణాంతర్గత భగవద్గీతా మహోత్మ్యము

శ్లో॥ ధరోవాచ :-

భగవన్పరమేశాన భక్తి రవ్యభి చారిణీ

ప్రారబ్ధం భుజ్యమానస్య కధం భవతి హే ప్రభో ॥

తా॥ భూదేవి అడుగుచున్నది,

ఓ భగవంతుడా ! ప్రారబ్ధ కర్మాను భవంలో మునిగి పోయిన పాపులకు చలించని భక్తి, రహించిన ముక్తి యే విధంగా లభిస్తాయి ?

శ్లో॥ విష్ణురువాచ :-

ప్రారబ్ధం భుజ్యమానో పి, గీతా భ్యా సరత స్సదా

సముక్త స్సుఖీలోకే కర్మణా నోపలిప్యతే ॥

తా॥ విష్ణువు చెబుతున్నాడు,

భూ దేవీ ! ప్రారబ్ధాన్ననుభవిస్తున్నప్పటికీ కూడా, భగవద్గీతను పారాయణ చేసేవాడు. కర్మలంటని వాడూ, జీవన్ముక్తుడూ, నిత్యసుఖుడూ అవుతాడు.

శ్లో॥ మహ పాపాది పాపాని గీతా ధ్యానం కరోతిచేత్

క్వచిత్స్పర్మం కుర్వంతి నళినీదళమంభ సా॥

తా॥ తామరాకును నీరు తాకనట్లే, గీతా పారాయణం చేసే వాళ్ళని ఎటువంటి మహాపాపాలు కూడా అంటలేవు.

శ్లో॥ గీతాయాఃపుస్తకం యత్ర, యత్ర పాఠః ప్రవర్తతే

తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగా దీని తత్రవై ॥

తా॥ ఈ గీతా గ్రంథము యెక్కడుంటుందో , యెక్కడ పారాయణం చేయబడుతుందో అక్కడ ప్రయాగాదిగా గల అఖిల తీర్థాలూ వుంటాయి.

శ్లో॥ సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే

గోపాలగోపికా వాపి నారదోద్ధవ పార్షదైః

సహా యోజాయతే శీఘ్రం యత్రగీతా ప్రవర్తతే॥

తా॥ ముప్పది మూడు కోట్ల దేవతలు, మునులు, యోగులు, పన్నగులు, గోపాలకులు, గోపికలు, నారదుడు, ఉద్ధవుడు, వైకుంఠద్వార పాలకులు సహాయులై వుంటారు.

శ్లో॥ యత్ర గీతా విచారశ్చ పఠనం పాఠనం శ్రుతం

తత్రాహం నిశ్చితం పృధ్వి నివసామి సదైవహి ॥

తా॥ ఓ భూ దేవీ ! ఎక్కడ ఈ గీతలు పారాయణ చేయబడతాయో , చేయించబడతాయో, వినబడతాయో అక్కడ సర్వ దేవతలతో సహా నేను కూడా వుండి తీరతాను.

శ్లో|| గీతా శ్రయోహంతిష్టాని గీతామేచోత్తమంగృహం

గీతా జ్ఞానము పాశ్రిత్య త్రీన్లోకాన్పాలయా మ్యహం ||

తా|| ఈగీత వల్లనే నేను స్థిరుడనై ఉన్నాను. దీనిలోనే నివసిస్తున్నాను. దీని ప్రకారం గానే ముల్లోకాలనూ పాలిస్తూన్నాను.

శ్లో|| గీతామే పరమావిద్యా బ్రహ్మరూపా న సంశ యః

అర్ధమాత్రాక్షరానిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా ||

తా|| పరమ పదాన్ని బోధించే విద్య గీత . ఇదే పరబ్రహ్మ స్వరూపం. ఇదే అర్ధ మాత్ర. నాశనం లేనిది, శాశ్వత మైనది, స్వకీయం, స్వప్రకాశం, స్వబోధం. ' ఇదీ యిదీ' అని చెప్పడానికి వీలులేని ఉత్తమోత్తమ మైనది గీత అనడంలో ఏమీసందేహం లేదు.

శ్లో|| చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖ తోర్జునం

వేదత్రయీపరానందా తత్త్వార్థ జ్ఞానమంజసా||

తా|| మూడు వేదాల యొక్క, మోక్షానందం యొక్క, అన్ని విధాలైన తత్త్వాలనీ గుది గ్రుచ్చి శ్రీ కృష్ణుడి నోట అర్జునుడికి స్వయంగా ఉపదేశించబడింది.

శ్లో|| యోష్టా దశ జపేన్నిత్యం నరోనిశ్చల మానసః

జ్ఞాన సిద్ధించ సలభతే తతో యాతి పరం పదం ||

తా|| ఎవరైతే ప్రతి రోజూ గీతా పారాయణం చేస్తారో, వారీ ఇహంలో బ్రహ్మ జ్ఞానాన్ని, అంత్యంలో మోక్షాన్నీ పొందుతారు.

శ్లో|| పాఠే2సమర్ధ స్సంపూర్ణే తదర్థం పాఠ మాచరేత్

తదా గోనజంపుణ్యం లభతే నాత్ర సంశయః ||

తా|| పూర్తిగా పారాయణం చేసే శక్తి లేనివారు, సగం పారాయణ చేసినను వారికి గోదానం చేసిన పుణ్యము లభిస్తుంది.

శ్లో|| త్రి భాగం పఠమానస్తు గంగా స్నాన ఫలం లభేత్

షడంశం జపమానస్తు సోమయాగ ఫలం లభేత్ ||

తా|| మూడవ వంతు ( ఆర ధ్యాయాలు ) పారాయణం చేస్తే గంగా స్నాన ఫలం, ఆరోవంతు (మూడ ధ్యాయాలు ) పారాయణ చేస్తే సోమయాగ ఫలం లభిస్తాయి.

శ్లో|| ఏకాధ్యాయంతు యోనిత్యం పఠతే భక్తి సంయుతః

రుద్ర లోకమవాప్నోతి గణోభూత్వా వసేచ్చిరం ||

తా|| రోజుకు ఒక్క అధ్యాయమైనా పఠించే వాళ్లు రుద్ర లోకాన్ని పొంది ప్రమధ గణాలతో చేరి చిరావాసం చేస్తారు.

శ్లో|| అధ్యాయ శ్లోక పాదం వా నిత్యయః పఠతేనరః
సయాతి నరతాం యావన్మ నుకాలం వసుంధరే ||

తా|| అధ్యాయములోని నాల్గవ వంతు నైనను ప్రతి రోజు పఠించే వారు ఒక మన్వంతర మంతా మానవ జన్మ నే పొందుతారు.

శ్లో|| గీతా యాః శ్లోకదశకం సప్తపంచ చతుష్టయమ్
ద్వౌత్రీనేకం తదర్థం వా శ్లో కానాం యః పఠేన్నరః ||

తా|| పది శ్లోకాలను గాని, యేడు గాని, ఐదు గాని, రెండు గాని, తుద కొక్క టి గాని, శ్లోకంలో ని సగం గాని ప్రతి దినం భక్తితో చదివే వాళ్ళు పదివే ల సంవత్సరాలు చంద్ర లోకంలో ఉంటారు.

శ్లో|| చంద్ర లోకమవాప్నోతి వర్షా ణామయు తంధ్రు వం
గీతా పాఠ సమాయుక్తోమృతో మాను ష తాంవ్రజేత్ ||

తా|| గీతా ధ్యయనం చేస్తూ మరణించిన వారు మరలా ఉత్తమ మైన మానవ జన్మనే పొందుతారు.

శ్లో|| గీతా భ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్త మాం
గీతాత్యు చ్ఛార సంయుక్తో మ్రియమాణో గతింలభేత్ ||

తా|| ఆ జన్మలో కూడా గీతాధ్యయనం చేసి మోక్షం పొందుతారు. గీతనే స్మరిస్తూ మరణించిన వారు సద్గతి నొందుతారు.

శ్లో|| గీతార్థ శ్రవణా సక్తో మహాపాపయు తోపివా
వై కుంఠం సమ వాప్నోతి విష్ణునా సహమోదతే ||

తా|| ఎంతటి పాపాలు చేసిన వాడయి నా సరే భగవద్గీతను అర్థ యుక్తంగా వినేందుకెవడు శ్రద్ధ వహిస్తాడో వాడు వైకుంఠాన్నే పొందుతాడు. అక్కడ విష్ణువు వలె సమస్త విధాలా ఆనందిస్తాడు.

శ్లో|| గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః
జీవన్ము క్తస్య విజ్ఞేయో దేహంతే పరమం పదం ||

తా|| ఎటువంటి కర్మా చరణులైనా సరే ప్రతి దినం యెవరైతే సార్థకంగా గీతా పారాయణ చేస్తారో వాళ్ళు జీవన్ముక్తులు, జ్ఞానవంతులూ యై పరమ పదాన్ని చేరతారు.

శ్లో|| గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః
నిర్ధూత కల్మషా లోకే గీతా యాతాః పరం పదం ||

తా|| జనకుడు మొదలుగా గల అనేక మంది ఈ గీతా శాస్త్రాన్నాశ్రయించడం వలననే తమ పాపాలను బాసి, పరమ పదాన్ని పొందారు.

శ్లో|| గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవయః పఠేత్
వృదాపాఠోభవేత్తస్య శ్రమయేవ హ్యుదాహృతః ||

తా|| భగవద్గీతను పారాయణ చేసి, యీ మహాత్మ్యన్ని చదువక పోతే ఆపారాయణ వ్యర్థమే అవుతుంది. దాని ఫలము ఆయాసమే కాని వేరుకాదు.

శ్లో|| ఏతన్మాహాత్మ్య సంయుక్తం గీతాభ్యాసం కరోతియః
సతత్ఫల మవాప్నోతి దుర్లభంగతి మాప్నుయాత్ ||

తా|| ఎవరీ మహత్మ్యముతో కూడా గీతా శాస్త్రమును శ్రద్ధతో పారాయణ చేస్తారో వారు పైన చెప్పబడిన రీతిగా గొప్ప ఫలములను పొందుటయే గాక, మోక్షమును కూడ పొందుచున్నారు.

శ్లో|| మాహాత్మ్య మేత ద్గీతా యా మయాప్రోక్తం సనాతనం
గీతాంతే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ ||

తా|| అతి పురాతనమును, నాచే వచింపబడినదియును నయిన యీ మహాత్మ్యమును, భగవద్గీతా పఠనానంతరం పారాయణ చేసిన మానవుడు ఇందు చెప్పబడిన ఫలమును తప్పక పొందు చున్నాడు.

శ్రీమద్భగవద్గీతా మహత్మ్యము సంపూర్ణం

# ౮. శ్రీ మద్భవద్గీతా పూజా విధానం

అవినాశనము, అద్భుత కర్మ కర్తృత్వము, విభూతి, అధికారము, సర్వజ్ఞత, అఖండ శక్తి అనే అరింటిని కలిపి భగము అంటారు. ఆయారు కలవారినే భగవంతుడనీ, భగవతి అని అంటారు. అటువంటి భగవంతునిగా అరాధింపబడిన శ్రీకృష్ణుని చేత పలకబడినది కావడము వల్ల నే దీనికి భగవద్గీత అనే పేరు వచ్చింది. అంతేకాదు, భగవద్వాణి కనుక భగవతిగా, అద్వైతా మృతవర్షిణిగా, అంబగ,భగవద్వేషిణిగ కీర్తించబడింది. అందువలన భగవద్గీతను పూజించడం అంటే కేవలం భగవదారాధన చేసినట్లే అవుతుంది. మార్గశిర శుద్ధ ఏకాదశి ( గీతా జయంతి) నాడు గాని, మరియే పర్వది నాన గాని భక్తి విశ్వాసములతో భగవద్గీతను పూజించుకొనవచ్చును. ముందుగా దీపారాధన చేసి

శ్లో|| గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మతస్మై శ్రీ గురవేనమః ||
ఓం శ్రీ కృష్ణ పరబ్రహ్మ ణేనమః అనుకొని, అచమించవలెను.

## అచమనం

ఓం కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా, గోవిందా, విష్ణు, మదుసూదనా, త్రివిక్రమా, వామనా, శ్రీధరా, హృషీకేశా, పద్మనాబా, దామోదరా, సంకర్షణా, వాసుదేవా, ప్రద్యుమ్నా, అనిరుద్ధా, పురుషోత్తమా, అధోక్షజా, నారసింహా, అచ్యుతా, జనార్దనా, ఉపేంద్రా, హరయే, శ్రీ కృష్ణాయనమః| (శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః)||

## ప్రాణాయామం

ఉపనయనం అయిన వారు సప్త వ్యాహృతుల తోకూడిన గాయత్రీ మంత్రముతోను, మిగిలిన వారు కృష్ణ మంత్రముతో కాని, ఇతర ఉపదేశమంత్రములతో కాని ప్రాణాయామం చేయవచ్చును.

ఘంటారావం :

( దిగువ శ్లోకము చదువు చూ ఘంట వాయించవలెను)

శ్లో॥ అగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసామ్

కురు ఘంటారవం తత్ర దేవాతాహ్వాన లాంఛనమ్ ॥

సంకల్పము

మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిస్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీ మహా విష్ణోరాజ్ఞ యా ప్రవర్త మానస్యఅద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే , శ్వేత వరాహ కల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమ పాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరత ఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే.... మధ్య దేశే........ నదీ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ...సంవత్సరే .....అయనే .... ఋతౌ ... మాసే .... పక్షే .... తిథౌ ... వాసరే, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏ వంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిదౌ శ్రీమాన్ .... గోత్రః ... నామధేయః .... శ్రీ మతః...... గోత్రస్య .... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ కుటుంబస్య సౌభ్రాతృ బాంధ వస్య క్షేమ స్థయిర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్య విద్యాభి వృద్ధ్యర్థం మమ ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థం సమస్త మనో భీష్ట సిద్ధ్యర్థం శ్రీ మద్భగవద్గీతా మూలదేవతా ముద్ది శ్య తద్విరాట్ ప్రీత్యర్థం కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానఆవాహ నాది షోడ శోపచార పూజాం కరిష్యే ! ఆదౌ నిర్విఘ్నేన పరి సమాప్త్యర్థం శ్రీ మహాగణపతి పూజాం కరిష్యే । తదంగ కలశారాధనం కరిష్యే కలశం గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య । (కలశమును గంధ పుష్పాక్షలతో అలంకరించి, అందు ఒక తమల పాకును గాని మామిడి ఆకును గాని వైచి, కుడి అరచేతిని మూత వలె వుంచి)

శ్లో॥ గంగే చయమునే కృష్ణే గోదావరి సరస్వతి

నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు ॥

ఆయాంతు శ్రీ మహాగణాధిపతి పూజార్థం మమ దురితక్షయ కారకాః ॥ అనుకొని, కలశములోని ఆకుతో గాని, పువ్వుతో గాని అందలి జలమును దైవము పైన, పూజా ద్రవ్యములపైన, తమ పైన చిలకరించు కొనవలెను.

(కలశోదకేన పూజాద్రవ్యాణి, దేవమాత్మానం చ సంప్రోక్ష్య)

గణపతికి ధ్యానా వాహనాది షోడ శోపచారాదులు కావించి దిగువ షోడశ నామములతో పూజించవలెను.

గణపతి షోడ శనామములు

ఓం సుముఖాయనమః, ఓం ఏకదంతాయనమః, ఓం కపిలాయనమః, ఓం గజకర్ణ కాయనమః . ఓం లంబోదరాయనమః, ఓం వికటాయనమః, ఓం విఘ్నరాజాయనమః, ఓం గణాధి పాయనమః,

ఓంధూమకేతవేనమః, ఓం గణాధ్యక్షాయనమః, ఓం ఫాలచంద్రాయనమః, ఓం గజాననాయనమః, ఓం వక్రతుండాయనమః, ఓం శూర్ప కర్ణాయనమః, ఓం హేరంబాయనమః, ఓం శ్రీ గణాధిపతయేనమః, సర్వోపచార పూజాం సమర్పయామి. అనయామయాకృత పూజయా శ్రీ మహాగణాదిపతి సుప్రీత సుప్రసన్నో వరదో భవతు.

పిదప పుష్పాక్షతాదికములను తీసుకొని, పూర్వ విధముగా సంకల్పము చెప్పుకొని, ముందుగా శ్రీ కృష్ణుని పురుష సూక్త ముతో పూజింపవలెను. శక్తి లేని వారు కనీసము దిగువనిచ్చిన శ్రీ కృష్ణాష్టోత్తర శత నామావళి తోనైననూ పూజింపవలెను.

## శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళిః

( ప్రతి నామమునకు ముందు 'ఓం' అని చివర 'నమః' అనియు చదువవలెను)

1. ఓం శ్రీకృష్ణాయనమః
2. కమలనాథాయ
3. వాసుదేవాయ
4. ఓం సనాతనాయనమః
5. వసుదేవాత్మజాయ
6. పుణ్యాయ
7. ఓం లీలా మానుష విగ్రహా యనమః
8. శ్రీ వత్సకౌస్తుభ ధరాయ
9. ఓం యశోద వత్సలాయనమః

ఓం ఇళాపతయే నమః

10. హరిః యే

చతుర్భుజాత్త చక్రాసి గదా

శంఖాంబు జాయుధాయ

దేవకీ నందనాయ

శ్రీ శాయ

నంద గోపప్రియత్మజాయ

యమునావేగ సంహారిణే

బలభద్ర ప్రియానుజాయ

పూతనాజీవిత హరణాయ

శకటా సురభంజనాయ

నంద వ్రజజనానందినే

సచ్చిదానంద విగ్రహాయ

నవనీతవిలిప్తాంగాయ

నవనీత నటాయ

అనఘాయ

నవనీత హరాయ

పరంజ్యోతిషే

యాదవేంద్రాయ

యదూద్వహాయ

వనమాలినే

పీతవాససే

పారిజాతాపహారకాయ

గోవర్ధనాచలోద్ధర్త్రే

గోపాలాయ

సర్వపాలకాయ

అజాయ

నిరంజనాయ

కామజనకాయ

కంజలోచనాయ

మధుఘ్నే

మధురానాథాయ

ద్వారకా నాయకాయ

ముచుకుంద ప్రసాదకాయ

షోడశస్త్రీ సహస్రేశాయ

త్రిభంగినే

మధురాకృతయే

శుకవాగమృతాబ్ధీందవే

గోవిందాయ

యోగీనాం పతయే

వత్సపాలన సంచారిణే

ధేనుకా సుర భంజనాయ

తృణీకృత తృణావర్తాయ

యమళార్జున భంజనాయ

ఉత్తాలోత్తాలభేత్రే

తమాల శ్యామలా కృతయే

గోపగోపీశ్వరాయ

యోగినే

కోటి సూర్య సమప్రభాయ

ఓం దుర్యోధన కులాంతకృతేనమః

విదురాక్రూరవరదాయ

విశ్వరూపప్రదర్శకాయ

సత్య వాచయే

సత్య సంకల్పాయ

సత్యభామారతాయ

జయినే

సుభద్రా పూర్వ జాయ

విష్ణవే

భీష్మ ముక్తి ప్రదాయ

జగద్గురవే

జగన్నాథాయ

వేణు నాద విశారదాయ

బలినే

బృందావనాంతస్సంచారిణే

తులసీదామభూషణాయ

శ్యమంతకమణి హర్త్రే

నరనారాయణాత్మకాయ

కుబ్జాకృష్ణాంబరధరాయ

మాయినే

పరమ పురుషాయ

ముష్టికాసుర చాణూర

మల్లయుద్ధ విశారదాయ

సంసార తారిణే

కంసారినే

మురారినే

నరకాంతకాయ

అనాదిబ్రహ్మ చారిణే

కృష్ణావ్యసన కర్మకాయ

శిశుపాల శిరచ్ఛేత్రే

ఓం పార్థసారథియేనమః

అవ్యక్తాయ

గీతమృత మహోదధయే

కాళీయ ఫణి మాణిక్యరం

జిత శ్రీ పదాంబుజాయ

దామోదరాయ

యజ్ఞభోక్త్రే

దానవేంద్ర వినాశకాయ

నారాయణాయ

పరబ్రహ్మణే

పన్నగాశన వాహనాయ

పుణ్య శ్లోకాయ

తీర్థకృతే

వేద వేద్యాయ

| | |
|---|---|
| వృషభాసుర విధ్వంసినే | దయానిధయే |
| బాణా సురకరాంతకృతే | సర్వతీర్థాత్మకాయ |
| | జలక్రీడాసమాసక్తగోపీ |
| యుదిష్ఠిర ప్రతిష్ఠాత్రే | వస్త్రాపహారకాయ |
| బర్హిబర్హావతంసకాయ | సర్వగ్రహరూపిణే |
| | పరాత్పరాయ |

శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళి సమాప్తం

పిమ్మట భగవద్గీతా గ్రంధమును గంధ పుష్పాక్షత కుంకు మాదులతో నలంకరించి పీఠము పై నుంచి పూజించవలెను.

అధ ప్రాణప్రతి ష్ఠాపనం కృత్వా

శ్లో॥ వక్త్రాణి పంచ జానీ హిపంచాధ్యాయాననుక్రమాత్
దశాధ్యాయాః భుజాశ్చైకముదరంద్వేపదాంబుజే
ఏవమష్టాదశాధ్యాయీ వాఙ్మయీ మూర్తి రీశ్వరీ
జానీహి జ్ఞానమాత్రేణ మహాపాతక నాశినీ॥

ఓం శ్రీ గీతాయైనమః - ధ్యానం సమర్పయామి, సర్వ తీర్థమయ్యైనమః - ఆవాహయామి, అక్షరాయైనమః - ఆసనం సమర్పయామి, మలనిర్మోచిన్యైమః - పాద్యం సమర్పయామి, సత్యాయైనమః అర్ఘ్యం సమర్పయామి, విష్ణోర్వక్త్రాద్వినిసృతాయైనమః - ఆచమనం సమర్పయామి, వంద్యాయై నమః - పంచామృత స్నానం సమర్పయామి, తదుపరి శుద్ధోదక స్నానం సమర్పయామి, విశ్వ మంగళ కారిణ్యైనమః - వస్త్ర యుగ్మం సమర్పయామి, సర్వ శాస్త్రమయ్యైనమః, యజ్ఞోపవీతం తదుపరి ఆభరణాన్ ధారయామి, సర్వైశ్వర్య ప్రదాయిన్యైనమః - శ్రీగంధం సమర్పయామి, భారతామృత సర్వ స్వాయైనమః - పుష్పాక్షతాన్ సమర్పయామి.

## శ్రీ గీతా ష్టోత్తర శతనామావళిః

( ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు చదువుకొనవలెను)

| | |
|---|---|
| ఓం శ్రీ గీతా దేవ్యైనమః | ఓం వ్యాస సంగ్రధితాయైనమః |
| విమలాయై | పూతాయై |
| సుఖదాయై | సంసారమల మోచన్యై |
| ముని సంస్తుతాయై | సర్వశాస్త్రమయ్యై |
| తత్త్వార్థ బోధిన్యై | మాత్రే |
| సర్వలోక సంపూజ్యాయై | సర్వ తీర్థమయ్యై |

గంభీరాయై భవమగ్న ప్రజానౌకాయై

నిత్యాయై బంధచ్ఛేద విచక్షణాయై

నిత్య సుఖప్రదాయై భగవద్భావ సంపూర్ణాయై

భవవారధి తారిణ్యై

నైకవ్యా ఖ్యాన సంభిన్నాయై ఆధ్యాత్మిక మహాకాశ

నానాచార్యసమాదృతాయై

స్వస్వానుకూల భావార్థశోభితాయై లసత్సౌ దామినీ సమాయై

శాన్తి దాన్తి దాయై నిష్కల్మాయై

నిత్యనూతన భావార్థ దాయిన్యై నిర్మలాయై

లోక కామదాయై శాన్తాయై

ప్రాచ్య పాశ్చాత్య ఖండాంతర్ని వాసి జనమోదిన్యై సర్వతేజోమయ్యై

శుభాయై

అక్షరాయై తమోవిమూఢలోకాన్ధ

అద్వేషిణ్యై కారనోదన చన్ద్రికాయై

సర్వ కాలధర్మ ప్రబోధిన్యై శ్రుత్య న్తగతత త్వార్థ బోధిన్యై

దైవ సంపత్సు సంపన్నాయై బోధ భాసురాయై

అసుర భావాది వర్జితాయై బోధామృత పయశ్శుక్లాయై

అష్టాదశ మహాయోగ భూషితాయై పార్థవత్సతర్వాన్వితాయై

భ్రష్ట తారిణ్యై దోగ్ధ్రు కృష్ణాయై

సకలజన సముద్ధర్త్ర్యై గోరూపాయై

సమభావ విశోభిన్యై కామధేనవే

ఈర్ష్యా ప్రసూత జాత్యాది శుగన్తి కాయై

దురహంకార ఘాతిన్యై క్లిన్న పార్థ తమోహన్త్ర్యై

సకలజన క్షాత్ర ధర్మ ప్రవర్తి కాయై

సేవితాయై తత్పరాయై

కష్టవ్యచ్యుత ధీమూఢ — కలిదోష హారిణ్యై

జనసత్పథ దర్శికాయైనమః

సర్వ సన్న్యాస సంలక్ష్యాయై — పరాయై

పూర్ణ బ్రహ్మ ప్రబోధిన్యై

*ఇతి శ్రీ గీతాష్టోత్తర శతనామావళీ సమాప్తః*

ఓ మితి శ్రీ భగవద్గీతాష్టోత్తర శతనామావళీ పుష్పంజలి పూజాం సమర్పయామి, ఓం అష్టాదశాధ్యాయిన్యైనమః. నానా విధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి, ఓం భవద్వేషిణ్యైనమః ధూప మాఘ్రాపయామి, ఓం సర్వో పనిషత్సారరూపిణ్యైనమః - దీపం దర్శయామి, ఓం అద్వైతామృత వర్షిణ్యైనమః - నైవేద్యం సమర్పయామి, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, ఉత్తరాపోశనం సమర్పయామి, ఓం వ్యాసేన గ్రధితాయైనమః - తాంబూలం సమర్పయామి, ఓం భారత పంకజ స్వరూపాయైనమః - కర్పూర నీరాజనం దర్శయామి, ఓం భయ శోకాది వర్జితాయైనమః - మంత్ర పుష్పం సమర్పయామి, ఓం లోకత్రయోపకారిణ్యైనమః - ప్రదక్షిణం సమర్పయామి, ఓం సర్వజ్ఞానమయ్యైనమః - సర్వోపచార పూజాం సమర్పయామి.

అనయా ధ్యానావాహనాది షోడ శోపచార పూజయా భగవతీ శ్రీ గీతా దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు.

ఇతి శ్రీ భగవద్గీతా పూజా స్సమాప్తః

## శ్రీ భగవద్గీతా పారాయణ క్రమః

ప్రార్థనా శ్లోకములు

1. ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
   ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే ॥

2. ఓం అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం
   తత్పదం దర్శితం యేన తస్మైశ్రీ గురవే నమః ॥

3. ఓం కృష్ణం కమల పత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనం
   వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిం ॥

4. ఓం వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
   నమోవైబ్రహ్మ నిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

5. ఓం వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషం
   పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం ॥

6. ఓం నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

ఇట్లు ప్రార్థించిన తరువాత మనసు నేకాగ్రము చేసి తననర్జునిగా ఊహించుకొని, సాక్షాత్తు శ్రీ కృష్ణపరమాత్మ తనకు గీతనుపదేశించునట్లు భావించుకొని, వినియోగాదులను చెప్పుకొని పారాయణ చేయవలెను. పారాయణ సమయమున చిత్తమెంతెంత ఏకాగ్రముగనుండునో, ఫలితమున్ను అంతంత అధికముగ కలుగుచుండును.

## వినియోగాదిః

ఓమ్ అస్య శ్రీ భగవద్గీతా శాస్త్ర మహామన్త్ర స్య శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః, అనుష్టుప్ ఛందః శ్రీ కృష్ణ పరమాత్మాదేవతా, అశోచ్యానన్వ శోచస్త్వమితి బీజం, సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతిశక్తిః, అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచఇతి కీలకం, మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్ర సాదాత్తరిష్యసీతి కవచం, కిరీటినం గదినం చక్రహస్త మిత్యస్త్రం, అనాదిమధ్యాంత మనన్త వీర్యమితిధ్యానం, జ్ఞానయజ్ఞేన భగవతారాధనార్థే శ్రీ కృష్ణపరమాత్మప్రీత్యర్థే గీతాపారాయణే జపే వినియోగః ॥

## కరన్యాసము

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః -

ఇత్యం గుష్ఠాభ్యాం నమః (రెండు చేతుల బొటన వేళ్ళను రెండు చూపుడు వేళ్ళతో తాకవలెను).

న చైనం క్లేదయం త్యాపో నశోషయతి మారుతః - ఇతి తర్జనీభ్యాం నమః (చూపుడు వ్రేళ్ళను బొటన వ్రేళ్ళతో తాకవలెను)

అచ్ఛేద్యోయమ దాహ్యోఽయమ క్లేద్యోఽ శోష్యఏవచ - ఇతి మధ్యమాభ్యాంనమః (నడిమి వ్రేళ్ళను బొటన వ్రేళ్ళతో తాకవలెను).

నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః - ఇతి అనామికాభ్యాంనమః (ఉంగరపు వ్రేళ్ళను బొటన వ్రేళ్ళతో తాకవలెను).

పశ్యమై పార్థరూపాణి శతశోఽథ సహస్రశః - ఇతి కనిష్ఠికాభ్యాంనమః (చిటికెన వ్రేళ్ళను బొటన వ్రేళ్ళతో తాకవలెను)

నానా విధాని దివ్యాని నానా వర్ణాకృతీనిచ - ఇతి కరతల కరపృష్ఠాభ్యాంనమః (రెండు అరచేతుల వెనుకవైపులను క్రమముగా స్పృశించవలెను). పిదప -

## అంగన్యాసము

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః - ఇతి హృదయాయనమః (కుడి చేతితో హృదయమును స్పృశించుకొనవలెను).

న చైనం క్లేదయం త్యాపోన శోషయతి మారుతః - ఇతి శిరసే స్వాహా (శిరస్సును స్పృశించుకొనవలెను).

అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్యఏవచ - ఇతి శిఖాయై వషట్ (శిఖను తాకవలెను)

నిత్యస్సర్వగతః స్థాణురచలోయం సనాతనః - ఇతి కవచాయహుం (కుడి చేత ఎడమ భుమును, ఎడమ చేత కుడి భుమును తాకవలెను).

పశ్యమే పార్థ రూపాణి శతశో2ధ సహస్రశః - ఇతి నేత్ర త్రయాయ వౌషట్ (కుడి చేత నేత్రములను తాకవలెను).

నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతానిచ - ఇత్యస్త్రాయఫట్ (కుడిచేయి తల చుట్టూ త్రిప్పుకొని నడిమిత్రేలితో ఎడమచేత చప్పట్లు కొట్టవలెను). పిమ్మట ధ్యానము చేయవలెను.

మహాభారత ధ్యానము :

పారాశర్యవచః సరోమమలం గీతార్థ గంధోత్కటం
నానాఖ్యానక కేసరం హరి కథా సంబోధనా బోధితమ్ ।
లోకేసజ్జన షట్ప ద్తైరహరహః పేపీయమానం ముదా
భూయద్భారత పంకజం కలిమల ప్రధ్వంసినః శ్రేయసే ॥

శ్రీ కృష్ణధ్యానము :

ఓమ్ ప్రసన్న పారిజాతాయ తోత్రవే త్రైక పాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥

వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనమ్
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

భీష్మద్రోణ తటా జయద్రధ జలా గాంధార నీలోత్పలా
శల్య గ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ॥

అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాణ్డవై రణనదీ కైవర్తకః కేశవః ॥

మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్
యత్కృపా తమహం వన్దే పరమానంద మాధవమ్ ॥

యం బ్రహ్మావరుణేంద్ర రుద్ర మరుతః స్తున్వన్తిదివ్యైః స్తవ్యైః
వేదైస్సాంగ పదక్రమోపనిషదైర్గాయ న్తియం సామగాః ॥

ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తియం యోగినో
యస్యాన్తం న విదుః సురాసురగణా దేవాయ తస్మైనమః ॥

శ్రీ వ్యాస ధ్యానము :

నమో2స్తుతే వ్యాస విశాలబుద్ధే
పుల్లారవిందాయత పత్రనేత్ర
యేన త్వయా భారత తైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥

శ్రీ గీతాధ్యానము :

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేనస్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణముని నా మధ్యే మహాభారతమ్

అద్వై తామృత వర్షిణీం భగవతీ మష్టాదశా ధ్యాయినీ
మమ్బత్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥

గీతా కల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితమ్
వేదవ్యాస వివర్ధితం శ్రుతి శిరోబీజం ప్రబోధాం కురమ్

నానా శాస్త్ర రహస్య శాఖ మరతిక్షాన్తి ప్రవాలాంకితమ్
కృష్ణాంఘ్రిద్వయ భక్తి పుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినామ్ ॥

సంసారం సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నన్దనః
పార్థో వత్సః సుధీర్భోక్తాదుగ్ధం గీతామృతం మహత్ ॥

ఇట్లు, ఎల్లరునూ ధ్యానించి, మనసు కుదురు చేసుకొని, గీతాపారాయణ మారంభించవలెను. ఒకరోజునకొక అధ్యాయము చొప్పునైనను చదువుట మంచిది. పారాయణానంతరము గీతామహాత్మ్యమందలి మొదటి మూడు శ్లోకములను పఠించుకొనవలెను. ఇతి పారాయణక్రమః.

## 7. పద్మపురాణాంతర్గత - ప్రత్యేకాధ్యాయ గీతా పారాయణా ఫలితములు

### 1. ప్రథమాధ్యాయ పారాయణా ఫలము

పూర్వజన్మ స్మృతులు, పాపనాశనము, మంచి జన్మ

శ్లో॥ తస్మా ద ధ్యాయ మాద్యం యః పఠేత్ శ్రుణుతే స్మరేత్
అభ్యాసేత్తస్య నభవేత్ భవాంభోధి ర్దు రుత్తరః ॥

పూర్వము సుశర్మయను బ్రాహ్మణుడు సర్వ విధముల భ్రష్టుడై, మరణించి, నరకమను భవించి, మరు జన్మము నందు ఎద్దుగా జన్మించెను. ఒకనాడా ఎద్దు పర్వత ప్రాంతము నందు బరువులు మోయుచు, నేలకూలి మరణ యాతన పొందసాగెను. ఆ దారిన పోవు బాట సారులా ఎద్దు యాతనకు వగచు చుండిరి. వారిలో గల ఒక వేశ్య చాలా చింతించి నేనే మైన పుణ్యము చేసి యున్నచో ఆపుణ్యము ఈ ఎద్దునకు సంక్రమించును గాక. దీనికి సద్గతులు కలుగును గాక. అని మనసారా స్మరించుకొని నది. ఆ పుణ్యవశమున ఎద్దు మరుజన్మము నందు బ్రహ్మజ్ఞానిగా జన్మించి, పూర్వజన్మ స్మృతి వలన ఆ వేశ్య

యింటికి పోయి, తనకు ధారబోసిన పుణ్యమేమిటని అడుగగా ఆమె తనకేమి యును తెలియ దన్నది. కాని ఆమె పెంపుడు చిలుక బ్రహ్మ జ్ఞానిని చూచి, అయ్యా ! తొలుత నే నొక ముని యాశ్రయమున మసలెడి దానను. ఆ ఋషి నిత్యమును భగవద్గీత ప్రధమా ధ్యాయమును పఠించెడి వాడు. క్రమముగా నాకది అలవాటయినది. ఇంత లో విధి వశమున నేనీ వేశ్య పరమైతిని. నా అలవాటున నేను పారాయణ చేయుచుండగా నా మీద ప్రేమతో ఈమె దానిని శ్రద్ధగా ఆలకించెడిది. అదియే ఆ పుణ్యము అని చెప్పినది. ఔరా ! గీత ప్రథమాధ్యాయ శ్రవణమునకే ఇంత పుణ్య మైనచో ఇక పారాయణ పుణ్యము చెప్పవలెనా ? యని ఆశ్చర్య పడుచూ ఆ జ్ఞానియు, ఈ సానియు కూడా నిత్యమును ఆ అధ్యాయ మునుప పఠించి జన్మాంతరమున ముక్తి నొందినారు.

## 2. ద్వితీయాధ్యాయ పారాయణా ఫలము

ఆత్మ జ్ఞానము

శ్లో॥ శిక్షిత స్తేన పూతాత్మా పరన్నధ్యాయ మాదరాత్
ద్వితీయ మాససాదోచ్చైః నిర వద్యం పరం పదమ్ ॥

పూర్వము దేవ శర్మయను సదాచార సంపన్నుడొకడు ఆత్మజ్ఞానాబిలాషయై. యొక సాధువు నాశ్రయింపగా, అ సాధువతనిని మిత్ర వంతుడను మేకల కాపరి వద్దకు పంపెను. దేవ శర్మయు మిత్ర వంతు నాశ్రయింపగా, అ తడిట్లు చెప్పెను. "అయ్యా! నేనొక నాడొక చోట మేకలను కాయుచుండగా నొక పెద్ద పులి వచ్చినది. దానిని చూచి నేనును, మందయు చెల్లా చెదురు కాసాగినాము. కాని కొన్ని మేకలు పులికి చిక్కి పోయినవి. అయినను ఆ పులి మేకలను తినలేదు. మేకలు కూడా దానితో స్నేహముగా నున్నవి. నేను ఆశ్చర్యపడి, అట్లు జరుగుటకు కారణమేమిటాయని యోచించి అచటి ఒక వృద్ధ మర్కటమును విచారించగా అది ఇట్లు తెలియ బరచినది. "ఓ మిత్ర వంతుడా ! పూర్వమొక యోగీంద్రుడిచ్చటి శిలా ఫలకముల పై గీత ద్వితీ యాద్యాయమును చెక్కించి, సుకర్మయను వాని కీయగా అతడిందే దానిని పారాయణ మొనరించి ఆత్మ జ్ఞానము నందెను. అట్టి సిద్ధ పురుషుడు మసలిన తావున పులి మేకలు కలసి మెలసి యుండుటలో ఆశ్చర్యమేమి ? అనెను. ఆ వానరము సూచన మేరకు నేనా శిలల మీద గీత రెండవ అధ్యాయమును పారాయణ చేయుచున్నాను. మిత్ర వంతుడట్లు చెప్పినది విని దేవశర్మయు ఆ శిలల మీద నున్న భగవద్గీత ద్వితీయాధ్యాయమును పఠించుచు ఆత్మజ్ఞానమును పొందెను.

## 3. తృతీయాధ్యాయ ఫలము

పాపనాశనము, ప్రేతత్వ విముక్తి

పూర్వము జడుడను వాడు స్వకులాచారము లెల్ల వీడి, దురాచార పరుడై చరించు చుండగా [illegible] కొందరు దొంగలాతని నొక చెట్టు క్రింద వధించిరి. అతడు కడుపాపాత్ముడగుటచే [illegible]పొంది, ఆచెట్టు నే ఆ శ్రయించుకొని యుండి పోయెను. కాలాంతరమందాతని పుత్రుడు [illegible] తన తండ్రి యున్న చెట్టు క్రిందనే విశ్రమించి యాదాలాపము గా భగవద్గీత యందలి

మూడవ అధ్యాయమును పఠింపగా జడుడు ప్రేత రూపమును విడిచి దివ్య దేహముతో, విమానారూఢుడై స్వర్గమున కేగుచూ కుమారుని జూచి, నాయనా ! నీవిపుడు గీత 3 వ అధ్యాయమును పఠించుటచే,నా ప్రేతత్వము తొలగి పోయినది. కావున, అత్యంత మహిమాన్విత మగు నీ తృతీయాధ్యాయమును నిత్యమును పారాయణ చేసి నీవును తరింపు మని ఆశీర్వదించెను.

## 4. చతుర్థాధ్యాయ ఫలము

చెడు ఆలోచనలు తొలగుట శాప విమోచనము

శ్లో॥ నిత్య మాత్మరతస్తుర్యం జపత్యధ్యాయ మాదరాత్
తదభ్యాసాదదుష్టా త్మాన ద్వం ద్వైరభి భూయతే ॥

పూర్వము సత్యతపు డను వాని తపమును చెఱపుటకు గాను, ఇంద్రుడిరువురప్సర సలను నియోగించెను. వారి చర్యలకు కోపించిన ఋషి వారిని రేగి చెట్లు గా పడియుండుడని శపించెను. ఆ అప్స రసలట్లే బదరీ వృక్షములుగా మారిపోయిరి. కొన్నాళ్ళకు గీతా పారాయణ శీలియగు భరతుడను వాడా రేగుల నీడను చేరి, గీత చతుర్థాధ్యాయమును పారాయణ చేయగా ఆ దేవకాంతలు శాపవిముక్తలై గీతా మహిమను కొనియాడుచు తిరిగి తమ స్థానముల కేగిరి.

## 5. పంచమాధ్యాయ ఫలము

అజ్ఞాన (పశు పక్ష్యాది ) జీవములు సైతము తరించుట

శ్లో॥ గీతానాం పంచమాధ్యాయ మావర్తయతి సర్వదా
తేన పుణ్యేన పూతాత్మాయయౌబ్రహ్మసనాతనమ్ ॥

అరుణ, పింగళుడు అను దంపతులు నిత్య కలహశీలు రై కాపురము చేసి జన్మాంతరమున ఒక అడవిలో చిలుక, గ్రద్ధగా పుట్టిరి. అయిననూ పూర్వ జన్మ విరోధ వశమున ఈ శుక గృధ్రములు రెండునూ నిత్యమునూ ఘర్షణ పడుచూ ఒక నాడొక నర కపాలమందు పడి మరణించినవి. తక్షణమే విష్ణు పార్షదులు వచ్చి వారిని వైకుంఠ మునకు గొని పోయత్నింపగా "అయ్యా ! పాపచింతనా, పాపకృత్యములు తప్ప అన్యమెరుగని మాకేల ఈవైభోగ మని ప్రశ్నింప వైష్ణవులు నవ్వుచూ పాప పుణ్యములు మీ దేహములకే గాని ఆత్మలకు లేవు. మరియును మీ శరీరములు రాలిన పుఱ్ఱె భగవద్గీత పంచమాధ్యాయమును నిత్యమును పారాయణ చేయు పుణ్యాత్ము న దగుటచే మీకు వైకుంఠ వాసము తప్ప దని చెప్పిరి.

## 6. షష్ఠాధ్యాయ ఫలము

దివ్య తేజోప్రాప్తి

పూర్వము జనశ్రుతుడను మహాధర్మాత్ముడగు రాజుండెడి వాడు. అతడొకనాడు తన డాబా పై విశ్రాంతి గైకొను చుండగా అటుగా పోవుచున్న హంసల గుంపు నందొకటి దుడుకు గా ప్రవర్తించినది. అపుడా గుంపు నందలి హంస ఓ కుర్ర హంసా ! ధర్మాత్ముడగు రాజు ముందు దుడుకు పనికి రాదని

మందలింపగా ఆ హంస నగుచూ అ! వీడేమి రై క్వని కంటెను తేజో వంతుడాయే మని అపహసించినది. ఆ సంభాషణము వినిన రాజు అచ్చెరు వంది రైక్వుడెవరో వెదకి రమ్మని చారుల నంపెను. వారు వెదకి వెదకి వచ్చి అయ్యా ! అట్టి పేరుగల వాడెవడునూ కనుపడలేదు. కాని, కాశ్మీర దేశమందలి శ్రీ మాణిక్యేశ్వరాలయము చెంత మాత్రము ఒక మహాతేజశ్శాలి యున్నాడు. అతని పేరు రైక్వుడని చెప్పబడు చున్న దని విన్న వించిరి. తక్షణమే రాజు అనేక కానుకలతో సహా వెళ్ళి అతనిని దర్శించి, అయ్యా ! దేనినీ ప్రాశించవు, మరిదేనినీ ఆశించవు. నీ తేజస్సున కేది కారణ మనియడుగగా అ రైక్వుడు అయ్యా! తేజస్సో ఓ జస్సో నేనెరుగను. నా యందేమి తోచినను అది నేను నిత్య పారాయణ చేయు గీతయందలిషష్ఠాధ్యాయ మహాత్మ్యమే సుమా ! అనుచు ఇట్లు పలికెను.

శ్లో॥ గీతానాం షష్ఠ మాధ్యాయం జపామప్రత్యహం నృపః
తేనైవ తేజోరాశి ర్మేసురాణామపి దుస్సహః ॥

## 7. సప్తమాధ్యాయ ఫలము

సమస్త జీవ జాత సంసార తరణము

పూర్వము శంకు కర్ణుడను వాడు పొరుగూరునకని పోయి, ఎంతకునూ రాకుండుటచే, అతని పుత్రులొక సిద్ధు నాశ్రయించి తండ్రి జాడ తెలుపమని కోరిరి. అతడు దివ్య దృష్టిచే జరిగినది తెలుసుకొని నాయనా ! మీ తండ్రి ఎపుడో మరణించినాడు. మీ తండ్రిగా వున్నపుడు తన సంపాదన నొక చోట భద్ర పరచినాడు. ఆ లోభము తీరక మరల పామై పుట్టి అ నిధికి కావలి కాయుచున్నా డని చెప్పి వారిని గొంపోయి చూపించెను. పుత్రులు దుఃఖించి ఈ సర్ప జన్మ నుండి తమ తండ్రి నుద్ధరించుకొను ఉపాయమేమని అడుగగా ఆసిద్ధుడిట్లు చెప్పెను.

శ్లో॥ గీతానాం సప్తమాధ్యాయ మంతరేణ సుధామయం
జన్మ వర్జరామృత్యుః దుఃఖ వారణ కారణమ్॥

శ్లో॥ సప్తమాధ్యాయ జపతో ముక్తి భాజో భవస్తతః
దేవమిష్ట తమం జ్ఞాత్వా నిర్వాహణార్పిత బుద్ధయః॥

అని చెప్ప బడుటచే అనుష్టాన పూర్వకముగా గీత యందలి యేడవ అధ్యాయమును పారాయణ మొనరించి ఆ ఫలమును మీ తండ్రికిధారబోయుడనగా అపుత్రులట్లే చేసి శంకు కర్ణున కుత్తమ పదమును ప్రాప్తింప చేసిరి.

## 8. అష్టమాధ్యాయ ఫలము

సర్వ విధదుర్గతీ నాశనము

శ్లో॥ జపన్ గీతా ష్ట మాధ్యాయ శ్లోకార్థం నియ తేంద్రియః
సంతుష్టవానహం దేవి తదీయ తపసా భృశం॥

పూర్వము భావశర్మయను వాడు భ్రష్టాచారుడగుటచే మరు జన్మలో తాడి చెట్టయి పుట్టినాడు. అట్లే, కుమతి కుశీవలుడు యను దంపతులు దుష్కర్ములై బ్రహ్మరాక్షసులైనారు. ఆ బ్రహ్మరాక్షస దంపతులొకనాడా తాడి దిగువ నీడలో కూర్చొని నారు. అపుడు భార్య మనకు బ్రహ్మరాక్షసత్వమెపుడు పోవు నని అడుగగా భర్త కర్మ వీడి, ఆధ్యాత్మ బుద్ధితో బ్రహ్మము నెరిగినచో పోవు ననెను . వెంటనే భార్య కింతత్ బ్రహ్మ ? కి మధ్యాత్మం ? కిం కర్మ పురుషోత్తమ ? అని ప్రశ్నించినది. ఆమె మాములుగానే ప్రశ్నించిననూ అది భగవద్గీత 8 వ అధ్యాయ ప్రధమ శ్లోక పాదమగుటచే ఆఉచ్ఛారణ మాత్రమున వారి బ్రహ్మ రాక్షసత్వములతో బాటుగానే తాడి చెట్టుకు కూడా ఉత్తమ గతి లభించి యాధా రూపములు పొందుట జరిగింది.

## *9. నవమాధ్యాయా నుష్టాన ఫలము*

ప్రతి గ్రహణ పాప నాశనము

పూర్వమొక రాజు, ఒక విప్రునకు కాల పురుష దానము చేయగా, ఆ విగ్రహము నుండి చండాల దంపతులావిర్భవించి ఆ బ్రాహ్మణుని బాధింప జొచ్చిరి. అంతలోనే విష్ణు పార్షదులే తెంచి, ఆ చండాలురను తరిమి గొట్టి విప్రుని కాపాడిరి. ఇదంతయును ప్రత్యక్షముగా చూచిన రాజు ఇదేమి మహిమ స్వామీ! యని యడుగగా ఆబ్రహ్మణుడు నవ్వుతూ

శ్లో॥ గీతాయానవమాధ్యాయం జపామిప్రత్యహం నృప
నిస్తీర్ణాశ్చా పద స్తేన కుప్రతి గ్రహ సంభవాః ॥

శ్లో॥ గీతాయా నవమాధ్యాయ మంత్రమాలా మయాస్మృతా
తన్మా హాత్మ్యమిదం సర్వం త్వమవేహిమాహీపతే ॥

ఓ రాజా ! నేను రోజూ గీత 9 వ అధ్యాయం పారాయణ చేస్తాను. ఆ మహాత్యం వల్లనే నేను తీసుకునే ఇటువంటి దానాల వలన వచ్చే పాపం నశించి పోతుంది అని చెప్పెను.

## *10. దశమాధ్యాయ ధారణా పుణ్యము*

అనంతమగు దైవ సహాయము

శ్లో॥ దశమాధ్యాయ మహాత్మ్యాత్తత్వ జ్ఞానం సుదుర్లభం
లబ్ధమే తేన మునినా జీవన్ముక్తి రియం తథా॥

పూర్వ మొకపరి బ్రహ్మదేవుని వాహన జాతికి చెందిన ఒక హంస ఒకానొక పద్మలతచే గీత దశమాధ్యాయమును విని చింతన చేయుటచే మరుజన్మమున నొక విప్రుడై పుట్టి పూర్వ జన్మ జ్ఞానము చే నిత్యమును దశమాధ్యాయమును స్మరించుచుండుటచే శివుడెల్ల పుడునూ అతని వెన్నంటి యుండెడి వాడు. ఈ విషయమును శివుడే స్వయముగా భృంగీ శ్వరునితో చెప్పియున్నాడు.

## 11. ఏకాదశాధ్యాయ ఫలము

రాక్షస పీడా నివారణం

శ్లో॥ నిష్కర్మతయా ప్రాపుస్తే పరమం పదం
ఏకాదశస్య సామర్థ్యా దధ్యాయస్య భవిష్యతి॥

పూర్వం ఒక రాక్షసుని దురాగతాలకు తట్టుకోలేక గ్రామాధికారులా తనితో ఒక ఒప్పందమునకు వచ్చినారు. ఆ రీతిని రాత్రి వేళ వీధులలో పడు కొను వారి నా రాక్షసుడు భక్షించుటకును ఇతురుల జోలికి పోకుండుటకును కట్టుబాటయినది. ఈ విషయము తెలియని వారనేకమంది అరక్కసునకు బలికా సాగిరి. ఇట్లుండగా సునందనుడను వాడు కొందరితో కలసి యాత్రలు చేయుచు రాత్రి కాగ్రామము చేరి అచట విశ్రమించెను. అర్ధ రాత్రి వేళ వచ్చిన రాక్షసుడు ఒక సునందుని తప్ప, తక్కిన వారి నందరినీ తిని పోయెను. మరునాడు గ్రామాధికారులు వీధిలో పండు కొనియు బ్రతికియున్న సునందుని చూచి ఆశ్చర్యపడి అతనిని సాగనంపి పిదప రాక్షసుని చేరి కారణ మడుగగా "వాడెవడో గీత 11 వ అధ్యాయమును నిత్యము పారాయణ చేయుచుండును. కావున వాని జోలికి పోవు శక్తి తనకులే" దనెను. అంత గ్రామాధికారులు ప్రజలెల్లరి చేతను గీత 11 వ అధ్యాయమును పారాయణ చేయింపగా క్రమముగా ఆ రాక్షసుడు తన బలగముతో సహా ఊరు వదలి పారిపోయెను.

## 12. ద్వాదశాధ్యాయ ఫలము

రహోజ్ఞానము, దివ్య శక్తులు

పూర్వమొక రాకుమారుడు లక్ష్మీదేవి ఆదేశము పై సిద్ధ సమాధి యను వాని నాశ్రయించి, "అయ్యా! నా తండ్రి అశ్వమేధము చేయుచుండగా గుర్రము తప్పి పోయినది. తండ్రియు మరణించినాడు. గుర్రము దొరకనిదే యాగము పూర్తి కాదు. తండ్రికి సద్గతులు లేవు. కాన, ఆ గుర్రము విషయమై అజ్ఞాపింపుడ"ని కోరగా-ఆ సిద్ధ సమాధి తన శక్తిచే దేవతలను పిలిచి ఇంద్రుని చే దాచబడిన గుర్రము నా రాకు మారున కిప్పించి నాడు. దాని కచ్చెరువడిన అతగాడు "తమ కింత దివ్య శక్తి ఎట్లు కలిగె"నని యడుగగా అందులకా సిద్ధ సమాధి.

శ్లో॥ గీతానాం ద్వాదశాధ్యాయం జపామ్యహమతన్ద్రితః
తేన శక్తిరియం రాజన్ మయా ప్రాప్తోऽసి జీవితం ॥

"ఓ రాజా ! నేను భగవద్గీతలోని 12 వ అధ్యాయమును నిత్యమును పారాయణ చేయుట చేతనే ఈ శక్తి కలిగినది" అనిచెప్పెను.

## 13. త్రయోదశాధ్యాయ ఫలము

పాప విముక్తి-సద్గతి

శ్లో॥ గీతా త్రయోదశాధ్యాయా ముద్గిరన్త మనారతం
తతస్తచ్ఛ్రవణాదేనముక్తా శ్వ పచవిగ్రహాత్॥

పూర్వమొక బ్రాహ్మణ స్త్రీ దూరాచారిణి యై వర్ధిల్లి మరు జన్మమున ఛండాల స్త్రీగా పుట్టినది. అఛండాలి నాటిజృంభకా దేవాలయమున వాసుదేవుడను వానిచే నిత్యపారాయణ చేయబడుచున్న గీత 13 వ అధ్యాయమును నిత్యము వినుటచే అ జన్మములోనే సద్గతులను పొందగలిగినది.

## 14. చతుర్దశాధ్యాయ ఫలము

అత్మస్మృతి, శత్రు జయం

ఒకరాజు వేటకు పోయెను, వేటకుక్క కుందేలును తరుమ సాగెను. అంతలోనే అవి రెండును. ఒక అశ్రమ ప్రాంతమందలి బురద ప్రాంతమునకు చేరి శత్రుత్వమును మరచి స్నేహితుల వలె అడుకొనసాగినవి. అది చూచి రాజాశ్చర్య పోయెను. ఇంతలోనే ఆశ్రమము నుండి వెలిక వచ్చిన 'వత్సు'డనుముని నీ విషయమై అడుగగా అ వత్సుడు నవ్వి

శ్లో॥ చతుర్దశంతు అధ్యాయం జపామ ప్రత్యహం నృప
మదీయ చరణాం బోజ ప్రక్షాళన జలేలుఠన్॥

శ్లో॥ శశస్త్రి దివమాపన్న శ్శున క్యాసహ భూపతే ॥

"నేను నిత్యము భగవద్గీత 14 వ అధ్యాయమును పారాయణ చేయుచుండుటచే నేను కాళ్ళు కడుగుకొను స్థలమును చేరగనే ఈ కుక్కయు, కుందేలును జాతి వైరములు మరచి అత్మస్మృతి తోనలరుచున్నవి. ఇదంతయు 14 వ అధ్యాయ పారాయణా ఫలమే" అని చెప్పెను.

## 15. పంచదశాధ్యాయ ఫలము

ఉత్తమ గతి ప్రాప్తి

శ్లో॥ అథ పంచదశాధ్యాయ శ్లోకార్థం లిఖితం క్వచిత్
తతో వాచయతః శ్రుత్వా నిరగాత్తురగోదివం॥

పూర్వమొక రాజు వేటకు పోయి విశ్రాంతి తీసుకొనుచుండగా ఒక తాళ పత్రము ఎగిరి వచ్చినది. రాజు దానిని తీసి అందులోని విషయమును చదువగా దానిని వినిన రాజు గారి గుఱ్ఱము తక్షణమే దివ్యరూపము నొంది నింగి కెగసిపోయినది. అచ్చెరు వందిన రాజు అచ్చేరు వలోని అశ్రమమున కేగి ఋషులకీ సంగతి చెప్పగా, వారా తాళ పత్రము తమదేననియు దాని మీద గీత 15 వ అధ్యాయములోని సగము శ్లోకమున్నదనియు అ శ్లోకమును వినుట చేతనే గుఱ్ఱము సద్గతి నొందినదనియు చెప్పిరి. అంతట రాజు అ 15 వ అధ్యాయపు పారాయణాపానాదులువారి ద్వారా తెలుసుకొని, ఆచరించి, తరించెను

## 16. షోడశాధ్యాయ ఫలము

ధైర్య సాహసములు, జంతు వశీకరణము

ఒకప్పుడు ఒక రాజుగారి ఏనుగు కట్లు త్రెంచుకొని పట్టణము పై పడి రట్టు చేయసాగెను. దాని నెవరునూ పట్టలేకున్న సమయమున ఒక సాధారణ పౌరుడు ధైర్యముగా ముందుకు వచ్చి దానిని నిమురగా అది అదుపులోనికి వచ్చినది. అందుల కబ్బుర పడిన పురజనులనూ, రాజునూ, అ శక్తి యేమిం టని యాతని ప్రశ్నింపగా అతడు నగుచూ

శ్లో॥ గీతాయా షోడశాధ్యాయ శోలకాన్కతి పయానహం
జపామి ప్రత్యహం భూపతేనైతా స్సర్వ సిద్ధయః ॥

అయ్యా ! నేను నిత్యమును భగవద్గీత 16 వ అధ్యాయమును పఠించుట చేతనే ఇట్టి శక్తి కలిగినదని చెప్పెను.

## 17. సప్త దశాధ్యాయ ఫలము

సర్వవ్యాధి నివారణం

శ్లో॥ గీతా సప్త దశాధ్యాయ జాపకం ద్విజమానయ
తేనాయం మామకోరోగ శ్శామ్యత్యత్ర నసంశయః॥

పూర్వమొక రాజుగారి ఏనుగు జబ్బు పడినది. ఎందరు వైద్యులును తగ్గింపలేకపోయిరి. అది చనిపోవుననిరి. రాజు దానిని చూచుటకు రాగా ఆ ఏనుగు హీనస్వరమున రాజా ! భగవద్గీత 17 వ అధ్యాయమును పారాయణ చేయు వానిని పిలిపించి నా ముంగిట పారాయణ చేయించిన చో వ్యాధి కుదురునని చెప్పెను. రాజట్లే చేయింపగా ఏనుగు చెప్పినట్లే జరిగినది.

## 18. అష్టాదశాధ్యాయ ఫలము

సర్వ పుణ్య, సిద్ధి ప్రదం

పూర్వము విష్ణుదూత లోక పురుషుని తెచ్చి ఇంద్రుని సింహాసనము పై కూర్చుండ బెట్టి కొన్నాళ్ళతడే ఇంద్రునిగా నుండు నని శాసించిరి. అంత ఇంద్రుడు వైకుంఠమునకేగి ఓ నారాయణా ! నా సింహాసనము ఎక్కుటకు వాడేమి పుణ్యము చేసెనని యడుగగా శ్రీ హరి నవ్వుచూ అతడు గీత 18 వ అధ్యాయములోని 5 శ్లోకములను నిత్యమూ జపించెడి వాడు. అందు చేతనే ఇంతటి వాడయినా డని తెల్పెను.

శ్లో॥ జపత్యష్టాదశాధ్యాయే గీతానాం శ్లోకపంచకం
యత్పుణ్యేనచ సంప్రాప్తం తవసామ్రాజ్య ముత్తమం ॥

అది మొదలు ముక్కోటి దేవతలునూ నిత్యమునూ గీత 18 వ అధ్యాయమును పారాయణ చేయసాగిరి.

### శుభాగీత శ్లోకాః

ఓం

1. వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పాదితౌ
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥

2. జయత్యతి బలోరామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతు సుగ్రీవోరాఘవే ణాభి పాలితః ॥

3. ఆపదా మపహర్తారం దాతారం సర్వ సంపదాం
లోకాభి రామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం ॥

4. మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్ధయే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం ॥

5. శ్రీ వాగ్దేవీం మహాకాళీం మహాలక్ష్మీం సరస్వతీం
త్రిశక్తి రూపిణీ మంబాం దుర్గాం చండీం నమామ్యహం ॥

6. యశ్మివో నామరూపాభ్యాం యాదేవి సర్వ మంగళా
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే ॥

7. నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥



భగవద్గీత మనస్సు సంసారం

ఓం

చేతో భృంగ ! భ్రమసి వృధా భవ
మరు భూమౌ విరసాయామ్
పిబ పిబ గీతా మకరందం
మురరిపు ముఖ కమల భవాద్యమ్ ॥

మనస్సు అనబడే ఓతుమ్మెదా ! రసహీనమైన సంసారమును మరు భూమి నందేల వృధా సంచారము ? రమ్ము మురహరి యగు శ్రీ కృష్ణుని ముఖ కమలము నుండి వెలువడిన భగవద్గీతయను తేనియను త్రావుము.

శ్లో॥ గీతా గంగా చ గాయత్రీ గోవిందేతి హృది స్థితే
చతుర్గకార సంయుక్తే పునర్జన్మ న విద్యతే ॥

గీత, గంగ, గాయత్రి, గోవిందుడు అను ఈ నాలుగు గకారాద్యములును ఎవరికి హృదయస్థమో వారు పునర్జన్మము లేని వారై మోక్ష మందెదరు.

*ఏక శ్లోకీ గీత :*

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణోయత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతి ర్మమ॥

భ.గీ 18...78

భావము : యోగీశ్వరుడగు శ్రీ కృష్ణుడును, ధనుర్ధారియగు అర్జునుడును ఎక్కడ ఉంటారో అక్కడ లక్ష్మీ, విజయము, ఐశ్వర్యము, ఉంటాయనేదే నా దృఢమైన నిశ్చయము.

......... సంజయుడు

సప్త శ్లోకీ గీత :

ఓమిత్యే కాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామను స్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం సయాతి పరమాంగతిమ్॥ 8...13

స్థానే హృషీ కేశ తవప్రకీర్త్యా జగత్ప్రహృష్య త్యనురజ్య తేచ
రక్షాంసి భీతాని దిశోద్రవన్తి సర్వే నమస్యన్తి చసిద్ధ సంఘాః ॥

సర్వతః పాణి పదం తత్సర్వతో2క్షి శిరోముఖమ్
సర్వతః శ్రుతి మల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥ 13-14

కవింపురాణమను శాసితార మణోరణియాంస మనుస్మరేధ్యః
సర్వస్య ధాతార మచిన్త్యరూప మాదిత్య వర్ణం తమసః పరస్తాత్॥ 18..... 9

ఊర్ధ్వ మూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ 15......1

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్ జ్ఞాన మపోహనంచ
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంత కృద్వే దవిదేవ చాహమ్ ॥ 15......15

మన్మ నాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥ 9....34

## 8. గీతా ప్రాదుర్భావము

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థా నమ ధర్మస్య తాదాత్మానం సృజామ్యహం ॥

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభ వామియుగే యుగే ॥

ప్రస్తుత వైవస్వతమన్వంతరములోని ద్వాపర యుగము అంతమగు సమయమున అసంఖ్యాకులైన రాక్షసులు అనగ కంస, జరాసంధ, శిశుపాల, నరకాసురాదులు రాజ వేషధారులై భూమి ని ఆక్రమించి ధర్మమును నశింప చేయుచు, అ ధర్మమును పెంచుచు, సాధుహాని చేయుచు, దుర్మార్గులకు స్థానమును కల్పించుట చేత పాపభారము పెరిగినది.

భూదేవి గోరూప ధారిణియై బ్రహ్మాదులను వెంటనిడుకొని వైకుంఠములోని శ్రీ మహా విష్ణువును ప్రార్థింప అయన ఆమె మొరనాలకించి, భూ భారము ను తగ్గించుటకు అవతరింతునని చెప్పెను. తత్ఫలితముగ దేవతలు , బ్రహ్మవిద్య (హ్లాదిని ), ఆది శేషుడు, లక్ష్మీ మొదలగు పరివారముతో విష్ణుమూర్తి కృష్ణునిగా అవతరించెను. విష్ణుమూర్తి అవతారములన్నింటిలోను కృష్ణావతారము పరిపూర్ణమైనది. వృషభలగ్న

రోహిణి నక్షత్రము అష్టమీతిధి శ్రావణ మాసములో రాత్రి సమయములో దేవకీ వసుదేవులకు భగవానుడు జన్మించెను. బ్రహ్మ విద్య యోగ మాయగాను, అది శేషుడు బలరాముని గను అవతరించగ దేవతలు తగిన రీతిగా భూలోక మందు అవతరించిరి. కృష్ణుడు యశోద వద్ద పెరిగెను. కృష్ణుడనగ కష్టములు తొలగించి ముక్తి ప్రసాదించు వాడని యర్ధము.

క్లీం బీజ స్వరూపుడైన శ్రీ కృష్ణుడు కాళికా దేవి అంశ సంభూతుడని నీల దేహుడని దేవీ పురాణము తెల్పు చున్నది. వ్యాస విరచిత మార్కండేయాంతర్గత ( మార్కండేయ పురాణము ) సప్త శతియందు కూడా కృష్ణుని ప్రస్తావన కలదు. నారాయణుడు విష్ణువు. నారాయణి పరాశక్తి. భాగవతము దశమస్కంధములో (వ్యాసుడు, పోతన) కృష్ణుని శైశవము నుండి రుక్మిణీ కళ్యాణము వరకు బాగుగ వర్ణింపబడినది. శ్రీ కృష్ణుడు శైశవములోని 2 నెలల ప్రాయములో పూతన యను రక్కసి చనుగుడిచి దానిని సంహరించి, మోక్షము నిచ్చెను. 3 వ నెలలో శకటాసురుని సంహరించి తన అవతార లక్ష్యమునకు ప్రారంభము చేసెను. సంవత్స ర ప్రాయము లో మట్టితిని యశోదకు విశ్వరూపము చూపెను. ఆ విశ్వరూపమును యశోద కలయోవైష్ణవ మాయమో అనునట్లు దర్శించి తరించెను 5 వ యేట బృందా వనమున ప్రవేశించెను. నేడు అక్కడ గొప్ప దేవాలయము నిర్మించిరి. 7 వయేట గోవర్ధన గిరిని యెత్తి గోపాలుర పూర్వాచారములలో మార్పులు తెచ్చి ఇంద్రునకు జ్ఞానోదయము కలుగునట్లు చేసెను. అట్లే తన శక్తిని పరీక్షింప తలచిన బ్రహ్మకు కూడా ఆశ్చర్యము కలుగునట్లు సంవత్సరము పాటు తాను గోరూప, గోపాల రూప ధారియై సంచరించి విశ్వరూపము చూపెను. గోపికా వస్త్రా పహరణ నెపముతో గోపికలు చేసిన కాత్యాయనీ వ్రత ప్రాశస్త్యము ను తెల్పి వారి వ్రతము పూర్తి గావించెను. తన వేణు గాన మాధుర్యముతో పశువులు, గోపికలు, గోపాలురు మొదలుగా గల సకల జగత్తు కు ఆనందము కల్గించెను. అట్లే తనకు విద్య నేర్పిన సాందీప్య మాహామునికి పుత్ర భిక్ష పెట్టి గురువుకు ఆనందము కల్గించెను. గోలోక వాసులగు రాధాకృష్ణులే భూలోకమున జన్మించి నట్లు బ్రహ్మ వైవర్త పురాణము, దేవీ భాగవతాదులందు చెప్ప బడినది.

శ్రీ కృష్ణుడు కంసుని సంహరించి తన తల్లి దండ్రులకు కారాగారము నుండి విముక్తిని కల్గించెను. తాత గారికి రాజ్యము నిచ్చెను. ఈ విధముగా అన్ని వర్గముల వారికి ఆనందము కల్గించెను.

దైవం మానుషరూపేణ అని పెద్దలు చెప్పినట్లు సర్వజ్ఞత్వాది లక్షణములతో అణిమాది సిద్ధులతో కోటి సూర్యప్రభా సమానుడైన శ్రీ కృష్ణుడు 12వ యేట కంసుని వధించెను. కంసుని తండ్రియైన నుగ్రసేనునకు రాజ్యము ఇచ్చెను.

సందర్భానుసారము భక్తులకు, సాధకులకు తగిన జ్ఞానోపదేశము చేయుచు అష్టమహిషిలతో 16 వేల మంది గోపికలతో 'నారీ నారీ నడుమమురారి' అనునట్లు రాసలీలలు గావించుచు తన బాల్య స్నేహితుడైన కుచేలుని దారిద్ర్యము తొలగించుచు పాండవులను కష్టములలో ఆదుకొనుచు పాండవ పక్షపాతిగ పేరుపొందెను. ధర్మరాజు రాజసూయయాగ సందర్భమున జరాసంధ, శిశుపాల, దంతవక్త్రాదులను సంహరించి కొంత భూభారమును అణచెను. నరకాసురవధ, శమంతకమణి వృత్తాంతము, పారిజాతాపహరణము, ప్రద్యుమ్న వృత్తాంతము, సుభద్రా పరిణయము మొదలగు అనేక

ఘట్టములలో ప్రముఖపాత్ర వహించెను. వర్ణాశ్రమ ధర్మములను ఉద్ధరించెను. శిష్టులను రక్షించెను. తన అవతార లక్ష్యమును చాలా వరకు సాధించెను. ద్వాపర యుగము అంతమై రాబోవు కలియుగములోని ప్రజల పరిస్థితిని దృష్టిలో వుంచుకొని ఒక ప్రణాళిక తయారుచేసెను. వేదములు, అపౌరుషేయములు వాటిని చదివి అర్థము చేసికొని ఆధ్యాత్మికరంగములో అభివృద్ధి సాధించుట అందరికీ సాధ్యము కాదు. భరద్వాజుని వృత్తాంతమే ఇందులకు తార్కాణము. వేదములు, కర్మ, ఉపాసన, జ్ఞాన కాండల రూపములో విస్తరిల్లి లౌకిక, అలౌకిక విషయమును వెల్లడించెను. వాటి సారము లేదా వేదాంతసారములైన ఉపనిషత్తులు 1000కి పైగా ఉన్నవి. వేదశాఖల నుండి ఇవి ఆవిర్భవించినవి.

ఆ ఉపనిషత్తులలోని విషయము సమర్థులైన గురువునకు సేవ చేసి వారియనుగ్రహము బడసి విషయము గ్రహించవలయును. ఇది అందరికీ సాధ్యము కాదు. ఈ ఉపనిషత్తుల తరువాత పేర్కొనబడిన షట్ దర్శనములలోని విషయము సిద్ధాంత రూపములోనున్నది. వ్యాసుడు వ్రాసిన బ్రహ్మసూత్రములు కూడా దీనిలో ఒక భాగము. పతంజలి యోగశాస్త్రము కపిలుని సాంఖ్యయోగము, మొదలగునవి మిక్కిలి కష్టమైనవి. కలియుగములో వీటిని వివరించువారు, శ్రద్ధతో నేర్చుకొనువారు దొరుకుట దుర్లభము. కనుక ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రములు మొదలగు వాటిని దృష్టినుంచుకొని అందరు, అన్ని వర్ణముల వారు స్త్రీ, పురుష భేదము లేకుండా చక్కగా చదువుకొని అర్థము చేసికొని, ఆచరించి, తరించుటకు వీలుగ వినూత్న పద్ధతిలో శాస్త్రానుసారము తన దివ్యమైన యోగశక్తితో అర్జునుని నెపముగ గైకొని ధర్మక్షేత్రమైన కురుక్షేత్రములో (నేటి హర్యానా రాష్ట్రములో) పూర్వము మనువు, సూర్యాదులకు బోధించిన సనాతన ఆధ్యాత్మిక విద్యను తక్కువ సమయములో మిక్కిలి విపులముగ ఆచరణ యోగ్యముగ భగవత్ గీతను బోధించెను. అట్లు బోధించుటయే గాక తన విశ్వరూపమును చూపి అర్జునునకు విశ్వాసము కల్గించి స్వధర్మమునందు అతనిని ప్రతిష్ఠించెను. నరనారాయణులే కృష్ణార్జునులు. పూర్వము శ్రీరాముడు హనుమంతునకు బోధించెను. ఆ హనుమంతుడే మురల జండాలో ఉండి వినెను. సుమారు 50 గీతలు పైగా సందర్భానుసారము చెప్పబడినప్పటికీ ఇంత విపులముగా అవి లేవు. అంత అవసరము వాటికి లేదు. ద్వాపర, కలియుగ సంధిలో చెప్పబడిన "ఈ గీత గ్రంథములలో భగవద్గీత - పండుగలలో దీపావళి" అని నానుడికి కారణమై ప్రసిద్ధి చెందినది. పండుగలలో ప్రసిద్ధి చెందిన దీపావళికి కృష్ణుడే కారణము. అందరు మత ప్రమేయము లేక బాణాసంచా కాలుస్తారు. అందరు ఆనందముగా పండుగ చేసుకుంటారు. దీని తరువాత భగవద్గీత మార్గశిరములో ఆవిర్భవించినది. అహంకార మమకారములు నశించిన తరువాత జ్ఞానోపదేశ రూపములో గీత ఆవిర్భవించినది. గురువు శిష్యునకు ఉపదేశము చేయు ప్రదేశము ఆశ్రమము, నదీ తీరము మొదలగుచోట్ల సాధారణముగ జరుగును. కాని ఇక్కడ ఉపదేశము చావు, బ్రతుకుల మధ్య పోరాట సమయములో కురుక్షేత్రమను యుద్ధరంగమందు జరిగినది. ఇది విలక్షణమైనది. గొప్పది. కురుక్షేత్రము కూడా గొప్ప పుణ్యక్షేత్రము. "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" అని గీత ప్రారంభ శ్లోకము. "పార్థాయ ప్రతి బోధితాం" అను శ్లోకములలో విపులముగ చెప్పబడినది. హయగ్రీవ అగస్త్యుల వలె, రామ, హనుమంతులవలె, నారాయణుడు, నరుడు గొప్ప గురుశిష్యులు, 10 వేల దివ్య సంవత్సరములు తపస్సు చేసి కృష్ణార్జునులుగ లోక కళ్యాణము కొఱకు జన్మించిరి.

సాక్షాత్తు నారాయణుడు (24 నామములతో ప్రసిద్ధుడు, 24 తత్త్వములు). పార్థుడు 10 పేర్లతో ప్రసిద్ధి చెందెను. 10 సంఖ్య ఇంద్రియములను బోధించును. (పరమాత్మ - జీవుడు). 18 మహాపురాణములు రచించిన వ్యాసునిచే మహాభారత మధ్యలో (భీష్మపర్వము) 18 అధ్యాయములతో కూడి అద్వైతామృతమును భగవతీ సరస్వతి అక్షరరూపమున కురిపించెను. కృష్ణార్జున సంవాదమను గీత మిక్కిలి గొప్పది. సకలలోకవాసులకు ఆనందము కల్గించినది. గీతను ఒక శాస్త్రముగ పేర్కొనెను. ఆచార్యుడు యోగులకు యోగి. యోగులకు ఈశ్వరుడు. శిష్యుడు పార్థుడు. భూమిని జయించినవాడు. మూలాధారము అర్జునుడు. సహస్రారము (గురుస్వరూపము) కృష్ణుడు వీరిద్దరు ఉన్నచోట విజయము లభించును. ఇద్దరూ సమర్థులు. సర్వ ఉపనిషత్తుల సారమను గోవు యొక్క క్షీరమును తీయువాడు గోపాలుడైన కృష్ణుడు. ఆ గోవు యొక్క దూడ అర్జునుడు గోక్షీరము గ్రోలువాడు. గీత అనెడి క్షీరామృతమును అందరూ తమ సామర్థ్యముచే గ్రోలవచ్చును.

గంగా (నదులలో ఉత్తమమైనది), గాయత్రి (ఛందస్సులలోను, మంత్రములలోను ఉత్తమమైనది), గోవిందుడు (దైవములలో గొప్పవాడు), గీత (శాస్త్రములలో గొప్పది). ఈ నాలుగు మోక్షమిచ్చునవని పెద్దలయభిప్రాయము. 'గీత' త్యాగమును తత్త్వమును ఉపదేశించును.

ఈ విధముగ ఆవిర్భవించిన 'గీత' (మార్గశిర శుద్ధ ఏకాదశి గీతాజయంతి, ప్రతి సంవత్సరము డిసెంబరులో సాధారణముగా వచ్చును) మన దేశములోనే గాక ఇతర దేశములలో కూడా ప్రసిద్ధి చెందినది. అనేక భాషలలోనికి తర్జుమా చెయ్యబడినది. కృతయుగములో కపిలుడు, త్రేతాయుగములో దత్తాత్రేయుడు, ద్వాపరయుగములో కృష్ణుడు జగద్గురువులుగా ప్రసిద్ధి చెందిరి. "కృష్ణం వందే జగద్గురుం" అను ప్రసిద్ధి గీత వలన లభించినది. కర్మ, భక్తి, జ్ఞాన, యోగాది మార్గములను తెల్పి కర్మసన్యాసయోగము లేదా నిష్కామ్య కర్మ పద్ధతియను నూతన సిద్ధాంతమును తెల్పెను. జ్ఞానేశ్వరీగీత, బాలగంగాధర తిలక్ గీతారహస్యము, త్రిమతాచార్యుల భాష్యము మొదలగు ఎన్నో వ్యాఖ్యాన గ్రంధములు ఈ గీత నుండి ఆవిర్భవించినవి. ఎందరో ముక్తులైరి.

ఓం తత్ - సత్

## ప్రకృతి స్వరూపము

భగవద్గీతలో గీతాచార్యుడు అష్టవిధప్రకృతులు త్రిగుణములు మొదలగువాటిని గూర్చి ప్రస్తావించెను. ఆధ్యాత్మిరంగములో తన లక్ష్యమును సాధించుటకు సాధకుడు తాను ఎవరు ? తన లక్ష్యమేమిటి ? దృశ్యమాన ప్రకృతి ఎలా ఏర్పడినది ? భగవంతుడెవరు ? భగవంతుని చేరు మార్గమేమిటి? అని విచారించవలెను. దీనిని తెలిసికొనుటకు ప్రకృతిని గూర్చి తెలిసికొనవలయును.

పరబ్రహ్మము

↓

శక్తి

↓

| ఇచ్ఛాశక్తి (మనస్సు) | జ్ఞానశక్తి (వాక్కు) | క్రియాశక్తి (కాయము) |
|---|---|---|
|  |  |  |
| **సత్వము - 3** | **రజస్సు - 3** | **తమస్సు - 3** |
| **సత్వము** | **సత్వము** | **సత్వము** |
| త్రిమూర్తులు | శ్రోత్రియులు | పశుపక్ష్యాదులు |
| దేవతలు మొ॥ | జ్ఞానులు | తిర్యక్కులు |
| **రజస్సు** | ప్రచారకులు మొ॥ | **రజస్సు** |
| తాపసులు | **రజస్సు** | క్రిమికీటకాదులు |
| మునులు | మహావీరులు | పిపీలకములు |
| సిద్ధులు మొ॥ | క్షత్రియులు | **తమస్సు** |
| **తమస్సు** | **తమస్సు** | స్థావరాదులు |
| విద్యాధరులు | వ్యవసాయదారులు | వృక్షములు మొ॥ |
| గంధర్వులు | వ్యాపారులు | |
| యక్షులు | కార్మికులు మొ॥ | |
| నాగులు | | |
| రాక్షసులు మొ॥ | | |

భగవానుడు గీత విభూతియోగము (10అ) దైవాంశములన్నిటినీ పేర్కొనెను. ప్రకృతిలోని భాగములే అవి. గీత 17, 18 అధ్యాయములలో త్రిగుణములగు సాత్విక, రాజస, తామసములను గూర్చి, వాటికి సంబంధించిన ఆహారము, దానము, యజ్ఞము మొదలగు వాటిని గూర్చి పేర్కొనెను. ఈ ప్రకృతి పరా, అపరా అని మరల 2 విధములు.

ప్రకృతి పురుషుని వలనే ఈ సృష్టి ఏర్పడినదని తెలియుచున్నది. తెలుపు, ఎఱుపు, నలుపు దారములు ఒకదానితో ఒకటి పెనవేసికొనినట్లు ప్రకృతి త్రిగుణముల పరస్పర సమ్మేళనములతో పెనవేసికొనినది. దీని ప్రభావము చరాచర జగత్తు అంతట నిత్యము కనపడుచుండును.

అగ్ని పొగ వలన, దర్పణము మాలిన్యము చేత, గర్భస్థ శిశువు మావి చేత కప్పబడినట్లు ప్రకృతికి లోబడిన జీవుడు గుణములచేత వీటికి సంబంధించిన అహంకార మమకారాది అరిషడ్వర్గము చేత (అజ్ఞానముచే) మూసివేయబడి స్వస్వరూప జ్ఞానము కోల్పోయి అనృత జడ దుఃఖాత్మకమగు ఈ ప్రపంచ భ్రాంతి నుండి తేరుకొనలేక సతమతమగుచున్నాడు. ఈ ప్రకృతిని జయించుట కష్టమని గీతాచార్యుడు పేర్కొనెను. దీని నుండి వెలువడుటకు సమర్థుడైన గురువును ఆశ్రయించి జ్ఞానము పొంది అజ్ఞానము పోగొట్టుకొని ముక్తుడు కావలయును.

గీత 17వ అధ్యాయములో శ్రద్ధాత్రయ విభాగములో "త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా, సాత్త్వికీ రాజసీచైవ తామసీ చేతి తాం శృణు ॥" అని పేర్కొనుట జరిగినది. 7వ అధ్యాయములో త్రిగుణములతోకూడిన మాయాశక్తిగూర్చి పేర్కొనెను. మాయాశక్తి శివుని, విష్ణువును ఆశ్రయించియుండును. వారి అనుగ్రహము లేనిదే దానిని దాటుట కష్టము. విష్ణువు - సత్త్వగుణము, బ్రహ్మ రజోగుణము, శివుడు - తమోగుణమునకు ప్రతీకలుగ ఉండిరి. సృష్టి, స్థితి, సంహారములనెడి ప్రధానక్రియలననుసరించి వారికి ఆ గుణములు చెప్పబడినవి. సత్త్వము - తెలుపు, రజస్సు - ఎఱుపు, తమస్సు - నలుపు లేక నీలము రంగుల సంకేతములు తెల్పబడినవి. ప్రతిక్షణము ప్రతి జీవియందు ఈ త్రిగుణ ప్రభావముండును. కనుక సాధకుడు ప్రదానముగ సత్త్వగుణమును అభివృద్ధి చేసికొనవలయును.

## ఓం కారము

వ్యష్టి (జీవుడు) | సమిష్టి (పరమాత్మ)

ప్రత్యక్ పరమాత్మ నిరంతర అనుసంధానము

మోక్షసాధన -

| | | | | |
|---|---|---|---|---|
| అకారము | - ఉకారము | - మకారము | - అనుస్వారము | |
| జాగ్రత్ | - స్వప్న | - సుషుప్తి | - తురీయము | |
| అవిద్య | - విద్య | - ఆనంద | - తురీయములు | |
| స్థూల | - సూక్ష్మ | - కారణ | - మహాకారణములు | |
| వ్యష్టి | - విశ్వుడు | - తైజసుడు | - ప్రాజ్ఞుడు | - జీవాత్మ |
| సమిష్టి | - విరాట్టు | - ఈశ్వరుడు | - అవ్యాకృతుడు | - పరమాత్మ |

పై విధముగ వర్ణింపబడిన ప్రణవస్వరూపమును గ్రహించి స్వస్వరూపజ్ఞానమును పొంది, అనృత - జడ దుఃఖాత్మకమగు ఈ ప్రపంచము, శరీరము అశాశ్వతమని, పరబ్రహ్మమే శాశ్వతమని గమనించి శ్రవణ, మనన, నిధి, ధ్యానలలో, ఇంద్రియ నిగ్రహముతో (అష్టాంగయోగము) ప్రణవమును ధ్యానించవలయును. ప్రణవోపాసన చేయుటకు ముందు తనను గూర్చి ప్రపంచము లేక జగత్తు మరియు భగవంతుని గూర్చి తత్త్వ విమర్శ చేయవలెను. దీనికి షట్ దర్శనములు ఉపయోగించును. ఆత్మ - అనాత్మవివేకము దీనివలన కలుగును. గురువు వలన శ్రవణము చేసి గురువు చెప్పిన దానిని మననము చేయుచు నిధి ధ్యాసలతో ఓం కారమును ధ్యానించి ఆనందమును పొందవలెను. అభ్యాసము, శ్రద్ధ, వైరాగ్యము, భక్తి, జ్ఞానములు వీటికి అవసరము. సాధకులు వారివారి గురు సంప్రదాయములననుసరించి గ్రహించవలయును. త్రిమతాచార్యులు వారి వారి సిద్ధాంతములననుసరించి గీతకు భాష్యము వ్రాసిరి.

"నదీ నాం సాగరోగతిః" అనునట్లు, "సర్వదేవ నమస్కారః కేశవః ప్రతిగచ్ఛతి" అనునట్లు మార్గములు వేరైన చేరుచేటు మాత్రము ఒక్కటే - ఏకమేవ అద్వితీయం బ్రహ్మ

భక్తులు వారి ఇష్ట దైవమును సర్వత్ర దర్శించెదరు. అంతా బ్రహ్మమయం. ఈ జగమంతా బ్రహ్మమయమని సదాశివ బ్రహ్మేంద్రస్వామి వారు, కబీరు, రామదాసు, తులసీదాసు మొదలగువారు "అంతారామమయం" అనియు అన్నమాచార్యుడు వేంకటేశ్వరుని "బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే"యని, మీరాబాయి శ్రీ కృష్ణ చైతన్య ప్రభువు మొదలగువారు "వాసుదేవస్సర్వమితి" అని కృష్ణమయముగను, శివభక్తులు శివ మయముగను, శాక్తేయులు అంతా పరాశక్తిమయముగ పరబ్రహ్మను గూర్చి తలపోయుదురు.

పై భావము సిద్ధించుటకు సాధకుడు తీవ్రసాధన చేయవలెను. బ్రహ్మము కంటె ఇతరమైన వస్తువు లేదు. లేనిది ఉన్నట్లు కన్పడుచున్నది. ఇది మిధ్య లేక భ్రాంతి లేక మాయ. "రజ్జు సర్పభ్రాంతి శుక్తి రజిత భ్రాంతి" ఎండమావులలో నీరువలె శూన్యమైన ఆకాశములో నీలము రంగు వలె, కుందేటి కొమ్మువలె, గొడ్రాలికి కుమారుడు ఉన్నట్లు ఈ జగత్తు మిధ్య, అశాశ్వతము. నామరూపాదులు కలిగిన జగత్తు నశించును. ఆత్మ స్వరూపమునకు నామరూపాదులు లేవు కనుక స్థిరము.

శరీరములు వేరగుటచే జీవాత్మలు చాలా ఉన్నట్లు కన్పడును. ఘటములు చాలా ఉన్నప్పటికీ ఆకాశము ఒక్కటే. అదియే అన్ని ఘటములలో ప్రకాశించుచున్నట్లు ఒక్కడే భగవంతుడు అన్ని శరీరములందు జీవాత్మరూపములో ప్రకాశించుచున్నాడు. భిన్నత్వములో ఏకత్వము. మాయస్వగత, స్వజాతీయ, విజాతీయ భేదములు గలది. ఏదిలేనిదో అది మాయా । యా - మాసా ॥ అశాశ్వతమైనది. పరబ్రహ్మకు పై భేదములు లేవు. నిత్య సత్యమైనది. పై విధముగ త్రిగుణాత్మక, పంచభూతాత్మకమైన జగత్తు, ఇహపర సౌఖ్యములు అశాశ్వతమని జ్ఞాని గ్రహించును.

## ఓం కార స్వరూపము

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ..... (8అ - 13శ్లో) అని గీతలోను సంధ్యావందనాది ప్రక్రియలలోను పేర్కొనబడినది. దీనికే ప్రణవం, ఉద్గీత మొదలగు పేర్లు గలవు. అక్షర బ్రహ్మము, శబ్దబ్రహ్మము, పరమాత్మ సంకేతముగ ప్రణవనాదమును పెద్దలు విశేషముగ చెప్పిరి. ఓంకారములేని మంత్రముండదు. ప్రతిమంత్రమునకు ముందు ఓంకారము చేర్చబడును. సన్యాసులు నిరంతరము ఓంకారము జపింతురు. నిర్మల అఖండ, సచ్చిదానంద స్వరూపుడగు భగవంతుని చేరుటకు ఓంకార సాధనకు మించినది మరియొకటి లేదు.

ధ్యానబిందు, మాండూక్య, తైత్తరీయాది ఉపనిషత్తులు ఓంకారము యొక్క ప్రాధాన్యతను అందలి అంగములను విపులముగ పేర్కొనినవి.

1. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, 2. ఏకమేవాద్వితీయం బ్రహ్మ, 3. సర్వం ఖల్విదం బ్రహ్మ, 4. ప్రజ్ఞానం బ్రహ్మ, 5. తత్త్వమసి, 6. అయమాత్మాబ్రహ్మ మొదలుగా గల అనేక ఉపనిషత్తుల మహా వాక్యములు ఓంకారమునే ప్రశంసించినవి. గీతలో "ఓం తత్సత్" అని ప్రత్యేకముగ పేర్కొనెను. ఈ బ్రహ్మము అవాక్ - మానస - గోచరము కనుక నేతి - నేతి (న+ఇతి) వాక్యములచే తిరస్కరింపబడి శేషి - (మిగిలినది) పరబ్రహ్మయని తెల్పబడినది. 'దివ్యకళ -సత్యకళ-భగవత్కళ' అని బ్రహ్మమును పండితులు కీర్తించిరి. తైత్తరీయోపనిషత్తులో అనేక రకముల ఆనందములు వివరింపబడినవి. మనుష్య భూసుర, గంధర్వ, దేవ, ఇంద్ర, ప్రాజాపత్య, బృహస్పతి మరియు బ్రహ్మానందము చెప్పబడినవి.

అన్నిటికంటె గొప్పదైన పరబ్రహ్మానందము ఓంకారముచేత సాధ్యమగును.

సత్యము, జ్ఞానము, అనందము (ఆనందోబ్రహ్మ), ప్రణవము బ్రహ్మ స్వరూపమగుచున్నది. నిత్య, శుద్ధ, బుద్ధ, చైతన్య, నిర్మల, అఖండ సచ్చిదానంద స్వరూప సంకేతమే ఓంకారము. ఈ ఓంకార విభాగము గ్రహించి శ్రవణ, మనన, నిధి, ధ్యానలతో నిరంతరము పాసించినచో తగిన ఫలము లభించును.

ఓం - ధర్మము - అర్థము - కామము - మోక్షమను పురుషార్థములు

అకార - ఉకార - మకార - అర్థమాత్రలు - శబ్ద బ్రహ్మము

అవిద్య - విద్య - ఆనంద - తురీయమని - 4 పాదములు

జాగ్రత్ - స్వప్న - సుషిప్త - తురీయమని - 4 అవస్థలు

**పరబ్రహ్మ పంచలక్షణములు :** (ప్రణవమునందలి 16వ భాగము)

1. సత్ - 2. చిత్ - 3. ఆనంద - 4. నిర్మలము - 5. అఖండము

**పంచదైవములు :**

1. బ్రహ్మ, 2. విష్ణు, 3. శివ, 4. రుద్ర, 5. సదాశివులు

1. గణపతి, 2. శివుడు, 3. శక్తి, 4. సూర్యుడు, 5. విష్ణువు (పంచాయతన దేవతలు)

***అష్టశరీరములు : (ప్రణవమునందలి 16వ భాగము)***

స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ, అవిద్య, విద్య, ఆనంద, తురీయము.

**అష్టాంగములు :**

వ్యష్టి, విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మ, సమిష్టి, వై శ్వానర, హిరణ్యగర్భ, అవ్యక్త, పరమాత్మలు.

**నాల్గు వేదములు - గాయత్రీ పాదములు :**

అకార - ఉకార - మకార - అనుస్వారములు

ఋక్ - యజస్సు - సామ - అధర్వణ వేదములు

**గాయత్రి 1వ పాదము 2వ పాదము 3వ పాదము 4వ పాదము.**

నీటి బుడగలు సముద్రములో పుట్టి సముద్రములో కలియునట్లు జగత్తు బ్రహ్మము నుండి పుట్టి బ్రహ్మములో కలియును. ఏకత్వములో భిన్నత్వము, భిన్నత్వములో ఏకత్వము పరబ్రహ్మకు చెల్లును.

ఓంకార తత్త్వము గ్రహించి ఈ భౌతిక శరీరము ధర్మసాధనముగ ఎంచవలయును. నవరంధ్రములు కలిగిన ఒక ఘటములో దీపము వెలుగుచున్నట్లు కుండవంటి శరీరములో భగవంతుడు తాను స్వయముగా ప్రకాశించుచు శరీరమును చైతన్యవంతముచేయుచుండెను. (కార్తీక మాసము అకాశదీపము యొక్క భావము ఇది కావచ్చును). దేహమును దేవాలయముగ భావించి సనాతనుడైన

భగవంతుడు అందుకలడని భావించవచ్చును. (దేహోదేవాలయ ప్రోక్తః .......). శరీరమునకు జనన మరణములు, ప్రాణమునకు ఆకలి దప్పికలు, మనస్సునకు శోక మోహములు సహజమని అవి వాటి ధర్మములని గ్రహించవలెను. సంచిత, ప్రారబ్ధ. ఆగామి కర్మల విభాగము గ్రహించి గీతలో పేర్కొనిన కర్మ సన్యాసయోగము, కర్మఫల త్యాగము లేదా నిష్కామ్యకర్మ మార్గముననుసరించి కర్మబంధముల నుండి విముక్తులు కావలయును.

శరీరమునకు విలక్షణము, అవస్థాత్రయమునకు సాక్షిభూతుడు, పంచకోశములకు వ్యతిరిక్తుడు అయిన ప్రత్యగాత్మ (అహం బ్రహ్మస్మి, తత్ - త్వం - అసి) పరమాత్మకు భిన్నము కాదని గ్రహించి సర్వ ధర్మములు పరిత్యజించి, అనన్య చింతనతో భగవంతుని ప్రార్థించుచు అవాక్ మానస గోచరము అవ్యక్తమైన భగవదానందానుభూతిని పొందవలయును. జీవన్ముక్తుడు కావలయును. ఓంకారము బిగ్గరగ పైకి చేయవచ్చును. లేదా పెదవులు కదుపుచు, లేదా మనస్సులో చేయవచ్చును.

ఓం-తత్-సత్

## సృష్టి క్రమము




### జీవ బ్రహ్మ తారతమ్యములు - స్థాయి

9. విరాట్ పురుషుడు
↓
8. విష్ణువు
↓
7. బ్రహ్మ

6. మనువు
↓
5. బృహస్పతి
↓
4. ఇంద్రుడు
↓
3. యోగి
↓
2. జ్ఞాని
↓
1. సామాన్య మానవుడు

## 9. గీతా ప్రాశస్త్యము - మానవుని కర్తవ్యము

"సంభవామి యుగే యుగే" అని గీతలో ఓపెర్కొనబడినట్లు దేశకాల పరిస్థితులను బట్టి యుగములను బట్టి భగవంతుడు భూలోకమందు అవతరించును. శివుడు, విష్ణువు, శక్తి, దత్తాత్రేయుడు మొదలగు వారు సందర్భానుసారము జన్మించెదరు. అనగా వారి అంశ మాత్రమే భూలోకమునకు వచ్చును. కొన్ని సందర్భాలలో వారి అయుధముల అంశలో కూడా కొందరు జన్మించెదరు. కార్త వీర్యార్జునుడు, లక్ష్మణుడు. అన్నమయ్య, క్షేత్రయ్య మొదలగు వారు ఈ కోవకు చెందిన వారు.

ప్రస్తు తాంశమైన గీత ప్రాశస్త్యములో సత్త్వ గుణ ప్రధానుడు, భక్త రక్షకుడు అయిన విష్ణువు కృష్ణునిగా అవతరించి (125 సం॥) అనేక మహోన్నత కార్యములు సాధించి అజరామర కీర్తి నార్జించెను.రామాయణ కాలము అనగ త్రేతాయుగములో రాముడు , ఆంజనేయుడు (రామాయణము .. సుందర కాండ) ద్వాపరములో కృష్ణుడు, అర్జునుడు (భారతము....భీష్మ పర్వము) భాగవతము .... కృష్ణ భగవానుడు, భక్తుడైన పరీక్షిత్తు మహారాజు ప్రధానముగ పేర్కొనదగిన వారు. హనుమంతుడు దాస్యభక్తి, అర్జునుడు సఖ్యభక్తి, పరీక్షిత్తు నామస్మరణ, కథా శ్రవణము వలన భగవంతుని అనుగ్రహమును బొందుటయే గాక రామాయణ, భారత, భాగవతములనెడి మహోన్నత ఇతి హాస పౌరాణిక గ్రంధములకు ప్రాధాన్యతను పెంచినారు.

గీతా ప్రాదుర్భావమునకు పూర్వము కపిలుడు సాంఖ్య యోగమును, దత్తాత్రేయుడు యోగ విద్య, వశిష్టుడు (రామునకు) జ్ఞాన వాసిష్టమును, శివుడు (పార్వతికి) గురుగీతను మరియు (రామునకు) శివగీతను, దేవి (దేవతలకు) శక్తి గీతను, రాముడు (హనుమంతునకు) ఉపనిషత్తు మహావాక్యరత్నావళిని ఉపదేశించిరి. ఈ విధంగా 50 వరకు సందర్భానుసారము గీతలు ఆవిర్భవించినవి. అయితే వాటి అన్నింటికి మకుటాయ మానముగ కృష్ణగీత పేర్కొనదగినది. దీనికి కారణము ద్వాపరయుగాంతము కలియుగ ప్రారంభమునకు అనగ సంధి ( యుగ సంధి ) లో ఇది పుట్టి రెండు యుగ ధర్మములకు ప్రజలకు ప్రయోజన కారిగా నున్నది. రాముడు హనుమంతునకు సకల వేదములందలి సారభూతమైన ఉపనిషత్తులలోని మహా వాక్యములను బోధించెను. సుమారు ఇవి 20 రకములుగా నున్నవి. కృత యుగములో తపస్సు, అయువు ఎక్కువ, ధర్మము 4 పాదములలో ఉన్నది. అస్థిగత ప్రాణము. త్రేతా యుగములో ధర్మము 3 పాదములలో ఉన్నది. యజ్ఞ యాగాది క్రతువులు. ఆయువు కొంత తక్కువ. కనుక కాలాను గుణముగ రాముడు, దత్తాత్రేయుడు, వసిష్ట మరియు విశ్వామిత్రుడును ఉపదేశము

లిచ్చిరి. కృత యుగమునకు కపిలుడు గురువు (విష్ణువు అంశ). త్రేతాయుగమున దత్తాత్రేయుడు జగద్గురువు ( విష్ణువు అంశ ). ద్వాపరయుగమునకు కృష్ణుడు జగద్గురువు . ద్వాపరములో ధర్మము 2 పాదములు. కలియుగములో ధర్మము 1 పాదము ఉన్నది. రాను రాను వర్ణాశ్రమ ధర్మములు, వేద ఉపనిషత్తులు, పురాణములను అర్థము చేసికొను స్థితిలో ప్రజలు లేరు. కలియుగ ప్రభావము తో ప్రాణము అన్న గతమైనది. ఆయువు తక్కువ. ఇంద్రియ నిగ్రహము తక్కువ. ఇన్ని కారణములను దృష్టిలో నుంచుకొని "కలౌ స్మరణాన్ ముక్తి" అనుసూక్తిని దృష్టి లోనుంచుకొని గీతా ప్రణాళికను శ్రీకృష్ణుడు సిద్ధపరచెను.

దీనిని అనుసరించి పండితుల నుండి పామరుల వరకు అందరికి వారివారి స్థితుల ననుసరించి గీతామృతము ను గ్రోలుటకు వీలైనది.

ప్రాచీన కాలము నుండి ఆత్మను తెలిసికొనుటకు ముక్తిని పొందుటకు అనేక మార్గములు ఉపనిషత్తులు ప్రతి పాదించినవి. న్యాయ లేక తర్క దర్శనమను పేరుతో గౌతముడు, వైశేషిక దర్శనమను పేరుతో కణాదుడు, సాంఖ్య దర్శనమను పేరుతో కపిలుడు, యోగ దర్శనమను పేరుతో పతంజలి, పూర్వమీ మాంస జైమిని, ఉత్తరమీమాంస లేక బ్రహ్మ సూత్రములను పేరుతో వ్యాసుడు ప్రతిపాదించిన సిద్ధాంతములను కృష్ణుడు దృష్టిలో నుంచుకొనెను. వీటిని గ్రహించి విపులముగ చర్చించు శక్తి నేటి కాలము వారికి లేదు. వాటిలో అనేక అనుమానములు కలుగును. ఆత్మ జ్ఞానమును పొందుటకు శబ్ద ప్రమాణము, శ్రుతులు, అనుభవజ్ఞుల ఉపదేశ వాక్యములు, గురువు నాశ్రయించి తెలిసికొనుట అను మార్గములు తెలియ జేయ బడినవి. అనుభవజ్ఞుడు, గురుస్థానీయుడు అయిన గీతాచార్యుడు వీటిని గమనించెను. సామాన్యు ల నుండి సన్యాసుల వరకు సమస్త ప్రజలకు అనువుగ దీనిని ఉపదేశించెను. ఉపనిషత్తులు, యోగ శాస్త్రము, బ్రహ్మ విద్యయను మూడు విషయములను ,తీసికొని వాటి సారముగ గీతను తెలియ జేసెను. కర్మ మార్గము, జ్ఞానమార్గము, భక్తి మార్గము, యోగ మార్గము, ప్రధానముగ గ్రహించెను. నాలుగు యుగ సంప్రదాయములు తెల్పెను. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత మతములకు అనుగుణముగ నవ విధ భక్తులకు, జ్ఞానులకు, యోగులకు, కర్మిష్ఠులకు అనుగుణముగా తెల్పి తన గీతకు ప్రత్యక్ష ప్రమాణముగా విశ్వరూపమును చూపి (జ్ఞాన విజ్ఞానములను) సిద్ధాంత మరియు అనుభవమును తన శిష్యుడగు అర్జునునకు చూపెను. కనుక నాటి నుండి నేటి వరుకు ఎందరో మహాను భావులు గీతను అనుసరించి వ్యాఖ్యలు, భాష్యములు వ్రాసిరి. ఎంత మంది ఎన్ని వ్రాసినా ఎంత చెప్పినా అంతు లేని అమృత సాగ రము గీత. యుద్ధము 18 రోజులు జరిగినది. గీత 18 అధ్యాయములు. భారతము 18 పర్వములు. ఈ సంఖ్యకు ప్రాధాన్యత కలదు. 18 సంఖ్యను ఏక సంఖ్య చేసిన 9 వచ్చును. కృష్ణుని వయస్సు కూడాగీతా బోధ సమయమునకు 90 సంవత్సరములు. ఆధ్యాత్మిక రంగములో 9 అంకెకు మిక్కిలి ప్రాముఖ్యత కలదు. నవగ్రహములు, నవ విధ భక్తులు, నవరాత్రులు, నవా వరణములు, నవ వ్యాకరణములు, నవ ద్వీపములు, నవ రంధ్రములు మొదలగునవి ఎన్నో 9 అంకె పై వున్నవి. యోగీశ్వరుడైన కృష్ణుడు తన యోగ శక్తి ప్రభావముతో అతి తక్కువ సమయములో ఎక్కువ విషయమును ( సుమారు 700 శ్లోకములు) 18 అధ్యాయములుగ తెల్పి విశ్వరూపమును చూపి అర్జునుని రూపములో నున్న మానవులకు కర్తవ్యమును బోధించెను. శ్లోకముల సంఖ్యపై భిన్న అభిప్రాయములు కలవు.

సకల జీవ రాసులలో గొప్ప వాడు మానవుడు. సృష్టి క్రమములో భూలోకము నుండి ముక్తి పొందు అర్హత గలవాడు. భూమండలములో భరత వర్షము, దానిలో భరత ఖండము, అందులో భారత దేశము కర్మ భూమిగా పేరు గాంచినది. భోగములకు పశ్చిమ దేశాలు, ముక్తికి భారత దేశము ప్రసిద్ధి చెందినది. గంగాది సర్వతీర్థములు, హిమాలయాది పర్వత శ్రేణులు, గాయత్రి మంత్రానుష్ఠానపరులు, వేద పండితులు, మహాశాస్త్ర పండితులు, కళాకారులు మరియు వీరు గాక రామ, కృష్ణాది అవతారములకు జన్మ భూమిగ ఈ దేశము ఖ్యాతి గాంచినది. ఇటువంటి పవిత్ర ప్రదేశము సాధనకు ముఖ్యమైనది. అధ్యాత్మిక వాతావరణము ఉన్నది. సమర్థులైన ఆధ్యాత్మిక గురువులకు నిలయము. ముక్తి కోరుకొను వారికి కావలసిన సామాగ్రి, ఆశ్రమాదులు, దేవాలయములు, పవిత్ర వృక్షములు, ఎన్నో కలవు. వీటి ఆధారముతో మానవుడు సాధన చేసి ముక్తి పొందవచ్చును.

"ఉద్ధ రేవాత్మ ఆత్మానాం" అని గీతలో భగవానుడు నుడివెను. ప్రతి మానవుడు తనను తాను పోషించుకొనుచు, తన కుటుంబమును పోషించుకొనుటకు ఒక వృత్తియ వలంబించును. "స్వధర్మే నిధనంశ్రేయః పరధర్మో భయాపహః" అని గీతలో చెప్పినట్లు తన ధర్మమును, వృత్తిని చేసికొనుచు ఇతర సమయములందు భగవచ్చింతన చేయవలెను. తనను తాను తెలిసికొనుట (స్వస్వరూపాను జ్ఞానము) అవసరము. కాంతా కనక వ్యామోహాలతో, హింసా ప్రవృత్తితో, ఐహిక సుఖ దుఃఖాలతో, అసంతృప్తితో, అహంకార మమకారాది అరిషడ్వర్గ, త్రిగుణాలతో నిరంతరము మనో నిగ్రహము లేక వశమై యుంటూ కర్మ బంధములు పెంచుకొనుచు శంకరుల వారు చెప్పినట్లు "పునరపి జననం పునరపి మరణం" అని జనన మరణ చక్రములో తిరుగుచు ఎంత కాలము ఉంటాడు? ఎప్పటి కైన ముక్తి పొంద వలసినది. లౌకిక వ్యవహారములు, నిద్ర, మొదలగు వాటితో చాలాకాలము గడిచిపోతుంది. కాళిదాసు రఘువంశములో

> శైశవేభ్యశ్చ విద్యానాం యౌవనే విషయైషిణాం
> వార్థకే ముని వృత్తీనాం, యోగేనాంతే తనుత్యజాం ॥

అని, ఆశ్రమ ధర్మములు గూర్చి చెప్పెను. ఇవి ప్రాచీన కాలములో ఉన్నవి. విద్యాభ్యాసము (గురు కులాశ్రమము), వివాహము (గృహ స్థాశ్రమము), బాధ్యతలు తీర్చుకొని ముని వృత్తి ( వాన ప్రస్థాశ్రమము) , పిదప పరివ్రాజకస్థితి (సన్యాసాశ్రమము) ని పొంది 4 ఆశ్రమ ధర్మములు నిర్వర్తించి మోక్షమును పొందవలయును.

దీనికి గీతలో చెప్పినట్లు తత్త్వ చింతన చెయ్యాలి. శిథిలమగు లక్షణము. దహింప బడు లక్షణము కలిగి చావు పుట్టుకలు, వృద్ధి క్షయాలు, శోకమోహములు, సుఖదుఃఖాలు, క్షుత్పిపాసలు, ఆశా మోహములు, జరాదుఃఖము, జాయా దుఃఖము మొదలగు వాటితో నున్న ఈ దేహము అశాశ్వతము. అశాశ్వతమైన దేహములో శాశ్వతమైన ఆత్మ కలదని గ్రహించ వలెను. "వా సాంసి జీర్ణాని యథావిహాయ" (2అ....22 శ్లో) అని గీతలో పేర్కొనినట్లు జీర్ణమైన పాత వస్త్రములు విడచి క్రొత్త వస్త్రములను ధరించినట్లు ఆత్మ ఈ దేహమును వదలి మరియొక దేహములోనికి వెళ్ళును. "నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" (2 అ. 23 శ్లో) "నిత్యః సర్వగతః స్థాణుః అచలోయం సనాతనః" - గీత.

పైన పేర్కొనిన శ్లోకములలో ఆత్మ స్వరూపమును భగవానుడు వర్ణించెను. ఆత్మ స్థిరమైనది. సర్వ వ్యాపకము. నిత్యమైనది. దీనిని ఎటువంటి ఆయుధము ఏమీ చెయ్యలేవు. దేహము ఆత్మ తత్త్వము తెలిసికొని క్షుద్రమైన హృదయ దౌర్బల్యము విడచి స్థిత ప్రజ్ఞ లక్షణములు తెలిసికొనవలయును. ఇవి గీతలో చెప్పబడినవి. వీటిని మహాత్మా గాంధీ ఎక్కువగా చదివేవారు. లోక మాన్య బాల గంగాధర్ తిలక్ "గీతా రహస్యము"ను పుస్తకమును గజానన మహారాజ్ అను (దత్తాత్రేయ అంశ సంభూతులు) సిద్ధ పురుషుని అను గ్రహము వలన రచించెను. గాంధీ అహింస, సత్యాగ్రహ సిద్ధాంతములను ( నిరాయుధ సత్యాగ్రహము, నిష్కామ యోగము ) గీత నుండి గ్రహించి స్వతంత్రము తీసుకొని రాగలిగారు. వినోబాభావే కూడా గీతా రహస్యము గ్రహించి సర్వోదయ నాయకుడై భూదాన ఉద్యమము చేపట్టెను. వివేకానందుడు "క్షుద్రం హృదయ దౌర్బల్యం" అను శ్లోకమును, రామానుజాచార్యులు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శ్లోకమును గూర్చి ప్రచారము చేసిరి. ఇలా ఎంతోమంది ఎన్నో శ్లోకములు తమ అనుభవములోనికి తెచ్చుకొనిరి. త్రిమతాచార్యులు, జ్ఞానేశ్వరుడు, రామకృష్ణ పరమహంస, షిరిడి సాయి బాబా, పరమహంస యోగానంద, శివానంద మొదలగు వారెందరోగీతావైశిష్ట్యమును గూర్చి బోధించిరి. వీరంతా స్థితప్రజ్ఞులు.

## 10. సాధన చతుష్టయము

సాధకుడు ఆధ్యాత్మిక రంగములో అభివృద్ధి చెందుటకు సాధన చతుష్టయమును గ్రహించి దానిని సాధించుటకు కృషి చేయవలెను.

1. నిత్యానిత్య వివేచనము :

నిత్య వస్తువైన ఆత్మ, అనిత్య వస్తువైన దేహము, జగత్తు గూర్చి తెలిసికొనుట.

2. ఇహాము త్రార్థ ఫలభోగ విరాగము :

ఇహ పరసౌఖ్యములు అశాశ్వతమని గ్రహించి వైరాగ్యమును పొందుట.

3. శమదమాది షట్క సంపత్తి :

i) శమము----- అంతరింద్రియ నిగ్రహము (మనో నిగ్రహము)

ii) దమము------ బాహ్య ఇంద్రియ నిగ్రహము (జ్ఞాన, కర్మేంద్రియములు)

iii) ఉపరతి------- ఇంద్రియములను ఆత్మ వైపు మళ్ళించుట.

iv) తితిక్ష --------- సమదృష్టి లేక ద్వంద్వాతీత స్థితి.

v) శ్రద్ధ ------------- శ్రద్ధ కలిగియుండుట. దీని వలన జ్ఞానం కలుగును "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"- గీత

vi) సమాధానం -------- మనస్సును సమాధాన పరచి ఆత్మానందమును పొందుట.

4. శరణాగతి (ముముక్షుత్వము) - భగవంతుని శరణు పొందుట. మోక్షము పై దృష్టి.

శ్రవణ - మనన - నిధి - ధ్యాసలు

ఇవికూడా సాధనకు ఉపయోగించు సాధనములు. పెద్దలు, అనుభవజ్ఞులు, గురువు చెప్పిన విషయములను శ్రద్ధతో విన వలయును. వాటిని మననము చేసికొనవలయును. తాను విని మననము చేసిన విషయమును గూర్చి ఏకా గ్రతతో దృష్టి పెట్టి ధ్యానించ వలయును. "అభ్యాసేనతు కౌంతేయ" అను గీతా వాక్యముననుసరించి అభ్యాస వైరాగ్యము లతో ఏకాంత ప్రదేశములో ప్రతి రోజు నిర్ణీత సమయములో ధ్యానించుట వలన తగిన మంచి ఆత్మాను భవము, ఆనందము కలుగును.

ఓం తత్ సత్

శ్రీ కృష్ణ భగవానుడు అర్జునునకు మహాభరత మధ్యలో కౌరవ పాండవ సైనికుల మధ్య ఉపదేశించెను.

రధారూఢుడైన అర్జునుడు జీవుడు

| | | |
|---|---|---|
| రధము | - | శరీరము |
| సారధి | - | బుద్ధి, కృష్ణుడు |
| కళ్ళెము | - | మనస్సు |
| గుఱ్ఱములు | - | ఇంద్రియములు |
| మార్గము | - | ఇంద్రియ విషయములు |
| ఆత్మ | - | భోక్త (కృష్ణుడు) |

వివరణ :

నేర్పరియైన సారధి జయము కలిగించును. యుద్ధరంగములో రథి కంటె సారధి నేర్పరియై ఉండవలయును. ఆధ్యాత్మిక రంగములో సారధితో సమానుడైన గురువు అజ్ఞానము లోనున్న (జీవుడు) శిష్యుని ( రధి ) జ్ఞానోపదేశము చే రక్షించును.

మంచి చెడుల సంఘర్షణ ( సంకల్పములు) మనము నిత్యము చూస్తూ ఉంటాము. ఇదియే కురుక్షేత్ర యుద్ధము. ఏకాదశ ఇంద్రియములను నిగ్రహించుకొని, ఏకాగ్రత తో సాధన చెయ్యాలి. "సమత్వం యోగముచ్యతే" (2--48) అను గీతా వాక్యము ననుసరించి సమబుద్ధి కలిగియుండ వలయును.

సుఖ దుఃఖములందు సమ భావము.

"వీత రాగ భయ క్రోధః స్థిత ధీర్మని రుచ్యతే" (2అ--56 శ్లో) అనునట్లు మంచి చెడు లందు సమభావము, పరమాత్మయందు దృష్టి కలవాడు, ప్రసన్న చిత్తుడు, "నిర్మమోనిరహంకారః" అను నట్లు అహంకార మమకారములు లేనివాడు స్థిత ప్రజ్ఞుడు. అభ్యాస వైరాగ్యములతో సాధకుడు సాధించ వలయును.

# 11. గీతా పారాయణ చేయు పద్ధతులు విశేషములు

భగవద్గీత మహిమను అధ్యాయ ముల ఫలితములను శ్రద్ధగా చదివి అర్థము చేసికొన్నచో గీతా పారాయణ చేయవలయునన్న కోరిక మనకు కలుగును. శ్రీ కృష్ణుడు గీతలో భక్తులను గూర్చి నాలుగు రకములుగా చెప్పెను.

1 ఆర్తులు - కష్టములో ఉండగా ప్రార్థించు వారు.
(ప్రహ్లాదుడు, గజేంద్రుడు మొదలగు వారు)

2. అర్థార్తులు - సంపద కొరకు ప్రార్థించు వారు. ( కుచేలుడు )

3. జిజ్ఞాసువులు - భగవంతుని గూర్చి తెలిసికొనవలయునని ప్రార్థించెడివారు.

4. ముముక్షువులు : మోక్షమును గూర్చి ప్రార్థించెడివారు. సాధకులు వారి వారి పద్ధతులననుసరించి సంకల్పమును బట్టి పారాయణ చేయవచ్చును. ఈ పారాయణలు ఏకాదశి రోజున ప్రారంభించుట మంచిది. విష్ణుమూర్తి తన మాయ చే కన్యారూపము ధరించి మురాసురుని సంహరించుట చేతను, విష్ణు స్వరూపిణి అయిన కన్యకను వరము ఇచ్చుట చేతను ఉత్తమతిథి అయిన ఏకాదశి, వ్రత ఉపవాసములకు, ముక్తికి కారణమైనది. సంవత్సరములో ఏకాదశులు 24 వచ్చును.

1. చైత్ర శుద్ధ ఏకాదశి కి కామద అని పేరు. కోరుకున్న కోరికలు ఈ రోజున ఫలించును.
2. వరూధిని గోదాన ఫలము లభించును
3. మోహిని ( వైశాఖము) పోయిన ఐశ్వర్యము లభించును.
4. అపర ( వైశాఖము ) తీర్థయాత్రల ఫలితము లభించును.
5. నిర్జల (జ్యేష్ట ) అన్ని ఏకాదశుల ఫలితము వచ్చును.
6. యోగిని ( " ) రోగములు పోవును.
7. శయన, తొలి ఏకాదశి (అషాఢ) - సంతాన ప్రాప్తి
8. కామిక (" ) - కోరికలు నెరవేరును.
9. పుత్రద (శ్రావణ) - పుత్ర సంతాన ప్రాప్తి
10. అజ ( " ) - దీనిని హరిశ్చంద్రుడు చేసెను. రాజ్య సంపద.
11. పరివర్తన (భాద్ర పద ) - గొప్ప పుణ్యము లభించును.
12. ఇంద్ర ( " ) - పితృ దేవతలకు స్వర్గ ప్రాప్తి.
13. సర (అశ్వియుజ) - స్వర్గ ప్రాప్తి.
14. దమన ( " ) - స్వర్గ ప్రాప్తి.

15. ప్రబోధిని ( కార్తీక ) క్షీరాబ్ధి ఏకాదశి - విష్ణుమూర్తి మేల్కొను రోజు. గొప్ప పుణ్యము లభించును.

16. కన్య ( " ) - స్త్రీ సంతానము.

17. మోక్షద ( మార్గశిర ) వైకుంఠ ఏకాదశి ( గీతా జయంతి) - మోక్షము లభించును

18. సఫల ( " ) - అన్న ప్రాప్తి

19. పుత్రద (పుష్య) - పుత్ర సంతానము.

20. షట్తిల ( " ) - మహాపుణ్య ప్రాప్తి.

21. భీష్మ ఏకాదశి ( మాఘ ) - పుణ్య ప్రదము.

22. విజయ ( " ) - సర్వత్ర విజయము లభించును.

23. అమలక ( పాల్గున ) - ఉసిరి కాయ నీరు త్రాగ వలెను

24. పాప విమోచన - పాపము నశించును.
అధిక మాసపు ఏకాదశిలు కూడా మంచివి.

భక్తులు ఏకాదశి ప్రాధాన్యతను గ్రహించి గీతా పారాయణ ప్రారంభము లేక ముగింపు ఏకాదశి వచ్చే విధముగ పారాయణ చేయుట మంచిది.

1. పారాయణ మంచి సమయములో చేయవలెను.

2. మారేడు (లక్ష్మీప్రీతి, శివప్రీతి), తులసి, రావి ( త్రిమూర్తుల కిష్టము ) మొదలగు వృక్షముల సమీపమున

3. విష్ణువు దశావతార పుణ్యక్షేత్రములు మరియు యేడు విధములైన మోక్షప్రదేశములు. అయోధ్య, మధుర, కంచి, కాశీ, అవంతీ, ద్వారకా, హరిద్వారము, బదరీ లేక గయ. ఇవి దేవతలకు. పితృదేవతలకు కూడా ఇష్టమైనవి. వీటిలో మధర, కురక్షేత్రము మరింత శ్రేష్ఠము.

4. నదీ తీరములు – గంగా,యమునా, సరస్వతి, గోదావరి, సరయు,నర్మదా, సింధు,కావేరి, చంద్ర భాగ మొదలగు నదులు, సముద్ర తీరములు - వీటిలో ప్రయాగ క్షేత్రము, (త్రివేణి సంగమము) శ్రేష్ఠము. మూడు నదుల కలయిక.

5. నదీ తీరము, కొండ ప్రదేశమున వెలసిన పుణ్యక్షేత్రములు బదరీ, కేదార్‌నాథ్, విజయవాడ మొదలగునవి.

6. ఆశ్రమములు, పీఠములు, మఠములు మొదలగు చోట్ల చెయ్య వచ్చును.

7. భక్తులు తీర్థయాత్రలకు వెళ్లినపుడు ఆక్షేత్రములో 1 లేక 2 రోజులు ఎక్కువ ఉండి పారాయణ చెయ్యవచ్చును.

8. గ్రామములు లేక పట్టణములలో మనకు సమీపములో నున్న దేవాలయములలో కూడా చెయ్య వచ్చును.

9. ప్రతి నిత్యము భగవంతుని పూజించు అలవాటు ఉన్నవారు వారి ఇండ్ల వద్దనే చేయవచ్చును. గోశాలలో చెయ్యి వచ్చును.

గమనిక : ఎక్కువ ఫలము కోరువారు పవిత్ర ప్రదేశములలో చేయుట మంచిది. గీత విభూతి యోగములో పేర్కొనినవి కూడా చాలా శ్రేష్టమైనవి.

పారాయణ చేయుటకు ముందు కృష్ణ మంత్రము లేదా ఇతర మంత్రములు కలవారు తమ ఇష్ట దైవ మంత్రములను, స్తోత్రములను లేదా విష్ణు సహస్రనామ స్తోత్రము చేసి 16 ఉపచారములు (పురుష సూక్త శ్రీ సూక్త సహితముగా ) పూజలు చేసి ప్రారంభించవలెను. సూక్తములు చదువలేని వారు కృష్ణనామ స్మరణ చేస్తూ పూజ చెయ్యవచ్చును. భగవంతునికి యాథాశక్తిగా పాలు, పెరుగు, వెన్న, పండ్లు, కొబ్బరి కాయ మొదలగునవి నివేదించ వచ్చును.

పారాయణ పూర్తి అయిన తరువాత మంత్రస్తోత్రాదులు చేసి గంధము, పువ్వులు, ధూపము, దీపము, నివేదన, తాంబూలము అనెడి పంచపూజ చేసి అపరాధ స్తోత్రములతో, "లోకాః సమస్తాః సుఖినోభవంతు" అని చెప్పి, "ఏతత్ ఫలం పరబ్రహ్మార్పణమస్తు" అని కర్మ ఫల త్యాగం సమర్పించవలెను. నీరు, అక్షింతలు వదులుట మంచిది. విశేష సంకల్పములు లేదా ప్రత్యేకముగా చేయువారు మంచిరోజున కలశము, అఖండ దీపారాధన తో ప్రారంభించి పూర్తి అయిన పిదప అన్న సమారాధన చేయుట మంచిది. ఈ సందర్భములో శక్తి యున్న వారు గీతా హోమము కూడ చేయుట ఉత్తమము.

ఈ సందర్భముగా అన్యోన్య సహాయముతో విష్ణు సహస్రనామ స్తోత్రములు, భాగవతము దశమ స్కంధము మొదలగు వాటితో పాటు లక్ష తులసి పూజ, గోపూజ మొదలగు కార్యక్రమములు ఎన్ని యైనను చేయవచ్చును. పారాయణ చేయువారితో పాటు ఇతరులకు కూడా దైవకార్యములలో పాల్గొను అవకాశము లభించును.

పారాయణ ఉదయము ప్రారంభించి మధ్యాహ్నము లోపుగ ( 12 గంటల లోపు ) పూర్తి చేయుట మంచిది. సాయంత్రము గీతా తాత్పర్య చర్చ, నామస్మరణాదులతో పూర్తి చేయవచ్చును.

పారాయణ మనసులో చేయరాదు. సమానస్థాయిలో పైకి చదవవలయును. అధ్యాయము మధ్యలో మాట్లాడరాదు. అట్లు ఎవరితోనైన మాట్లాడినచో ఆ అధ్యాయము మరల ప్రారంభించవలెను.

సంపుటితో పారాయణ - గీత బాగుగా చదవగలిగిన వారు సంపుటితో చెయ్యి వచ్చును. ఇది 1. మంత్ర సంపుటి, 2. శ్లోక సంపుటి అని 2 రకములు.

మంత్రములు--- పెద్దల వద్ద ఉపదేశము పొందుట మంచిది. లేదా కృష్ణునే గురువుగా తలచి ఈ క్రింది మంత్రములతో చెయ్యవచ్చును. ముందు మంత్రము చదివి పిదప శ్లోకము, మరల మంత్రము+ శ్లోకము ఈ విధముగా పూర్తి చేయవలెను.

1. ఓం క్లీం కృష్ణాయనమః

2. ఓం క్లీం గోవిందాయనమః

3. ఓం కృష్ణాయనమః
4. ఓం క్లీం కృష్ణాయ గోవిందాయనమః
5. ఓం నమో నారాయణాయ
6. ఓం నమో భగవతే వాసుదేవాయ

సాధకులకు నచ్చిన ఇతర మంత్రములు కూడా చేర్చవచ్చును. ఓం తత్ సత్ అను దానితో చెయ్య వచ్చును.

శ్లోక సంపుటి : మంత్ర సంపుటి కంటే ఇది ఎక్కువ సమయము పట్టును. ఎక్కువ రోజులు చేయునపుడు ఈ పద్ధతి అవలంబించవచ్చును.

గీతలో ప్రతి శ్లోకము పవిత్రమైనది. మంత్ర సమానమగుట చేత ఏ శ్లోకమైనను గ్రహించ వచ్చును. కొందరు పెద్దలు తమ అనుభవముతో చెప్పిన శ్లోకములు తీసికొనవచ్చును.

1. ఏక శ్లోకీ గీత గ పేరు గాంచిన , యత్ర యోగీ శ్వరః కృష్ణః
2. అనన్యా శ్చింత యంతోమాం
3. సర్వధర్మాన్ పరిత్యజ్య
4. క్లైబ్యమాస్మగమః పార్థః
5. హరే రామ హరే కృష్ణ

పారాయణ చేయు రోజులు :

1 రోజు పారాయణ - ఏకాదశి తిధి ( శుద్ధ ) 18 అధ్యాయములు

2 రోజులు పారాయణ - దశమి + ఏకాదశి ( శుక్ల పక్ష ) 9 x 2 = 18

3 రోజులు పారాయణ - 6 x 3 = 18

5 రోజులు పారాయణ - అష్టమి నుండి గాని ఏకాదశి నుండి గాని ప్రారంభము 4 x 4 = 16 + 2 = 18

9 రోజులు పారాయణ - తదియ నుండి ఏకాదశి వరకు 2 x 9 = 18 అధ్యాయములు

18 రోజులు పారాయణ - 1 x 18 అధ్యాయాలు

40 రోజులు పారాయణ - కార్తీక మార్గశిర మాసములు ( మండల దీక్ష )

60 రోజులు పారాయణ - గీతా జయంతి నుండి ( మార్గశిర శుద్ధ ఏకాదశి నుండి ) భీష్మ ఏకాదశి వరకు ( మాఘ శుద్ధ ఏకాదశి )

పై విధముగ సాధకుడు తనకు వీలైనన్ని పర్యాయ ములు చేయుట మంచిది. కనీసము 108 పర్యాయములు పారాయణ చేయుట ఉత్తమము. దీని వలన చిత్త శుద్ధి లభించును. భగవానుడు గీతలో "మాసానాంమార్గశీర్షోహం ఋతూనాం కుసుమాకరః" అనినుడి వినాడు. అందుచేత ఆనెలలు గమనించవచ్చును. వసంతఋతువునకు సంబంధించిన మాసములు చైత్ర వైశాఖములు.

చైత్రములో శ్రీ రామ నవమి ఉత్సవములు వచ్చును. వసంత నవరాత్రములు వచ్చును. వైశాఖములో పరశురామజయంతి, బుద్ధ జయంతి మొదలగు పర్వదినములు వచ్చును. కనుక ఈ రెండు భగవానునికి ఇష్టము. శ్రావణ మాసములో ( వర్ష ఋతువు ) కృష్ణ జయంతి మహోత్సవములు, కార్తీక మాసములో ( శరత్ ఋతువు ) క్షీరాబ్ధి ఏకాదశి, ద్వాదశి, మార్గశిరములో గీతా జయంతి (శిశిర ఋతువు ) మాఘమాసము భీష్మ ఏకాదశి ( హేమంత ఋతువు ) , ఆషాఢ శుద్ధ ఏకాదశి ( తొలి ఏకాదశి ) గ్రీష్మ ఋతువు. పై విధముగా పరిశీలించిన చో ప్రతి ఋతువులోను విశిష్టమైన ఏకాదశి పర్వదినములు కలవు. సాధకుని కోర్కె ననుసరించి ఏకాదశి పర్వమున ప్రారంభించుట లేదా పూర్తి చేయుట మంచిది.

"అన్ని దానముల కంటే అన్న దానము గొప్పది" అని చెప్పబడుటచే పారాయణ పూర్తి అయిన పిదప దానములు చేయుట మంచిది. లేనిచో ( దశదానములు ) అన్న దానములు (అన్న సమారాధన) చేయుట మంచిది. అంతట శక్తి లేని వారు 1,2,3,7,10,11 సంఖ్యలో భోజనములు పెట్ట వచ్చును. అదీ సాధ్యము కాని యెడల ఆవులకు ( పశువులకు, పక్షులకు,జలచరములకు,చీమలు మొదలగు వాటికి ఆహారము వేయుట కూడా ఉత్తమము) భగవంతుడు అతిథి రూపములో అన్నార్తుల రూపములో సమస్త ప్రాణికోటి యందు ఉండును. కనుక యధాశక్తి ప్రాణికోటి కి ఆహార మిచ్చుట మంచిది. అట్లే వృక్షాదులకు నీళ్ళు పోయుట మంచిది. రావి చెట్టు, తులసి, ఉసిరి, మారేడు, మొదలగు వృక్షములు భగవత్ స్వరూపములు

రామాయణములోని సుందరకాండ , మార్కండేయ పురాణములోని సప్తశతి ( మహాకాళి - మహాలక్ష్మి - మహా సరస్వతి ) మహిషాసుర మర్ధిని చరిత్ర, భాగవత దశమస్కంధము ఎంత ప్రసిద్ధమో భారతములోని గీత, విష్ణు సహస్రనామము అంత గొప్పవి. సాధకుని ఆసక్తి , పట్టుదల, ఏకాగ్రతతో గీతా పారాయణ అనేక పర్యాయములు చేయునప్పుడు మంత్రోపదేశమున్న వారు పెద్దల ద్వారా వివరములు గ్రహించి పురశ్చరణ పద్ధతిలో చేయుట ఉత్తమము. 108 గీతా పారాయణ లు చేయుట ( సుమారు 60 రోజులు లేదా 40 రోజులు) దానిలో 10 వవంతు తర్పణము. దానిలో 10 వ వంతు మార్జనము, దానిలో 10 వ వంతు హోమము, మిగిలిన సంఖ్య యధాశక్తి అన్నశాంతి చేయుట మంచిది. ఇది మంత్ర శాస్త్ర సంప్రదాయము. మంత్ర సంపుటితో చేయుట మంచిది.

పారాయణ చేయునపుడు మంచి నక్షత్రములలో చేయుట ఉత్తమము. దేవతానక్షత్రములు (అశ్విని, రోహిణి, కృష్ణుని జన్మ నక్షత్రము, మృగశిర, పునర్వసు శ్రీరాముని జన్మ నక్షత్రము, పుష్యమి, హస్త, చిత్త, అనూరాధ, ఉత్తరాషాడ, శ్రవణము ( వామనుడు ), ధనిష్ట, రేవతి. తిరునక్షత్రములుగా నున్న రోహిణి, పునర్వసు, శ్రవణము శ్రేష్టము.

సర్వము వాసు దేవమయముగా భావించి అహంకారమమకారములు విడనాడి నవ విధ భక్తులలో ఒకదానిని ఎన్నుకొని ఇంద్రియ నిగ్రహము, యమనియమాదులతో సత్కర్మలు చేయుట వలన సద్య ఫలితమును ఇచ్చును.

**ఓం తత్ సత్**

ఓం శ్రీ కృష్ణ పర బ్రహ్మణేనమః

18-29 శ్లో॥బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణిత స్త్రి విధం శృణు
ప్రోచ్య మానమశేషేణ, పృథ క్త్వేనధనంజయ ॥

తా॥ ఓ యర్జునా! సంపూర్ణ ముగాను వివరముగాను నేను చెప్ప బోవునట్టివియును సత్వ రజ, తమోగుణ, భేదముల చేత మూడు విధములుయినవియునగు బుద్ధి యొక్కయు, ధైర్యము యొక్కయు భేదములను వినుము.

18-30 ప్రవృత్తిం చనివృత్తిం చ కార్యా కార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ ! సాత్త్వికీ ॥

తా॥ కుంతీ పుత్రుడగు ఓ అర్జునా ! ఏ బుద్ధి బంధ హేతువగు కర్మ మార్గమును మోక్ష హేతువగు నివృత్తి మార్గమును కర్తవ్యాకర్తవ్యములను భయాభయములను, సంసార బంధమును, సంసార నివృత్తిని యున్నదున్నట్లు ఎఱుంగు చున్నదో ఆ బుద్ధి సాత్త్విక గుణము వలన కలిగినది గా తెలియును.

18-32 అధర్మం ధర్మమితి యామన్యతే తమసా వృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ ! తామసీ ॥

తా॥ ఓ యర్జునా! ఏ బుద్ధి అజ్ఞానము చేత నావరింపబడినదై యధర్మమును ధర్మమనియు తెలియు దగిన వాటినన్నిటిని విరుద్ధములుగా అనగా ఒక దానిని మఱియొకటి గాను తెలిసి కొనుచున్నదో ఆ బుద్ధి తమోగుణప్రధాన మైనది.

వివరణ : ఈ మూడు శ్లోకములలో బుద్ధి యొక్క సాత్త్విక రాజస తామస గుణములను గుఱించి తెలుపడమైనది.

1. జన్మాంతర సుకృత విశేషముచే నంత కరణ శుద్ధి గల వానికి ఒకరు చెప్పకయు శాస్త్రము చూడకయు నీ కార్యము చేసిన ముక్తియు నీ కార్యము చేసిన బంధమును కలుగునని స్వయముగా జ్ఞానము కలిగియుండును. ఇది సత్త్వ గుణము యొక్క స్వభావము.

2. ఈ కార్యము చేసిన దుఃఖము ఈ కార్యము చేసిన సుఖము గలుగునని యదార్థముగా తెలియక పోయినను గొప్ప వారి వాక్యము చేత గాని, లేక శాస్త్రములో చూచి గాని పూర్వము తనకు గలిగి యుండు స్వభావమును వెంటనే మార్చు కొని ప్రవర్తించెడు స్వభావము రాజస మగును.

3. స్వయముగా తెలిసికొనకయు, గొప్పవారు చెప్పినను శాస్త్రములు వినినను తన స్వభావమును మార్చుకొనక అన్నియు విపరీతముగా చేసెడు స్వభావము తామసమన బడును. సత్వ గుణ స్వభావము గల వానికి ఈ జన్మములోనే విశుద్ధ తత్త్వము కలిగి ముక్తి సిద్ధించును. దీని యందు

చెప్పబడిన రాజస స్వభావము గల వానికి మరణానంతరమును మంచి జన్మము గలిగి మోక్షమందు ప్రవృత్తి కలుగును. తామస స్వభావము గల వానికి కాలాంతరమున సత్కర్మ యందు బుద్ధి కలిగి అంతః కరణ శుద్ధి కలిగి అనేక జన్మములకు అవల మోక్షాసక్తి గలిగి ముక్తుడు కావలసి యుండును. సత్త్వ గుణము గల వాని హృదయము శుద్ధ చిమ్నీ యందు వెలిగెడి దీపము వలెను, రజో గుణము గల వాని హృదయము ఎరుపు రంగు గల చిమ్నీలోని దీపము వలెను, తమో గుణము గల వాని హృదయము మట్టి కుండలో వెలిగెడు దీపము వలె నుండును లేక నీలి రంగు గల చిమ్నీలోపల వెలిగెడి దీపము వలె నుండును.

2-62 ధ్యాయతో విషయా న్పుంస స్సంగస్తే ఘాప జాయతే
సంగా త్సంజాయతే కామః కామాత్క్రోధో భిజాయతే ॥

తా॥ ఇంద్రియ విషయములను సదా చింతించు చున్న మునుజునకు ఆ విషయములందు ఆసక్తి పుట్టుచున్నది. అట్టి ఆసక్తి వలన కోరిక గలుగు చున్నది. కోరిక వలన కోపము జనించుచున్నది.

2-63 క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహా త్స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధి నాశో బుద్ధి నాశాత్ప్రణ శ్యతి ॥

తా॥ కోపము వలన అవివేకము కలుగును. యుక్తా యుక్త వివేకములేని అవివేకము వలన మతిభ్రమ గలుగుచున్నది. మతి భ్రమ వలన బుద్ధి నశించుచున్నది. అట్లు బుద్ధి నాశనము వలన తానును తప్పక నశించుచున్నాడు.

వివరణ : విషయ చింతన వలన దాని యందు (1) ఆసక్తియు దాని వల్ల (2) కామమును, కామము వలన దానికి అడ్డు కలిగినపుడు (3) కోపమును, కోపమువలన (4) యుక్తా, యుక్త వివేకము లేక పోవుటయు, అట్టి వివేక జ్ఞానము నశించుట వలన ( 5) మతిభ్రమయును, మతిభ్రమ వలన (6) యదార్థము తెలియక బుద్ధి నాశనమును, బుద్ధి నాశనము వలన (7) సర్వ నాశనమున్ను కలుగు చున్నది. అనగా ఆత్మ వినాశనము కలుగుచున్నది. ఈ ఏడు విధములగు పరిణామములకును విషయ చింతనయే కారణమగుచున్నది. ఒక చింత విత్తనము మొలక వచ్చిన సమయమున దానిని గోరుతో సులభముగా త్రుంచి వేయవచ్చును.

అది కొమ్మలతో రెమ్మలతో పెరిగి పెద్ద చెట్టయిన పిమ్మట దానిని త్రుంచి వేయుటకు గాని మూలముతో నూడబెరుకుటకు గాని రహితమొనర్చుటకు గాని ఎంతటి ప్రయాసయో లేక తరము కాదో అట్లే విషయ వాసన కలిగిన వెంటనే దానిని రహిత మొనర్చుట సులభములేనిచో దానిని నాశనమొనర్చుట మహాప్రయాసయగును. అంతే గాక దానిచే ఆత్మ వినాశము కూడా సంభవించును.

2-67 ఇంద్రియాణాంహి చరతాం యన్మనో ను విధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మి వాం భసి ॥

తా॥ విషయముల మీదికి పోవుచున్న ఇంద్రియములతో జేరుకొని మనస్సు గూడ విషయముల మీదికి బోయెనేని అట్టి మనస్సు సముద్రము నందలి ఓడను తుఫాను గాలి ముంచివేయు విధముగ బ్రహ్మ నిష్ఠుని యొక్క ఆత్మ జ్ఞానము నశింప జేయు చున్నది. అనగా అట్టి వాడు సంసార సాగరములో మునిగి పోవును.

వివరణ : ఇంద్రియములు విషయములలో ప్రవర్తించు చున్నను దోషము లేదు. మనస్సే ప్రధానమని చెప్పు వారల గురించి శ్రీ కృష్ణ భగ వానుడు ఉపదేశించినది చూడుడు. సముద్రములో ప్రయాణము చేసెడు నావికులు తుఫాను గాలి యొక్క చిహ్నాము గనిపించినను ఓడను ఎలాగు నలంగురు వేసి నిల బెట్టుదురో లేక ఓడను రేవులోనికి జేర్చుదురో అలాగున ఎచ్చట నెట్లుండిన విషయ దోషముచే మనస్సునకు మాలిన్యము లేక పతనము కలుగునని తోచునో ఆస్థలమును వెంటనే విడిచి వెళ్ళవలెను. లేక ఏకాంతమున ధ్యానములో నుండవలెను. అట్లు గానిచో సంసార సాగరములో మునుగుట నిక్కము.

3-6 కర్మేంద్రియాణి సంయమ్యయ ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢా త్మా మిథ్యా చారస్స ఉచ్యతే ॥

తా॥ ఏ మూఢ బుద్ధి గల వాడు కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములను అణచి పెట్టి ఇంద్రియ విషయములను మనస్సు తో స్మరించుచున్నాడో వాడు మోసగాడని చెప్పబడుచున్నాడు.

వివరణ : బాహ్యాభ్యంతరములు రెండును శుద్ధములుగా నుండవలెను. అప్పుడే నిష్కళంకుడగును. అట్టి నిర్మలాత్ముడు మాత్రమే శుద్ధాత్మను దర్శింప గలడు.

3-16 ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహయః
అఘాయురింద్రియా రామో మోఘం పార్థ సజీవతి ॥

తా॥ ఎవడు ఈ లోకమున పై చెప్పబడిన ప్రకారము ప్రవర్తింప జేయబడిన జగత్చక్రమును అనుసరింపడో వాడు పాపమయమగు జీవనము గల వాడును ఇంద్రియములోలుడును విషయా సక్తుడు నునై వ్యర్థముగా బ్రతుకు చున్నాడు.

వివరణ : ప్రజల అభివృద్ధి కొఱకు సత్కర్మ చేయని వాడు పాపజీవియనియు వాడు వ్యర్థముగా జీవించు వాడనియు ఈశ్వరనిర్మితమగు జగత్చక్రమునకు అనగా ప్రజాభివృద్ధికి తోడ్పడని వాడగుట చేతను ఇంద్రియములలో రమించు వాడగుట చేతను ఆత్మారాముడు గా జాలడనియు తెలియ వలెను. వాడు వ్యర్థ జీవుడు మాత్రమే కాదు ఆత్మను అనర్థ మొనర్చిన వాడు కూడానగును.

3-27 ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూడాత్మా కర్తా హమితి మన్యతే ॥

తా॥ నేను అనియెడు దురభిమానము గల వాడు స్వభావము వలన, ప్రకృతి వలన కలిగిన సత్త్వర జస్త మోగుణముల చేత చేయబడుచున్న నానావిధములైన కర్మలను నేను చేయు వాడను అని తలంచుచున్నాడు.

3-39 అవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్య వైరిణా
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేనచ ॥

తా॥ ఎంత నిండింప జూచిననూ నిండనిదియు, అగ్ని వలె తృప్తి లేనిదియును, ఇచ్ఛారూపమైన దియును, జ్ఞానికి సర్వ కాలములందును శత్రు వైనదియునయిన కామము చేత జ్ఞానము అవరింపబడియున్నది.

వివరణ : అగ్ని హోత్రుడు సమిధుల చేతను, ఘృతము చేతను అంతకంతకు వృద్ధియగునట్లు విషయ సుఖములు అనుభవింపగా నను భవింపగా వృద్ధి పొందునేగాని శమింపవు. సముద్రమును నదులచే నిండింప జూచినను నిండదు. విషయ భోగములును అటువంటివే కనుక సముద్రమును అగ్నిని దృష్టాంతముగా చెప్పుటకు కారణముఅంతే కాదు కామమును జ్ఞానమునకు పరమ శత్రువునుగా దలంపవలెను. ఈ సంగతి తెలియక కొందరు విషయాసక్తులు ఒకసారి అను భవించిన కామము శమించునని వచింతురు. వీరు ఆత్మ శుద్ధి లేనివారు. వీరి వాక్యములు చాలా అపాయమును కలుగ చేయును. సమిధలు వేయనిచో అగ్ని స్వయముగా చల్లారు నట్లు విషయ నివృత్తి గల హృదయములో మాత్రమే కామాగ్ని శమించును.

4-40 అజ్ఞ శ్చాశ్రద్ధ ధానశ్చ సంశయా త్మా వినశ్యతి
నాయం లోకో2 స్తి నపరో నసుఖం సంశయాత్మనః॥

తా॥ గురూపదిష్ట వాక్యార్థమును తెలిసికొనజాలని వాడు, గురువు చెప్పెడు వాక్యములను శ్రద్ధతో విననివాడు, గురువు చెప్పెడు వాక్యార్థమందు సందేహముతో గూడిన మనస్సు గలవాడు నశించుచున్నాడు. సంశయముతో గూడిన మనస్సు గల వానికి ఇహ సుఖము లేదు. పర సుఖము లేదు , మరియెచ్చటను సుఖములేదు.

7-15 నమాం దుష్కృతి నోమూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయ యా2పహృత జ్ఞానాః అ సురం భావమాశ్రితా : ॥

తా॥ పాపము చేయువారును మూఢులైన వారును మాయ చేత నపహరింపబడిన ఆత్మ జ్ఞానము గల వారును రాక్ష స ధర్మములైన హిం స అసత్యాదుల నాశ్రయించిన వారును నైన మానవాధములు నన్ను పొందజాలరు.

వివరణ : అ సత్యము, హింస, విషయే చ్ఛ మొదలగు అసుర గుణము లున్నవారు దైవమును పొందజాలరు.

7-27 ఇచ్ఛా ద్వేషసముత్థేన ద్వంద్వ మోహేన భారత
సర్వభూతాని సమ్మోహం సర్గేయాంతి పరం తప ॥

తా॥ శత్రు సంతాపకుడవగు ఓ అర్జునా ! సకల ప్రాణులును పుట్టుక తోడనే కామ క్రోధముల వలన గలిగిన సుఖదుఃఖాది ద్వంద్వ రూపమగు మాయ చేత మిక్కిలి యజ్ఞానమును పొందుచున్నవి.

వివరణ : భగవత్ సాక్షాత్కార జ్ఞానము అందరికిని యెందులకు కలుగుటలేదో యెందు వలన అందరును భవ బంధ విముక్తిని పొందుట లేదో ఆ విషయము ఈ శ్లోకమున నిరూపించబడినది. ఇచ్ఛా ద్వేషములు, సుఖ దుఃఖములు, రుచి అరుచులు, శత్రు మిత్రులు అను ఈ ద్వంద్వ ములలో తగిలియుండుటచేత అవియే బంధ రూపములుగా పరిణమించుచున్నవి. వానిని ఆత్మ జ్ఞాన ఖడ్గము చే ఛేదించిన భవ బంధ విమోచనము కలుగును. ఇట్టి స్థితి తనకు కలిగినదా అని ప్రతి వారును ఆలోచించు కొనిన చాలును. అప్పుడు ఎందుకు మోక్షము కలుగ లేదో భగవద్దర్శనము ఎందుకు కలుగ లేదో మరియొకరిని అడుగకనే తనయాత్మ నండియే స్పష్టముగా సమాధానము లభించును. ఇచ్ఛా ద్వేషములే మోక్షద్వారము యొక్క రెండు తలుపులు వీనిని తెరువ వలయును. అనగా విడువవలెను.

9-3 అశ్రద్ధ ధానాః పురుషా ధర్మ స్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసార వర్త్మని ||

తా|| శత్రు సంహారకుడవగు ఓ అర్జునా ! ఈ ఆత్మ జ్ఞానము అనెడు ధర్మము యొక్క స్వరూపమునందు నమ్మకము కలిగి శ్రద్ధతో నాచరింపని విశ్వాస రహితులైన మానవులు నన్నుబొంద జాలక మృత్యువుతో గూడుకొనిన మృత్యు రూపమగు సంసార మార్గము నందే నిశ్చయముగా తిరుగుచున్నారు.

వివరణ : మనుజులకు శ్రద్ధయే ముఖ్యముగా నుండవలయుననియు అది శ్రద్ధ లేనిచో సంసార దుఃఖ విమోచనము కానేరదనియు శ్రీ కృష్ణ భగవానుడే తెలిపెను. పైరును గాని ఫల వృక్షములను గాని శ్రద్ధతో సంరక్షించిన మాత్రమునే అవి మంచి ఫలము నిచ్చును. కట్ట కడకు వంట చేయునప్పుడు కూడా అన్ని పదార్థములు శుద్ధము గా నుండినను శ్రద్ధ లేక వండినచో మంట అధికమై పొంగి పోవుటయో లేక మాడి పోవుటయో జరుగును. అట్లే మంట తక్కువగుచో సరిగా ఉడకకపోవుటయు సంభవించును. ఇట్లుండగా ఆధ్యాత్మిక మార్గమున శ్రద్ధ అత్యంత ముఖ్యమైనది.

9-12 మోఘాశామోఘ కర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైన ప్రకృతిం మోహినీం శ్రితాః ||

తా|| వ్యర్థములైన యాశలు గల వారును, వ్యర్థములైన కర్మ కాండ ప్రవృత్తి గల వారును, వ్యర్థమైన జ్ఞానము గల వారును, జ్ఞాన హీనులునగువారు రాక్షస సంబంధమైనదియున సురసంబంధ మైనదియునగు స్వభావమును ఆశ్రయించిన వారగుచున్నారు.

13-21 పురుషః ప్రకృతి స్థోహి భుంక్తే ప్రకృతి జాన్ గుణాన్
కారణం గుణ సంగో2స్య సద సద్యోని జన్మసు ||

తా|| పురుషుడు ప్రకృతియందున్న వాడు గదా, అకారణము వలన ప్రకృతి సంబంధములగు గుణములననుభవించుచున్నాడు. అ జీవునికి ప్రకృతి గుణముల యందలి యాసక్తి ఉత్కృష్ట నికృష్ట జన్మములు కలుగ జేయుట యందు కారణమగుచున్నది.

వివరణ : ఇది బద్ధ జీవుని గురించి చెప్పడమైనది. అతని శుద్ధా శుద్ధ గుణములే శ్రేష్ఠ, నికృష్ట జన్మములకు కారణములు.

14-8 తమస్త్వ జ్ఞానజం విద్ధి మోహనం సర్వ దేహినాం
ప్రమాదాల స్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత ||

తా|| ఓ భారతా ! ఇది మంచి ఇది చెడుయని తెలిసికొనజాలని యజ్ఞానము వలన కలిగినదియు సకల ప్రాణులకును మోహమును కలుగ జేయునదియు నగు తమోగుణము భ్రమ, సోమరితనము, అతి నిద్రయను వానిచే నాత్మము బంధించుచున్నదని తెలియును. తమోగుణము ఎట్లాత్మను బంధించుచున్న దనగా అజాగ్రత్త , బద్ధకము, అతి నిద్ర మొదలగు వాని వలన జీవుని బంధించును. ఈ తమోగుణము నిజమైన జ్ఞానము లేక పోవుటచే నొక వస్తువు మరియొక

వస్తువుగా దలంచెడు జ్ఞాన శూన్యత్వము చేత కలుగును. కనుకనే జీవులనందరిని విపరీత జ్ఞానముచే మోహింపజేయును.

14-13 అప్రకాశో2ప్రవృత్తి శ్చ ప్రమాదో మోహఏవచ
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ॥

తా॥ కురు కుమారా ! ఓ యర్జునా ! తమోగుణము వృద్ధి కాగా బుద్ధి మాంద్యము పనిచేయనిచ్ఛగించ కుండుటయు, బద్ధకము, పొరబాటు, అజాగ్రత్త, అజ్ఞానము అనునవి కలుగుచున్నవి.

16-4 దంభో దర్పో2తిమానశ్చక్రోధః పారుష్య మేవచ
అజ్ఞానం చాభి జాతస్య పార్థ సంపద మాసురీమ్ ॥

తా॥ అసుర గుణములందు సంపద యందు పుట్టిన వానికి డంబము, గర్వము, దురభిమానము, కోపము, వాక్పారుష్యము అనగా పరులను పీడించే లాగున వచించెడు స్వభావము వివేక జ్ఞాన హీనతయు కలుగును. ఇవి అసుర సంపద గల వారి లక్షణములు అని భావము.

16-7 ప్రవృత్తించ నివృత్తించ జనాన విదురా సురాః
నశౌచం నాపిచా2చారో న సత్యం తేషు విద్యతే ॥

తా॥ అసుర స్వభావము గల వారు ఇవి పురుషార్థ సాధనములగు ధర్మములు కనుక వీటిని మనమాచరింప వలయుననియు, ఇవి సంసార బంధ విముక్తి మార్గములనియు, ఇవి పురుషార్థ సాధక ధర్మములు కావు, వీటిని మనము త్యజించ వలెనని ఎఱుంగరు. అనగా సంసార బంధ కారణములను తెలిసికొనరు. ఇట్టి వారు బాహ్య శుద్ధియు చిత్తశుద్ధియు ధర్మా చరణము సత్య వాక్యతయు గల వారుకారు.

16-8 అసత్య మప్రతిష్టం తే జగదా హురనీ శ్వరమ్
అపరస్పర సంభూతం కి మన్య త్కామహై తుకమ్ ॥

తా॥ అసుర స్వభావము గల వారు ప్రపంచము సర్వ ప్రాణులు జంట వలన కలుగుచన్నదనియు, జగదుత్పత్తికి స్త్రీ పురుషుల కామమే కారణమనియు, దీనికి కర్త మరియొక ఈశ్వరుడు లేడనియు, దైవ నిర్మిత వేద శాస్త్రములతో మాకు పని లేదనియు చెప్పుదురు. వీరే నాస్తికులు.

16-9 ఏతాందృష్టి మవష్ట భ్యనష్టా త్మా నో2ల్ప బుద్ధయః
ప్రభవన్త్యు గ్ర కర్మాణః క్షయాయ జగతో2హితాః ॥

తా॥ పైన చెప్పిన నాస్తిక దృష్టినవలంభించిన చెడిన మనస్సు గల వారును లేక ఆత్మ జ్ఞానము లేని వారును, దీర్ఘ విచారము చేయు శక్తి లేని స్వల్ప బుద్ధి గల వారును ప్రపంచమునకు హాని కలుగ జేయుట కొరకు జ్ఞానవిరోధులుగను, క్రూరకర్మలు చేయు వారు గను పుట్టుచున్నారు.

16-10 కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భ మానమదాన్వితాః
మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ప్రవర్తన్తే శుచివ్రతాః ॥

తా॥ వారలు పూర్వోక్త నాస్తికులు డంబము, దురభిమానను, గర్వమును నీ దుర్గణములతో కూడు కొన్న వారై నిందింప కూడని మితిలేని కోరికల నవలంబించి అవివేకము వలన నీచుల చే అచరింప దగిన నీచాహారము, నీచ దేవతో పాసనము మొదలగు హీన వృత్తులు గల వారై ప్రవర్తించుదురు.

16-11 చిన్తామ పరమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితా ః ॥

తా॥ కామ భోగములననుభవించుట యందే యా సక్తి గలవారును అట్లనుభవించుట కంటె మేలైన పురుషార్థము వేరొండు లేదని నిశ్చయించిన వారునునై, పరిమితి లేనిదియు మరణ కాలము వరకు విడువనిదియు నగు చింత నాశ్రయించిన వారగుదురు. మితి మీరిన చింత గలిగి యుండ రాదు. అది మంచి కార్యమైనను సరి. లేక చింత యుండు వరకు చిత్తము నశింపదు. చిత్త శాంతి లేనిచో శాశ్వత సుఖము లభింపదు.

16-12 అశాపాశశ తైర్బద్ధాః కామక్రోధ పరాయణా ః
ఈహంతే కామభోగార్థ మన్యాయేనార్థ సంచయాన్ ॥

తా॥ అనేక విధములగు అశా పాశములచే కట్టు బడిన వారలై, కామక్రోధములే ప్రధాన గుణములుగా గల వారలై విషయ భోగముల నను భ[illegible]టకు కావలసిన ద్రవ్యముల నక్రమమైన మార్గము చేత నైనను సంపాదింప కోరుదురు.

వివరణ : వృక్షమునకు వేరు లెటువంటివో, జీవుని కాశాపాశములటువంటివి. వేర్లను ఎంతెంత నరికిన అంతంత చెట్టు యొక్క అభివృద్ధి తగ్గి పోవును. ఒక్క వేరుండినను చెట్టు చావదు. దానిని కూడా నరికి వేసిన చెట్టు క్రింద పడి యెండి పోవును. అలాగున జీవుని యొక్క అశలెంత కెంతకు తగ్గునో అంత కంతకు మాయ శమించును. అయితే దృశ్య విషయవాసనయను వేరొకటుండినను ప్రకృతి నుండి విముక్తి కలుగదు. కనుకనే కొందరు కొన్ని యాశా పాశములను తగ్గించి ధ్యానముచేయునప్పుడు కొంత వరకు మనశ్శాంతి కలుగును కాని సంపూర్ణ మనో నాశనము కలుగ నందు చే ముక్తా త్ములై సదా ఉపరతియగు పరమ శాంతిని పొందలేక పోవుచున్నారు.

16-13,14,15,16

ఇదమద్య మయాలబ్ధ మిదం ప్రాప్స్యే మనోరథమ్
ఇదమస్తీ దమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥

తా॥ ఇప్పుడు నాకీద్రవ్యము లభించినది. ఈ కోరిక సిద్ధించినది. ఇక నీ కోరికను పొందగలను. నాకిప్పుడీ వస్తువులున్నవి. ఇక నీ ధనము కూడా నాకు రాబోవుచున్నది. ఈ శత్రువు నా చే హతము చేయ బడినాడు. తక్కిన వారిని కూడ హతము చేసెదను. నేను ప్రభువును. నేను సర్వ సుఖములన

ను భవించు వాడను. నేను తలంచిన కార్యమును సిద్ధి పొందింపగలవాడను, బలవంతుడను, సుఖిని, నేను ధనాఢ్యుడను, ఉత్తమ కులములో బుట్టిన వాడను, నాతో సమానమైన వాడు మరెవ్వడు? నేను యజ్ఞాదులు చేయగలను. దానము చేయ గలను. ఆనందింప గలనని ఇట్లు అజ్ఞానము చే భ్రాంత చిత్తులయ్యెదరు. మరియు అనేక విధములగు మనో వికారములు గల వారును, మోహమనెడి వలలో జిక్కిన వారును విషయ భోగములనుభవించుట యందు మిక్కిలి యాసక్తి గల వారునునై అసహ్యమగు నరకము నందు పడుచున్నారు.

16-17 ఆత్మ సంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజన్తే నామయ జ్ఞైస్తే దమ్భేనా విధి పూర్వకమ్ ॥

తా॥ ఆయసుర గుణము గలవారు తమ్ము తామే సర్వ గుణ విశి ష్టులను గా పొగడు కొనుచున్న వారును, పెద్దల యందు వినయ విధేయతలు లేని వారును, దురభిమాన గర్వములను చెందు వారు నునైపేరు కొఱకు మాత్రమే యజ్ఞ దాన సంతర్పణ చేయుదురు.

వివరణ : ఎవరు బ్రహ్మ నిష్టుల పాదములపై శిరస్సు ను వంచరో వారికి ప్రకృతి లొంగదు.

16-18 అహంకారంబలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మ పరదేహే షు ప్రద్విషన్తో2భ్య సూయకాః ॥

తా॥ దురహంకారమును, బలమును, గర్వమును, దురాశను, కోపమును అవలంభించిన వారై తమ కంటె నితరములగు దేహముల యందుండెడు నన్ను అసూయా పరులై ద్వేషింతురు.

16-19 తానహం ద్విషతః క్రూరా సంసారేషు నరాధమాన్
క్షిపామ్య జస్రమశుభా నాసురీష్వేవ యోనిషు ॥

తా॥ సమస్త ప్రాణులలో నంతరాత్మ స్వరూపుడనై యున్న సర్వేశ్వరుడనగు నన్ను ద్వేషించుచున్న క్రూరులను అనాచార పరులగు అనరాధములను నేనెల్లప్పుడును జనన మరణ ప్రవాహ రూపమగు సంసారమునందు అనగా నసురయోనుల యందు పడద్రోయుచున్నాను.

16-20 ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైన కౌన్తేయ తతో యాన్త్య ధమాం గతిమ్ ॥

తా॥ కుంతీ పుత్రుడవగు ఓ యర్జునా! అసురయోని యందు జన్మించిన అమూఢులు నన్ను బొందకయే ప్రతి జన్మయందును అంతకంటె ముందటి జన్మము కంటె నీచతరమగు జన్మమును పొందుచున్నారు.

16-21 త్రివిధం నక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథాలో భస్తస్మా దేత త్రయం త్యజేత్ ॥

తా॥ పైన చెప్పబడిన యాసుర దోషములలో సకల దోషములకు మూలములు, కామ, క్రోధ, లోభములు కనుక నీ మూడును నరకమును పొందుటకును తాను నీచయోనుల యందు జన్మించుటకు కారణములు. అందువలన జనన మరణ రూప నరకము నుండి తొలగ గోరు వారీ మూడింటిని వదలవలెను.

వివరణ : ఇది వరలో చెప్ప బడిన యసుర గుణములు గల వారు ప్రతీ జన్మము లోను పూర్వ జన్మము కన్న నికృష్ట జన్మమునే పొందెదరని తెలుపడమైనది. అయితే వారి గతి యంతేనా, ఇక నైదైనా తరుణోపాయము గలదా అను సందేహము పడనక్కరలేదు. పైనుదహరించిన యసురగుణములన్నిటికిని, కామ, క్రోధ, లోభములనెడు ఈ మూడును హేతువులు అనగా కారణములు. ఈ మూడు ను నరకము నకు నాత్మ వినాశనమునకును కారణములు. కావును నీ మూడింటిని విడిచి పెట్టి యెప్పుడు దైవ గుణముల నవలంభించునో అప్పటి నుండి యూర్ధ్వ గతి గలిగి పరమేశ్వర కృపకు పాత్రుడై మోక్షమును పొందగలడు. సామాన్యముగా చాలామంది భక్తుల యందును ముముక్షువుల యందును కూడా ఈ కామము, క్రోధము, లోభము పూర్తిగా లేనప్పటికిని కొంత పరకైన నుంటూ యున్నది కావున నీమూడును నరకమునకు ఆత్మ వినాశమునకును కారణములు కనుక నీ మూడింటిని త్యజింపవలెనని ఈశ్వరుడు చెప్పిన దానిని మరువకూడదు. భగవంతుడు కరుణా సముద్రుడు కనుక ఈ మూడు గుణములను విడిచిన చాలునని యుపదేశిండమైనది. అప్పటి నుండి యూర్ధ్వ గతి గలుగును. మంచి చేయు క పోయినను చెడు చేయకుండిన చాలును.

16-23 యశ్శాస్త్ర విధి మత్సృ జ్య వర్తతే కామకారతః
నస సిద్ధి మవా ప్నోతి న సుఖం నపరాంగతిమ్ ॥

తా॥ నీవు దీనిని చేయుమని చెప్పునట్టి విధి వాక్యమును నీవు దీనిని చేయకుము అని చెప్పునట్టి ప్రతి షేధ వాక్యమును అనగా వేదోక్తములగు విధి ప్రతి షేధ వాక్యములను అనాదరణ చేసి విడచి పెట్టి స్వేచ్ఛా ప్రకార మెవడు నడుకొనుచున్నాడో వానికి పురుషార్థ ప్రాప్తియోగ్యమగు తత్వ జ్ఞానముగాని ఇహలోక సౌఖ్యములుగాని స్వర్గముగాని మోక్షముగాని ఏదియును లభించదు.

వివరణ : శాస్త్ర విధియనగా నెవరెవరేయే యనుష్టానమును గలిగియున్నా రోదానికి సంబంధించిన యాచరణయే కాని జాతిని కులమును గురించినదని కొందరు చెప్పెడు నొక దాని నైనను పొందఅర్థము గాదు. ఏ యౌషధమున కేయే పథ్యమో అయుర్వేదములో విధింపబడినదో అట్టి పథ్యము ననుష్టింపవలెను. లేనిచో రోగము కుదరనట్లు ఏదో యొక జపధ్యానమో లేక దేహ సన్యాసము మాత్రమో చేసికొని దానికి తగిన యాచరణలేనిచో భవరోగవిముక్తి కలుగదు. ఔషధ సేవనముతో గూడి యున్నపుడు కొంచెము ప్రయాసగా నుండినను తరువాత నారోగ్య సుఖము నెల్లప్పుడనుభవించవచ్చును. అట్లు నిగ్రహము చేయ నొల్లని వారు ఎల్లప్పుడు వ్యాధి ఛే భాదితులై యావజ్జీవి తమును దుఃఖముతో గడుపవలసి యుందురు. 1. ఇహసుఖమనియు 2. పరలోకమందు స్వర్గ సుఖమనియు 3. ఉపాసనామూర్తుల బ్రహ్మాది లోక సుఖమనియు 4. ఆత్మ సాక్షాత్కార జ్ఞాన సుఖమనియును సుఖములు నాలుగు కలవు. అను ష్టానము లేని వాడు ఈ నాల్గింటిలో నొక్క దాని నైనను పొంద జాలక పోవుటయే గాక దుఃఖమును గూడ పొందవలసి యుండును. ఈ నాల్గవదే బ్రహ్మ సుఖము.

17-5 అశాస్త్ర విహితం ఘోరం తప్యన్తే యే తపోజనాః
దమ్భాహంకార సంయుక్తాః కామరాగబలాన్వితాః ॥

తా॥ 5-6 శ్లో॥ ఏజనులు దంభాహంకారములతో గూడిన వారును కామరాగ బలముతో గూడిన వారునై శాస్త్ర సమ్మతము గాని దియు తనకు నితరులకు ను బాధాకరమైనట్టి దియునునగు తపస్సును చేయు చున్నారో అట్టి యవివేకులు తమ శరీరముల యందుండు నట్టి ఇంద్రియ సమూహమును తమ సూక్ష్మ శరీరములందుండునట్టి నన్నును కృశింప చేయు వారగుచున్నారు. అట్టి వారల నసుర గుణము గల వారిని గా నెరుంగుము.

వివరణ : శరీరేంద్రియములను పాడు చేసికొని యాత్మను దుఃఖ పెట్టెడు తపస్సు మంచిది కాదు. అది రాక్షసులిష్ట సిద్ధి కొరకు చెసెడు క్రూర తపస్సు వంటిది. దేహేంద్రియములకు బాధ లేనిదియు, ఆకలి దప్పికలచే బాధ యాత్మకు కలుగనిదియునగు జ్ఞానపరమగు తపస్సే సాత్త్విక తపస్స నబడును. దీని వలననే ఈశ్వరా నుగ్రహము జ్ఞానమును కలుగును. రావణాది రాక్షసులు లోక వినాశన కరమగు సిద్ధి కొరకే యట్టి ఘోర తపస్సు చేసిరి. అలాంటిది చేయ కూడదు. అయితే సుకుమారులై యుండ వలెనని ఇష్టము కాదు. ఆత్మ పీడ గలుగని యే యా హారమైన భుజించి పరమాత్మ ధ్యానమొనర్చవలెను. తపశ్శబ్దమునకు అంతః కరణములో గల దోషములను భస్మమొనర్చుటయే అర్థమగును. ఇది జ్ఞాన విచారణ చేతను ధ్యాన బలము చేతను కలుగ వలెను. శరీర మాన సేంద్రియాదులకు చక్కని బలము లేనిచో తీవ్ర ధ్యానము చే నింద్రియాతీత జ్ఞానమును పొందజాలరు. దేహేంద్రియములకును మనస్సునకును దౌర్బల్యము గలిగి ధ్యానాదులు చేయుటకు శక్తి లేని వారి తపస్సు తమస్సే యగును. వీరు నొక విధమగు రోగుల వలె నుండు వారగుదురు. లోక మును భ్రమింప చేయు తలంపుతో చేయు తపస్సు ఆత్మ వంచక మగును. ఇట్టి వారి జీవితము వ్యర్థమై పోవునని మరువకుడు.

17-10 యాతయామం గతరసం పూతి పర్యుషితం చయత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్ ॥

తా॥ చల్లారి పోయినదియు రసము తీసినదియు దుర్గంధము గలదియు ఒక రోజు క్రిందట వండ బడినదియు ఒకరు తినగా మిగిలి పార వేసినదియు పూజార్హము కానిదియు నయిన యాహారము తమోగుణ స్వభావము గల వారి కిష్టమై యుండును. ఎక్కువ వేడి గలది రజోగుణస్థులకును ఎక్కువ చల్లబడినది తమోగుణ ము గల వారి కిని ప్రియమై యుండును.

వివరణ : వండిన తరువాత నొక్క యామము గడిచినదియు ముందు దినము వండినదియు కూడదని చెప్పటలో నీటిలో నుడక బెట్టిన యన్నము పరమాన్నము మొదలగు వానికిది చెందునే గాని నూనెలో వేయించిన చెడని పదార్థములకు సంబంధించదు. అదియు గబ్బు, దుర్గంధముతో కూడినది కాకూడదు. ఉచ్ఛిష్ట శబ్దము ఒకరు తిని పార వేసిన దానికి సంబంధించినదే గాని భగవత్ ప్రసాదమునకు వర్తించదు. భగవదుచ్ఛిష్ట ప్రసాదము భక్తుల కెటువంటిదో, ఎంత పవిత్రమైనదో అలాగున బ్రహ్మ నిష్ఠులగు గురువుల యుచ్ఛిష్టము శిష్యులకు భర్తృచ్ఛిష్టము పతివ్రతలకు నంత పవిత్ర మైనది. అది వారికి భగవత్ ప్రసాదము వంటిదగును. భర్తృచ్ఛిష్టము భార్యకును దోషకరము కాదు. సాధారణముగా తిని మిగిలిన దాని నెచ్చ టనో పారవేసి యుండిన దానిని తీసి తినే వారికే ఈ యుచ్ఛిష్ట శబ్దము వర్తించును. ప్రకృతిలో సూదంటు రాయి యినుము మొదలగు లోహములనాకర్షించునే కాని కఱ్ఱ, అద్దము మొదలగు వాటి నాకర్షింపదు.

అదే రీతిగా నొక్కొక్కసారి శారీరక మానసిక తత్త్వమే గుణముతో గూడి యుండునో తదను గుణమైన దాని యందపేక్ష గలుగును. శుద్ధాత్ముడైన వానికి అశుద్ధాహారము తినిన నెలాగునవికర్షణ, అనగా వమనము కలుగుచుండునో అలాగున సత్త్వ గుణము గల వారికి రజో గుణ తమోగుణా హారములు వికర్షణములై అనగా అప్రీతి గలవై యుండును. ఇది యాహారము ఒక్క దానికి మాత్రమే గాదు. సంసర్గము, వస్త్ర ధారణ, నివాసస్థలము మొదలగు వాటి కన్నిటికిని వర్తించును. ఆహర విషయము సామాన్యమని తలంచరాదు. మనము భుజించెడు ఆహారములో గల సారము రసమై రక్తమై మాంసమై మేధస్సు మొదలగు సప్త ధాతువులుగా బరిణమించును. దాని యొక్క సూక్ష్మాంశము మనస్సు బుద్ధి చిత్తము అహంకారముగా మారును. కావున మనశ్శాంతి, మనో నిర్మలత, కారుణ్య హృదయము, వైరాగ్యాంతః కరణము గలుగవలసి యుండిన ఆహారమందు జాగ్రత్త పడవలెను. అత్మ నియమనము కావలయునా? ఆహార నియమమున వలంభించ వలెను.

శ్లో॥ అన్న దోషేణ చిత్తస్య కాలుష్యం సర్వ దాభవేత్
కలుషీకృత చిత్తానాం ధర్మ స్య మ్యక్ నభాసతే ॥

తా॥ అన్న దోషము చేత మనస్సు, కల్మషము నొందును. కలుషీకృతమైన చిత్తము నందు ధర్మ రహస్యము ప్రకాశింపదు. మలినపు నీళ్ళు గల పాత్రలో సూర్య బింబము ప్రతి ఫలించినట్లు మాలిన్య హృదయములో దైవ సాక్షాత్కార జ్ఞానముదయించదు. మఱియు

శ్లో॥ దేవానామమృత నాలాణామృషీణాం చాన్నమోషధీః
దైత్య రక్షః పిశాచాదేర్ద్రత్తమధ్యామిషాది చ ॥

తా॥ బ్రహ్మ దేవుడు సృష్టి లో దేవతలకమృతమును, మానవులకును ఋషులకును అన్నము సస్యములు అనగా ఫలమూలములను దైత్య రాక్షస పిశాచాదులకు మద్యము, మాంసము, రక్తము మొదలైనవి యాహారములుగా నిర్మించెను. పశువులకు తృణ పత్రములను సృష్టించెను. మద్య మాంసములను భుజించు వారే జాతిలో చేరిన వారుగా నున్నారో వారి యాహారము వల్ల తెలిసికొనవచ్చును. మఱియు నాహార విషయములో 1. వస్తు శుద్ధి 2. పాత్ర శుద్ధి 3. వాహకశుద్ధి అనగా వండువాడుగాని, వడ్డించువాడుగాని, తెచ్చువాడుగాని శుభ్రత కలిగి యుండవలయును. వస్తువున్ను శుద్ధముగా నుండవలెను. పాత్రము శుద్ధముగా నుండవలెను. వస్తు శుద్ధి లోనిట్టి భేదము గలదు. వస్తువు మాత్రము మంచిదిగా నుండిన చాలదు. అది ఎటువంటి డబ్బుచేత లేక ఏ విధముగా వచ్చినదో యామార్గము శుద్ధముగా నుండవలెను. అనగా పాపపు సొమ్ముచే గాని పాపపు వృత్తి చేగాని వచ్చిన వస్తువు మంచిదైనను అది పాపాహారమే యగును. అలాగున ఇతరులచే దేహ కష్టము చేయించి వారికి సరియైన ప్రతిఫలము నివ్వక భుజించెడు అన్నము పాపాన్నమే యగును. ఇట్టి పాపాన్నము భుజించిన వారి మనస్సు నిర్మలముగా నుండదు. శాంతి, దయ, విరక్తులు వీరికి గలుగవు. మరియు వంశోద్ధారకులును ధర్మాత్ములును దేవవేదమాతాపితరుల యందు విశ్వాసము గల సంతానము గలుగ వలసి యుండిన పుత్రోత్పత్తికి హేతువగు శుక్ల శోణి తములే యన్న పానీయములచే స్త్రీ పురుషులకునేర్పడునో అట్టి యన్నము

తా॥ 5-6 శ్లో॥ ఏజనులు దంభాహంకారములతో గూడిన వారును కామరాగ బలముతో గూడిన వారునై శాస్త్ర సమ్మతము గాని దియు తనకు నితరులకు ను బాధాకరమైనట్టి దియునునగు తపస్సును చేయు చున్నారో అట్టి యవివేకులు తమ శరీరముల యందుండు నట్టి ఇంద్రియ సమూహమును తమ సూక్ష్మ శరీరములందుండునట్టి నన్నును కృశింప చేయు వారగుచున్నారు. అట్టి వారల నసుర గుణము గల వారిని గా నెరుంగుము.

వివరణ : శరీరేంద్రియములను పాడు చేసికొని యాత్మను దుఃఖ పెట్టెడు తపస్సు మంచిది కాదు. అది రాక్షసులిష్ట సిద్ధి కొరకు చెసెడు క్రూర తపస్సు వంటిది. దేహేంద్రియములకు బాధ లేనిదియు, ఆకలి దప్పికలచే బాధ యాత్మకు కలుగనిదియునగు జ్ఞానపరమగు తపస్సే సాత్త్విక తపస్స నబడును. దీని వలననే ఈశ్వరా నుగ్రహము జ్ఞానమును కలుగును. రావణాది రాక్షసులు లోక వినాశన కరమగు సిద్ధి కొరకే యట్టి ఘోర తపస్సు చేసిరి. అలాంటిది చేయ కూడదు. అయితే సుకుమారులై యుండ వలెనని యర్ధము కాదు. ఆత్మ పీడ గలుగని యే యా హారమైన భుజించి పరమాత్మ ధ్యానమొనర్చవలెను. తపశ్శబ్దమునకు అంతః కరణములో గల దోషములను భస్మమొనర్చుటయే అర్థమగును. ఇది జ్ఞాన విచారణ చేతను ధ్యాన బలము చేతను కలుగ వలెను. శరీర మాన సేంద్రియాదులకు చక్కని బలము లేనిచో తీవ్ర ధ్యానము చే నింద్రియాతీత జ్ఞానమును పొందజాలరు. దేహేంద్రియములకును మనస్సునకును దౌర్బల్యము గలిగి ధ్యానాదులు [illegible] టకు శక్తి లేని వారి తపస్సు తమస్సే యగును. వీరు నొక విధమగు రోగుల వలె నుండు వారగుదురు. లోక మును భ్రమింప చేయు తలంపుతో చేయు తపస్సు ఆత్మ వంచక మగును. ఇట్టి వారి జీవితము వ్యర్థమై పోవునని మరువకుడు.

17-10 యాతయామం గతరసం పూతి పర్యుషితం చయత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్ ॥

తా॥ చల్లారి పోయినదియు రసము తీసినదియు దుర్గంధము గలదియు ఒక రోజు క్రిందట వండ బడినదియు ఒకరు తినగా మిగిలి పార వేసినదియు పూజార్హము కానిదియు నయిన యాహారము తమోగుణ స్వభావము గల వారి కిష్టమై యుండును. ఎక్కువ వేడి గలది రజోగుణస్థులకును ఎక్కువ చల్లబడినది తమోగుణ ము గల వారి కిని ప్రియమై యుండును.

వివరణ : వండిన తరువాత నొక్క యామము గడిచినదియు ముందు దినము వండినదియు కూడదని చెప్పుటలో నీటిలో నుడక బెట్టిన యన్నము పరమాన్నము మొదలగు వానికిది చెందునే గాని నూనెలో వేయించిన చెడని పదార్థములకు సంబంధించదు. అదియు గబ్బు, దుర్గంధముతో కూడినది కాకూడదు. ఉచ్ఛిష్ట శబ్దము ఒకరు తిని పార వేసిన దానికి సంబంధించినదే గాని భగవత్ ప్రసాదమునకు వర్తించదు. భగవదుచ్ఛిష్ట ప్రసాదము భక్తుల కెటువంటిదో, ఎంత పవిత్రమైనదో అలాగున బ్రహ్మ నిష్ఠులగు గురువుల యుచ్ఛిష్టము శిష్యులకు భర్తృచ్ఛిష్టము పతివ్రతలకు నంత పవిత్ర మైనది. అది వారికి భగవత్ ప్రసాదము వంటిదగును. భర్తృచ్ఛిష్టము భార్యకును దోషకరము కాదు. సాధారణముగా తిని మిగిలిన దాని నెచ్చ టనో పారవేసి యుండిన దానిని తీసి తినే వారికే ఈ యుచ్ఛిష్ట శబ్దము వర్తించును. ప్రకృతిలో సూదంటు రాయి యినుము మొదలగు లోహములనాకర్షించునే కాని కఱ్ఱ, అద్దము మొదలగు వాటి నాకర్షింపదు.

అదే రీతిగా నొక్కొక్కసారి శారీరక మానసిక తత్త్వమే గుణముతో గూడి యుండునో తదను గుణమైన దాని యందపేక్ష గలుగును. శుద్ధాత్ముడైన వానికి అశుద్ధాహారము తినిన నెలాగునవికర్షణ, అనగా వమనము కలుగుచుండునో అలాగున సత్త్వ గుణము గల వారికి రజో గుణ తమోగుణా హారములు వికర్షణములై అనగా అప్రీతి గలవై యుండును. ఇది యాహారము ఒక్క దానికి మాత్రమే గాదు. సంసర్గము, వస్త్ర ధారణ, నివాసస్థలము మొదలగు వాటి కన్నిటికిని వర్తించును. ఆహర విషయము సామాన్యమని తలంచరాదు. మనము భుజించెడు అహారములో గల సారము రసమై రక్తమై మాంసమై మేధస్సు మొదలగు సప్త ధాతువులుగా బరిణమించును. దాని యొక్క సూక్ష్మాంశము మనస్సు బుద్ధి చిత్తము అహంకారముగా మారును. కావున మనశ్శాంతి, మనో నిర్మలత, కారుణ్య హృదయము, వైరాగ్యాంతః కరణము గలుగవలసి యుండిన ఆహారమందు జాగ్రత్త పడవలెను. అత్మ నియమనము కావలయునా? ఆహార నియమమున వలంభించ వలెను.

శ్లో॥ అన్న దోషేణ చిత్తస్య కాలుష్యం సర్వ దాభవేత్
కలుషీకృత చిత్తానాం ధర్మ స్య మ్యక్ నభాసతే ॥

తా॥ అన్న దోషము చేత మనస్సు, కల్మషము నొందును. కలుషీకృతమైన చిత్తము నందు ధర్మ రహస్యము ప్రకాశింపదు. మలినపు నీళ్ళు గల పాత్రలో సూర్య బింబము ప్రతి ఫలించినట్లు మాలిన్య హృదయములో దైవ సాక్షాత్కార జ్ఞానముదయించదు. మఱియు

శ్లో॥ దేవానామమృత నాలాణామృషీణాం చాన్నమోషధీః
దైత్య రక్షః పిశాచాదేర్ధత్తమధ్యామిషాది చ ॥

తా॥ బ్రహ్మ దేవుడు సృష్టి లో దేవతలకమృతమును, మానవులకును ఋషులకును అన్నము సన్యములు అనగా ఫలమూలములను దైత్య రాక్షస పిశాచాదులకు మద్యము, మాంసము రక్తము మొదలైనవి యాహారములుగా నిర్మించెను. పశువులకు తృణ పత్రములను సృష్టించెను మద్య మాంసములను భుజించు వారే జాతిలో చేరిన వారుగా నున్నారో వారి యాహారము వల్ల తెలిసికొనవచ్చును. మఱియు నాహార విషయములో 1. వస్తు శుద్ధి 2. పాత్ర శుద్ధి 3. వాహకశుద్ధి అనగా వండువాడుగాని, వడ్డించువాడుగాని, తెచ్చువాడుగాని శుభ్రత కలిగి యుండవలయును వస్తువున్ను శుద్ధముగా నుండవలెను. పాత్రము శుద్ధముగా నుండవలెను. వస్తు శుద్ధి లోనిట్టి భేదము గలదు. వస్తువు మాత్రము మంచిదిగా నుండిన చాలదు. అది ఎటువంటి డబ్బుచేత లేక ఏ విధముగా వచ్చినదో యామార్గము శుద్ధముగా నుండవలెను. అనగా పాపపు సొమ్ముచే గాని పాపపు వృత్తి చేగాని వచ్చిన వస్తువు మంచిదైనను అది పాపాహారమే యగును. అలాగున ఇతరులచే దేహ కష్టము చేయించి వారికి సరియైన ప్రతిఫలము నివ్వక భుజించెడు అన్నము పాపాన్నమే యగును. ఇట్టి పాపాన్నము భుజించిన వారి మనస్సు నిర్మలముగా నుండదు. శాంతి, దయ, విరక్తులు వీరికి గలుగవు. మరియు వంశోద్ధారకులును ధర్మాత్ములును దేవవేదమాతాపితరుల యందు విశ్వాసము గల సంతానము గలుగ వలసి యుండిన పుత్రోత్పత్తి హేతువగు శుక్ల శోణి తములే యన్న పానీయములచే స్త్రీ పురుషులకునేర్పడునో అట్టి యన్నవ

శుద్ధముగా నుండవలెను. అన్నము శుద్ధముగా నుండిన మాత్రమే యుత్తమ సంతతి గలుగును. లేనిచో దుష్ట గుణము గల బిడ్డలే పుట్టుదురు. దీనిని గూడా జ్ఞాపకము చేసికొనవలెను.

17-19 మూఢగ్రాహేణాత్మనోయ త్పీడయా క్రియతే తపః
పరస్యోత్సా దనార్థం వా తత్తామ స ముదాహృతమ్ ॥

తా॥ మూర్ఖపు పట్టుదలతో తన శరీరమును కష్ట పెట్టుకొనుట చేతను గాని ఇతరుల వినాశనము నుద్దేశించి గాని యే తపస్సు చేయ బడుచున్నదో అట్టి తపస్సు తామసమని చెప్పబడుచున్నది.

18-7 నియతస్యతు సన్న్యాసః కర్మణోనో పపద్యతే
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥

తా॥ శాస్త్రము వలన నియమింపబడినట్టి కర్మము యొక్క పరిత్యాగమన్నచో చేయ తగినది కాదు. అనగా నియత కర్మ త్యజింప తగినది కాదు. అవివేకము వలన చేయ బడిన అట్టి కర్మము యొక్క పరిత్యాగము తామస పరిత్యాగమని చెప్పబడుచున్నది.

వివరణ : వేదము చేత మహాత్ముల చేత ననుష్టింపతగిన దని విధింప బడిన కర్మమును చేయ క విడి చి పెట్టుట తామస గుణమే యగును. అంతఃకరణ శుద్ధికి హేతువగు అనుష్ఠానమును విడచుట తమోగుణ స్వభావమనియు ప్రమాదము వలన గలిగిన యవివేకమనియు తెలియ దగును. సోమరితనము గల వారు కష్టముల నోర్చు కొనలేక చేయదగిన అనుష్ఠానమును విడిచెదరు. వారికి అంతఃకరణ శుద్ధి గలుగదు.

18-22 యత్తుకృత్స్నవ దే కస్మి న్కార్యే సక్త మహైతుకమ్
అతత్త్వార్థ వదల్పం చతత్తామసముదాహృతమ్ ॥

తా॥ ఏ జ్ఞానమైతే నే దేని యొక్క దాని యందే సమస్త మున్నట్లెంచి దాని యందే ఆసక్తమైన మనస్సు గలది యగు చున్నదో అట్టి యకారణమైనట్టియు తత్త్వమును తెలియనిదియు స్వల్పమైనది యునగు జ్ఞానము తామసజ్ఞానమని చెప్పబడినది.

వివరణ : 20,21,22 శ్లోకములలో సాత్త్విక, రాజస, తామస జ్ఞానములను గురించి చెప్పబడినది. బ్రహ్మాది పిపీలికాపర్యంతము కల ప్రాణి కోట్లలో నన్నిటిలోను దేహము అంతఃకరణము తద్గుణము నీనికి విలక్షణమై వ్యాపించి వెలుగుచుండెడు ఆత్మ వస్తువు ఒకటేననియు కలిగెడు జ్ఞానము సాత్త్వికి మనబడును. ప్రతి జీవ కోట్ల దేహములను చూడక వారి హృదయములో గల గుణములు మంచివా, చెడ్డవాయని చూచి దేహములలో తన జాతికి అన్యుడైన మనుష్యుడైనను గుణమును గూర్చి సమానముగా భావించెడు జ్ఞానము రాజస జ్ఞానము. తన జాతిలో పుట్టిన దేహమును మాత్రము చూచి సమానముగా తలంచెడు జ్ఞానము తామస జ్ఞానమనబడును. ఈ మూడు జ్ఞానములలో నొక్కొక్కరికిని ఇతర మనుజులలో పెట్టి గావము లున్నవో తెలిసికొనిన తనకు గలిగిన జ్ఞానము రాజసమా తామసమాయని గ్రహించుకొనవచ్చును. ఇతర ప్రాణి సముదాయమును విడిచి పెట్టి మానవులను మాత్రము గ్రహించి వారివారి వర్ణము లేక వారివారి ఆశ్రమము లేక వారివారి మతమును గూర్చి కలిగెడు ప్రేమ తామసమనియు ఏ వర్ణము గాని కీ ఆశ్రమముగాని మతము గాని చూడక గుణములే ప్రధానముగా నెంచి ప్రేమించెడు జ్ఞానము

రాజసమనియు వర్ణమును గాని మతమును గాని గుణమును గాని చూడక అందరిలో నొకే సర్వేశ్వరుడు యున్నాడని లేక ఒకే యాత్మ స్వరూపము వెలుగు చున్నదని తెలిసికొనెడు జ్ఞానము సాత్త్విక మనబడును. ఇప్పుడు మనకు గలిగియుండు జ్ఞానము దేహమును గురించియా లేక గుణమును గురించియా లేక ఆత్మను గురించియా అని యొక్కొక్కరును విచారణ చేసికొనవలెను. సాత్త్విక జ్ఞానముత్తమమనియు, రాజస జ్ఞానము మధ్యమమనియు, తామసజ్ఞానము అధమమనియు చెప్పబడు చున్నది. కావున ఉత్తమమగుదైవ జ్ఞానము గలుగక పోయినను మధ్యమమైన జ్ఞానమునుసంపాదించుకొనవలసినది గదా. అధమ జ్ఞానములో నుండుట తగునాయని ఒక్కొక్కరు నాలోచించుకొనవలెను. గుణమును గురించిన జ్ఞానము కలిగిన యందరిలోను సోదర భావము కలుగును. అట్లు కలుగక ఉపన్యాస వేదికల పైనిలిచి సోదరీ సోదరులారాయని గంభీర ధ్వనితో పలికెడు మాటకు వేదిక నుండి క్రిందికి దిగు వరకు మాత్రమే ఆయుస్సు ఉండును. తాను మాటలాడు మాటలకు అట్లు అల్పాయుష్షు గాక చిరాయుస్సు కలిగియుండే లాగా చూడవలెను. అప్పుడు మాత్రమే ఆ వాక్యము అర్థవంతమైనది అగును. అట్లు కానిది నిరర్థకమని గ్రహింతురు గాక, మొదటిది దైవ జ్ఞానమనియు రెండవది మనుష్య జ్ఞానమనియు మూడవది మృగ జ్ఞానమనియు తెలియదగినది.

18-25 అను బంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్
మోహాదారభ్యతే కర్మ యత్త త్తామసముచ్యతే ॥

తా॥ తాను చేయు కర్మలవలన మేలు కలుగునా కీడు కలుగునా యునుట దేహ శక్తి యొక్కయు, ధనము యొక్కయు నాశనమును, అకర్మ వలన పరులకు కాని, తనకు కాని కలుగు బాధను, తన సామర్థ్యమును యోచింపక అజ్ఞానము వలన చేయబడు కర్మ తామస కర్మయని చెప్పబడుచున్నది.

వివరణ : మేలు కీడులను చూడక పూర్తియగు వరకు నిర్వహింపగలుగుదునా లేదా యని యోచించక చేసెడు కర్మ తనకు మంచిదిగా తోచినను అదియు తామస కర్మయేయగును. ఏలన మలిన బుద్ధి అగుటచే దూరాలోచన లేక పోయినది కనుక ఇట్టి సందర్భములో విజ్ఞానము గల వారి సలహాను తెలిసికొనవలెను. నేత్రమందు కామెర్ల వ్యాధి గల వానికి అన్నియు పచ్చగానే కనిపించును. జ్వరాది రోగముచే నాలుక చెడిన వానికి మంచి వస్తువు కూడా చేదుగానే యుండును. ఇచ్చట తన యనుభవము సరిపోయినను అది రోగము చే విపరీతము నొందినట్లుండును. అది విధిగాను ధర్మము గాను న్యాయముగాను, తనకు తోచినను మనస్సు అట్లు పరిణామమును పొందియుండుట వలన అట్లు కలుగుటకు కారణమైనదని గ్రహించ వలయును.

18-28 అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠోనైష్కృతికోఽలసః
విషాది దీర్ఘ సూత్రీచ కర్తా తామస ఉచ్యతే ॥

తా॥ చిత్త స్థైర్యము లేని వాడును, మూఢుడును, నమ్రత లేని వాడును, కుత్సితుడును, ఇతరుల జీవనమును చరచుటయందాసక్తి గల వాడును, సోమరియును, ఎల్లపుడును వ్యసన శీలుడు

కొద్ది కాలములో చేయ వలసిన దానిని దీర్ఘ కాలమున కైనను పూర్తి చేయని వాడు నయిన కర్త తామస కర్త యని చెప్ప బడుచున్నాడు.

వివరణ : 1. తాను ఏదైన ఒక సత్కార్యమును ప్రారంభించినచో దాని వలన లాభము సంపాదించుకొన వచ్చునను తలంపుతో చేయు వాడు తామస స్వభావము గలవాడు. వీడు అట్టి కార్యము చేయకుండుటయే మేలు. వీడు సత్కర్మలను భావముతో చేసినను మోసపు పనులగుటచే పాపమునేపొందును. అది దుష్కర్మయే అగును. 2. తానేదైనా నొకమంచి కార్యము ప్రారంభించిన తన కెలాంటి లాభమవసరము లేదు గాని పేరు ప్రతిష్టలు కావలెనని తలంపు కలిగినచో అది రాజస స్వభావము. వీడు కర్మ ఫలా సక్తుడగుట వలన పుణ్యము కలుగదు గాని పాపము మాత్రముండదు. 3. తానేదైనా నొక దైవకార్యమును ప్రారంభించిన లాభము గాని పేరు ప్రతిష్టలు గాని తనకవసరము లేదు కాని నిర్విఘ్నముగా చక్కగా జరిగిన చాలును. దానిని చూచి అనందించెదనను నది సాత్త్విక స్వభావము. అయితే సాత్త్వికము కూడ ప్రకృతియందు చేరిన దగుటచే అది యును బంధమును కలుగజేయును. ఏలన చక్కగా జరుగ పోయిన బాగుగా జరుగ లేదని యొక్క మనఃక్లేశము కలుగును. అయితే అది సత్త్వ గుణముతో కూడిన దగుటచే దైవ ప్రీతిని అత్మ శుద్ధిని కలుగ జేయును. 4.తాను మనుష్య ప్రయత్నముచే ఎంతవరకు శుద్ధముగా చేయ వలయునో అంత వకు జాగ్రత్తతో చేసియు దాని వలన నిష్ట ప్రాప్తి గాని అనిష్ట ప్రాప్తిగాని కలిగినను నిజస్వరూపమగు ఆత్మభావము నుండి అనగా సజానందమునుండి చలింపక యుండువాడు గుణత్రయాతీతుడగును. కట్టకడకు ప్రతీ వాడును ఈ స్థితిలోనికి రావలసి యుండును. అప్పుడే ముక్తాత్ముడగును.

18-32 అధర్మం ధర్మ మితి యామన్యతే తమసా22వృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ ॥

తా॥ ఓ అర్జునా ! ఏ బుద్ధి, అజ్ఞానము చేత నావరింపబడినదై అధర్మమును ధర్మ మనియు తెలియ దగిన వాటినన్నిటిని విరుద్ధములుగా అనగా ఒక దానిని మరియొకటి గాను తెలిసి కొనుచున్నదో ఆ బుద్ధి తమోగుణ ప్రధానమైనది.

వివరణ : ఈ మూడు శ్లోకములలో బుద్ధి యొక్క సాత్త్విక, రాజస, తామస గుణములను గురించి తెలుపడమైనది. 1.జన్మాంతర సుకృత విశేషముచే నంతఃకరణ శుద్ధి గల వానికి ఒకరు చెప్పకయు శాస్త్రము చూడకయు నీ కార్యము చేసిన ముక్తియునీ కార్యము చేసిన బంధమును కలుగునని స్వయముగా జ్ఞానము కలిగియుండును. ఇది సత్త్వ గుణము యొక్క స్వభావము.

2. ఈ కార్యము చేసిన దుఃఖము ఈ కార్యము చేసిన సుఖము కలుగునని యదార్ధముగా తెలియక పోయినను గొప్పవారి వాక్యము చేత గాని లేక శాస్త్రములో చూచిగాని పూర్వము తనకు కలిగియుండు స్వభావమును వెంటనే మార్చుకొని ప్రవర్తించెడి స్వభావము రాజసమగును.

3. స్వయముగా తెలిసి కొనకయు గొప్పవారు చెప్పినను శాస్త్రములు వినినను తన స్వభావమును మార్పు చేసికొనక అన్నియు విపరీతముగా చెసెడు స్వభావము తామస మనబడును.

సత్వ గుణ స్వభావము గల వానికి ఈ జన్మము లోనే విశుద్ధ తత్త్వము కలిగి ముక్తి సిద్ధించును. వీని యందు చెప్పబడిన రాజస స్వభావము గల వానికి మరణాంతరమున మంచి జన్మము కలిగి మోక్షమందు ప్రవృత్తి కలుగును. తామస స్వభావము గల వానికి కాలాంతరమున సత్కర్మ యందు బుద్ధి కలిగి అంతః కరణ శుద్ధి కలిగి అనేక జన్మములకు ఆవల మోక్షాసక్తి కలిగి ముక్తుడు కావలసి యుండును. సత్త్వ గుణము గల వాని హృదయము శుద్ధ చిమ్నీ యందు వెలిగెడు దీపము వలెను రజో గుణము గల వాని హృదయము ఎరుపు రంగు గల చిమ్నీ లోని దీపము వలెను తమో గుణము గల వాని హృదయము మట్టి కుండలో వెలిగెడు దీపము వలె నుండును. లేక నీలి రంగు గల చిమ్నీ లోపల వెలిగెడు దీపము వలె నుండును.

18-35 యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
స వి ముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ ! తామసీ ॥

తా॥ పృధా పుత్రుడవగు ఓ అర్జునా ! దుష్ట బుద్ధి గల యేమనుజుడు అతి నిద్రను భయమును దుః ఖమును దిగులును మదమును యే ధైర్యము చేత ప్రయత్న పూర్వకముగా విడువడో యట్టి ధైర్యము తామస ధైర్యమనబడును.

వివరణ : ధృతి అనగా ధైర్యము యొక్క పరివర్తనమగును. 1. సత్త్వ గుణము గల వాడు ధర్మ అర్ధ కామ మోక్షముల నెడు పురుషార్థ చతుష్టయములో ధర్మ అర్ధ కామములను గూడ విడిచి మోక్షము యొక్క దానినే పొందుటకు ప్రయత్నించును. వీడు ధ్యాన యోగాది సాధనా బలముచే నింద్రియముల పై చెప్పిన ధర్మార్ధ కామము లలోనికి పోనీయక స్వాధీన పరచి నిరంతర పరమాత్మ ధ్యానములోనే నిలుపును.

2. రజో గుణము గల వాడు మోక్షము యందు లక్ష్యము నుంచక ధర్మ అర్ధ కామముల లో మాత్రము మనస్సు ను ప్రవేశ పెట్టి ఫలమందాసక్తి గలిగి యుండును.

3. తమో గుణము గలవాడు ధర్మ అర్ధ కామములలో నైనను ప్రవేశింపక అధిక భోజనము అధిక నిద్ర కలిగి మధోన్మత్తుడై మనో వ్యాకులము చేతను మనోదుఃఖము చేతను జీవిత మంతయు వ్యర్ధముగా గడుపును. "నవి ముంచతి దుర్మేధాః" ఇట్టి వాడు దుర్బుద్ధి గల వాడు గాని నిశ్శేషముగా నీ దోషమును నివృత్తి చేయుటకు ప్రయత్నించడు.

సత్త్వ గుణము గలవాడు దేవమనుజుడనియు, రజో గుణము గలవాడు ఉత్తమ మనుజుడనియు, తమో గుణము గల వాడు మృగ మనుజుడనియు శాస్త్ర సిద్ధాంతము పై చెప్పిన మూడు గుణములలో నెవరెవరేయే గుణము కలిగి యున్నారో దానిని బట్టి వారిని కనుగొనవచ్చును.

18-39 యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మ నః
నిద్రాల స్య ప్రమాదోత్థం తత్తా మస ముదా హృతమ్ ॥

తా॥ ఏది అది యందును అంతము నందును తనకు సుఖముగా నున్నట్లు భ్రమింప చేయుచున్నదో నిద్ర అలస్యము ప్రమాదము వీని వలన బుట్టిన అట్టి సుఖము తామస సుఖమని చెప్పబడు చున్నది.

వివరణ : అతి నిద్ర చేతను సోమరి తనము చేతను ఉన్న దానిని మరియొక విధముగా తెలిసికొనుట చేతను చేయవలసిన దానిని సకాలములో చక్కగా చేయక పోవుట చేతను తత్కాలమున సుఖముగా తో చినను జీవితాంతమువరకును దాని వలన దుఃఖము బంధమును కలుగుచున్నది. తమోగుణ జీవు లిట్లుందురు. మరియు ఎలాటి ప్రయత్నము చేయక మోసపు వృత్తి చే గాని చోర వృత్తి చే గాని ఖూనీ చేయుటచేగాని వర్తమానమున సుఖముగా నుండినను రాజభటులచే పట్టుబడి కారా గృహములో జీవితాంతము వరకు కఠిన శిక్ష నను భవించుట చేత గాని మరణ దండన చేత గాని ఎంతో సంకట పడవలసి యుండును. ఇది తామస సుఖమే యగును. లేక సకాలములో చేయవలసిన కృష్యాదులను శీతోష్ణములను సహించి చేయక సుఖముగా కూర్చున్నచో తరువాత కలిగెడు దుఃఖమును తమోగుణముతో కూడినదే. విద్యాభ్యాసాదులు సకాలములో చేయకుండుటయు తామస స్వభావమే అగును.

18-58 మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్ర సాదాత్తరిష్యసి
అథ చేత్త్వ మహంకారాత్ నశ్రోష్యసి వినం క్ష్యసి ॥

తా॥ నన్ను ధ్యానించుచున్న నీవు నా అను గ్రహము వలన సకలములైన సంసార సంబంధములైన ఆటంకములను ప్రకృతి యొక్క అడ్డులను దాటెదవు. అట్లు గాక అహంకారము కలిగి వినక పోతి వేని చెడిపోదువు. అనగా మోక్ష భ్రష్టుడవగుదువు.

వివరణ : సామాన్యులకు వారివారి జన్మాంతర స్వభావము ననుసరించి ప్రవర్తిం చెడు గుణమే ఉండును. అట్లు గాక బ్రహ్మ నిష్ఠులైన మహాత్ములగు వారి వాక్యములననుసరించియే ప్రవర్తించవలెను. అట్లు గానిచో చుక్కాని లేని వాడు పడవ ప్రవాహ వేగము ననుసరించి గాని వాయు వేగముననుసరించిగాని పోవుచు గమ్య స్థానము చేరకయే ఎలాగను మెరకందు ఎక్కి చిక్కి నిలిచి పోవునో లేక కొండలకు గాని చెట్లకు గాని కొట్టుకొని పగిలి పోవునో అలాగ స్వభావము ననుసరించి ప్రవర్తించు వాని యొక్క గతియు అలాగుండును. అట్టి పడవ కట్ట కడకు సముద్రములో నే మునిగి పోవునట్లు వీడును ప్రకృతి యందు మునిగి పోవును. ( శ్రీ భగవంతుడు చెప్పెను ) .

18-72 కచ్చి దేక చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ ॥

తా॥ ఓ అర్జునా ! నాచే చెప్పబడి న ఈ గీతా శాస్త్రము నీచే నిశ్చల చిత్తముతో వినబడినది గదా. హే ధనంజయా ! అజ్ఞానము చే కలిగిన నీ యొక్క మోహము సంపూర్ణముగా నశించినది గదా.

వివరణ : వైద్యుడు ఆరోగ్య స్థితికి వచ్చిన రోగిని ఆరోగ్యము కలిగినది కదా రోగము నశించినది కదా అని ఎట్లడుగునో అలాగే గురువు కూడా శిష్యులను అజ్ఞానము సంపూర్ణముగా నశించినది కదా సంశయము లేదు కదా ప్రతి బంధ రహితము గా బ్రహ్మ సాక్షాత్కారము కలిగినది కదా అని వాత్సల్యము కలిగి అడుగ వలసిన ధర్మము కలదు. ఆ ధర్మము నిచ్చుట లోక గురువైన భగవంతుడు నిరూపించెను. అర్జునుడు చెప్పెను.

18-73 నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయా2చ్యుత
స్థితో2స్మి గత సందేహః కరిష్యే వచనం తవ ॥

తా|| ఓ శ్రీ కృష్ణ మూర్తీ ! నీ అనుగ్రహము వలన జ్ఞానము కలిగినది. అజ్ఞానము వీడి పోయినది నశించినది. సంశయ రహితుడనై సుస్థిరుడనై యున్నాను. నీ యొక్క ఆజ్ఞను పాటించెదను. స్మృతిర్లబ్ధా అని చెప్పుటచే ఇచ్చట స్మృతి శబ్దమునుకు మరుపు చెందినది. తిరిగి జ్ఞాపకమునకు వచ్చినదని భావము అనగా న విద్యా మోహముచే మరుపు కలిగి యుండిన ఆత్మ సాక్షాత్కార స్వరూప జ్ఞానము కలిగినదని భావము.

వివరణ : వైద్యుడడుగగా ఆరోగ్యస్థితి కలిగిన రోగి ఎలాగ రోగము నిశ్శేషముగా నశించినది ఆరోగ్య వంతుడనై ఉంటున్నానని తెలుపునో అలాగ భవరోగముతో కూడిన శిష్యుడును గురువుచే అడుగ బడినప్పుడు ఆత్మ జ్ఞానము ప్రభోదము కలిగినది. అజ్ఞానము పూర్తిగా నశించినదని చెప్పే స్థితికి రావలసి యుండును. సందేహము కలిగి యుండకూడదు. అని శ్రీ భగవానుడు చెప్పెను.

2-11 అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతా సూంశ్చ నాను శోచన్తి పండి తాః ||

తా|| నీవు దుఃఖింప దగని వారిన గూర్చి దుఃఖించు చుంటివి. పండితులు వివేక వంతులు పలుకునట్టి మాటలను పలుకుచున్నావు. ఆత్మ జ్ఞానము గలవారు చచ్చిన వారల గూర్చి గాని బ్రతికి యుండు వారిని గూర్చి గాని దుఃఖింపరు.

వివరణ : రెండవ అధ్యాయము 11 వ శ్లోకము నుండి శ్రీ కృష్ణుని ధర్మోపదేశము గీతో పదేశము ప్రారంభమగుచున్నది. భగవద్గీతా కల్ప వృక్షమునకు ఇది బీజమగును. అనగా మూలమగును. కావున నే ఋష్యాది న్యాసములలో "అశోచ్యానన్వ శోచస్త్వమితి బీజమ్" అని తెపుపుటకు కారణమైనది. వట బీజములో వట వృక్షమెలాగున నిగూఢమై యుంటున్నదో అలాగున ధర్మములన్నియు గీతా శాస్త్రము నందిమిడి యున్నవి. రణ రంగమున మిక్కిలి స్వల్ప కాలములో 18 అధ్యాయములతో కూడిన ఈ మహోన్నత గ్రంథమును పదేశించుటకు వ్యవధి యేది అని కొందరు విమర్శకులు శంకించుచున్నారు. భగవన్మహిమాతిశయము తెలియక శ్రీ కృష్ణుడు కూడా వారి వలె ఒక సామాన్యమనుజుడని తలంచుట చేతనే ఈ శంక కలుగుటకు కారణము. గొప్పదైన మఱ్ఱి చెట్టును మిక్కిలి సూక్ష్మ మైన బీజములో నిమిడ్చి సృష్టించిన భగవంతునికిది పెద్ద సంగతి కాదు. సూత్ర ప్రాయముగా శ్రీ కృష్ణుడు బోధించిన వాక్యములను గ్రహించి యమునా ద్వీపములో ఏకాంతమున నుండి శ్రీ కృష్ణాశయమును తెలిసికొని శ్రీ వ్యాస భగవంతుడు దీనిని గ్రంధ రూపముగా రచించెను. కనుకనే "అస్యశ్రీ భగవద్గీతా శాస్త్ర మహామంత్రస్య శ్రీ వేద వ్యాస భగవాన్ ఋషిః" అని ఋష్యాది న్యాసములో నిరూపించుటకు కారణమైనది. శ్రీకృష్ణుని అపరావతారము శ్రీ వ్యాసుడనుటచే అయనకు శ్రీ కృష్ణా శయములన్నియు తెలియ శక్తి కలిగియుండెను దీనికి మరియొక దృష్టాంతము చెప్పెద. శివచిదంబరమందు సనకాది ఋషులకు వ్యాకరణ శాస్త్రమంతయు 14 సూత్ర వాక్యములలో డమరుక ధ్వని చే శ్రీ పరమశివుండు పదేశించెను. వాటిని పాణి ని మహర్షి అష్టాధ్యాయిగా రచించెను. దానికి శ్రీ పతంజలి ముని మహా భాష్యమును వర రుచి వార్తికమును రచించిరి. ఈ మహావ్యాకరణ శాస్త్రమంతయు 14 ధ్వనులతో అమర్చి బోధించిన సర్వేశ్వరుని శక్తి ఎటువంటిదో శ్రీ కృష్ణుడు పదేశించిన గీతా శాస్త్రమును అటువంటిదే.

9-22 అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యా భియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

తా॥ ఏ పరమ భక్తులు ఇతర చింతలు లేని వారై పరమ దైవమగు పరమాత్మనగు నన్ను ఎల్లప్పుడును ధ్యానించు వారై సేవించు చున్నారో అట్లు సర్వ కాలములయందు సమాహిత చిత్తులైన వారి యొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను.

వివరణ : అప్రాప్తమైన దానిని ప్రాప్తించుట యోగ మనబడును ప్రాప్తమైన దానిని చెడకుండా సంరక్షించుట క్షేమమనబడును. తదేక ధ్యాన పరులగు మహాత్ములకు ఏ కాలమున నేది ప్రాప్తించవలెనో ప్రాప్తమై యుండు దాని నెట్లు సంరక్షించ వలయునో ఈ రెండు కార్యములను వారికి సర్వేశ్వరుడే నిర్వహించుచున్నాడు. గీతా వాక్యములను అమోఘ రత్నములచే చేయబడిన దివ్య హారము నకు ఈ శ్లోకము మధ్యాధ్యాయమునందుండుటచే నాయకమణి వంటిది. రెండవ అధ్యాయము 11 వ శ్లోకము బీజమగును. అనగా ఆరంభము. ఇక 18వ అధ్యాయమున 66 వ శ్లోకము "సర్వధర్మాన్" అనునది అంత్యమగును. దీనికే శక్తి యనియు కీలకమనియు పేరు. కావుననే అవి అంగ న్యాసములో చేర్చబడినవి. అనన్య పదములకు నాలుగు విధముల అర్థములు కలవు. 1.విష్ణు భక్తులైనచో శ్రీ మన్నారాయణుని తప్ప, శివ భక్తులైనచో శ్రీ పరమేశ్వరుని తప్ప, ఇతర దేవతల పేర్లు పలక కూడదనియు, ఇతర భక్తులతో సహవాసము చేయరాదనియు చెప్పుదురు. అట్లు చేసిన పతివ్రతయగు స్త్రీ తన భర్తను విడిచి పరపురుషుని ఆశ్రయించినట్లని చెప్పుదురు. ఇదియు నొక విధమగు భక్తి యైనను చాలా సంకుచితమైన మూఢ భక్తి యనబడును.

2. ఏ దేవతల యందు గాని ఏ దర్మానుష్ఠాన పరుల యందు గాని ద్వేషము లేక తన ఇష్ట దైవమును మాత్రము ధ్యానించుచు నితర విషయములలో చిత్తము పోకుండుట యనన్య భక్తి యనబడును. ఇది చాలా వరకు మంచి పద్ధతి యనదగును. మొదటి వాని కన్న ఇతని హృదయము వేయిరెట్లు అధిక విశాలభావమును నిర్మల తత్త్వమును కలిగియున్నది. సామాన్యముగా మహాభక్తులందరును ఇలాగుననే ఉందురు.

3. అనేక త్వములో నేకత్వమును కనుగొనుటయే అనన్య భక్తి యందురు. ఇది "సూత్రే మణి గణా ఇవ" అనేక రకములగు మణులలో ఒకే దారము వ్యాపించినట్లు బ్రహ్మాది స్థావరాంతము గల చరా చర ప్రాణి కోట్లలో నుండు పరమాత్మ ఒక దేనని కలిగిన జ్ఞానము చాలా గొప్పది ఉపనిషత్తులలో ఎక్కువ భావము ఇట్టి దైవో పాసనయే కనిపించుచున్నది. ఇతడు పైన చెప్పిన రెండవ వాని కన్న వేయి రెట్లధికమైన హృదయ వైశాల్యమును ఆత్మ శుద్ధియు కలిగియుండు వాడు. ఇతడన్నిటిలోను తన యుపాసనా మూర్తియగు ఇష్ట దైవమునే చూచుచుండును.

4. "నఅన్యం అనన్యం" పర బ్రహ్మమున కన్యముగా నొక్క పరమాణువైనను లేదని కలిగెడు జ్ఞానము అనన్య మనబడును. ఇది వేదాంతము యొక్క పరాకాష్ఠయగును. మూడవ వానికన్న ఈ మహాత్ముడు వేయి రెట్లధిక హృదయ వైశాల్యమును విశుద్ధ జ్ఞానము గలవాడగును. ఇతని కంతయు బ్రహ్మ మయముగానే కనిపించును. "వాసుదేవ స్సర్వమితి సమహాత్మాసుదుర్లభః" అని 7 వ అధ్యాయము

19 వ శ్లోకమున శ్రీ భగవంతుడుపదేశించిన మహాత్ముడిట్టి వాడే. అట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడని కూడా శ్రీ భగవంతుడు తెలిపెను. 18 వ అధ్యాయములో 20,21,22 శ్లోకములలో "సర్వభూతేషు యేనైకం పృథక్త్వేన తుయత్ జ్ఞానం యత్తు కృత్స్నవదేకస్మిన్" అను ఈ మూడు శ్లోకములలో చెప్పబడిన జ్ఞానము యొక్క లక్షణమును బాగుగా తెలిసికొనిన అనన్య భక్తి యొక్క స్వరూపము లక్షణము ఎట్టిదో గోచరముగా గలదు అట్టి జ్ఞానమును తెలిసి కొనక పోవుటయే శైవ వైష్ణ వాది ద్వైతాద్వైతాది హిందూ మహమ్మదీయాది కలహములకు హేతువగుచున్నది. ఇట్టి భేద జ్ఞానమే ద్వేషానలముగా పరిణమించి పవిత్రమగు సోదర బావమును నశింప జేసి దైవాసురుల వలె శత్రువులుగా జనులను చేయుచున్నది.

18-66 సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపే భ్యో మోక్షయి ష్యామి మా శుచః ||

తా|| సమస్త కర్మలను విడచి నన్నొక్కని మాత్రము శరణు బొందుము. నేను నిన్ను సమస్త పాపముల నుండి విముక్తుని చేసెదను. దుఃఖింప కుము. సందేహపడకుము. సర్వధర్మములనగా బుద్ధ్యాదీంద్రియములు. వాటి వ్యాపారములను వాటిని విడచి తూరీయావస్థలోనిలుపుము. అచ్చట దుఃఖ కారణములు లేవు. కాన శోకింపకుము.

వివరణ : శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించిన శ్రీ గీతా శాస్త్రమీ శ్లోకముతో పూర్తి యగుచున్నది. దీనికే ఋష్యాది న్యాసములలో శక్తి యనియు కీలక మనియు, రెండు మహిమలు కలవని తెలుపడమైనది. అ విషయము ఈ అధ్యాయము ఆరంభములోనే నిరూపించడమైనది. గీతా కల్ప వృక్షము యొక్క బీజము అనగా ధర్మబోధనారంభము 2వ అధ్యాయములోని 11 వ శ్లోకమనియు, దీని యొక్క మధ్య భాగము 9వ అధ్యాయము 22 వ శ్లోకమనియు, ఈ 66వ శ్లోకమంత్యమనియు గ్రహించదగినది. ఈ శ్లోకమును శ్రీ వైష్ణవ సాంప్రదాయకులు చరమ [illegible]ముగా గ్రహింతురు. శ్రీ నారాయణ అష్టాక్షరీ మంత్ర మెటువంటిదో దీనినలాగున తలంచి నిత్యానుష్ఠానములో పఠింతురు. శ్రీ వైష్ణవులకు దీని కన్న పరమ ప్రమాణము మరొకటి లేదు. దీనికి శ్రీ రామానుజాచార్యులు గొప్ప భాష్యము వ్రాసియున్నారు. అయితే "సర్వధర్మాన్పరిత్యజ్య" అని సమస్త ధర్మములును పరిత్యజించి శ్రీ భగవానుడొక్కనినే శరణు బొందినచో సర్వ పాపములనుండి విముక్తిని కలుగ జేయుదునని మోక్షము కలుగునని చెప్పుటచే పరమైకాంత భక్తులైన ప్రసన్నులైన తదేక ధ్యాన నిష్ఠా పరులగు బ్రహ్మ నిష్ఠులపై భగవంతునికి గల విశ్వాసము ప్రకటింపబడినది. మరియు కొందరు భక్తులు బీద వారగుట చే మేము తీర్థయాత్రలు, వేదాధ్యయనములు, తపస్సులు, దానములు మొదలగునవి ఏవియు చేయలేమే మాకెట్లు మోక్షము కలుగును. మాపాపమెట్లు నశించునని సందేహ పడనక్కర లేదు. అనన్య భక్తి తదేక ధ్యాన మొకటి యుండిన చాలును. యజ్ఞాది సమస్త కర్మముల కన్న నిత్యనైమిత్తి కాది సమస్త కర్మముల కన్న దీనియందు కోటి రెట్లధిక ఫలము కలదు. గంగా తీరములో కూర్చుని తపమొనర్చు వానికి ప్రపంచములో గల గుంటలు, బావులు, చెరువులు కాలువలు, ఏరులు వీటిలో గల జలముల చేనే మిప్రయోజనము. సూర్య సన్నిధిలో సదా యుండెడు వాలఖిల్యులు మొదలగు మునులకు దీపములు కావలయునా, వారికి చీకటి చే భయము కలుగునా కర్మ ఫలములగు ధర్మములన్నియు దీపముల వంటివి. తదేక ధ్యాన నిష్ఠ సూర్యుని వంటిది. కల్ప వృక్షము క్రింద కూర్చున్న వారికి ఇతరములైన వృక్ష ఫలముల చేనేమి ప్రయోజనము. ఆ వృక్ష ఫలముల కావలెనని ఎప్పుడైన సంకల్పము కలుగునా, నిత్య నైమిత్తి క కర్మలు లేక ధర్మములన్నియు ప్రపంచముల

గల మామిడి మొదలగు ఫలముల వంటివి. కల్ప వృక్షమే సంకల్పించిన సమస్తమును కలుగ జేయును. శ్రీ భగవద్ధ్యాన మటువంటిది. ఈ గీతా శాస్త్రము నందు శ్రీ కృష్ణుడు భక్తుల పై కరుణ కలిగి ధర్మ స్వరూపమగు ప్రపత్తిని ఉపదేశించెను. భగవత్ ప్రపత్తికి ఇంత మహిమ గలదని తెలుపబడమైనది. అయితే "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అని చెప్పుటచే అధర్మము చేయవచ్చునని దీని యందు అనగా ఈ శ్లోకము నందు చెప్పబడలేదు. మరియు సర్వ ధర్మములను విడిచి యూరకుండు మని ఈ శ్లోకము నందు చెప్ప బడలేదు. కావుననే "మామేకం శరణం వ్రజ" అని తెలుపడమైనది. సర్వ ధర్మములను విడచి నన్నొక్కనే శరణా గతి పొందురు. ప్రసన్నుడవు కమ్ము. తదేక ధ్యానమునందుండి చలింపకుమని ఉపదేశించడమైనది. హరిః ఓం.

2-40 నే హాభి క్రమనాశోస్తి ప్రత్య వాయో నవిద్యతే
స్వల్ప మప్య స్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

తా॥ ఫలాభిలాషను వదలి ఈ నిష్కామ కర్మ యోగమును చేయ ప్రారంభించి పూర్తియగుటకు ముందుగా మధ్య కాలమున విఘ్నముల చే నిలిచి పోయినను దోషము లేదు. ఇట్టి కర్మ యోగా నుష్ఠానము కొంచెమైనను మిగుల గొప్పదియగును. జనన మరణ ప్రవాహరూపమైన సంసార భయమునుండి రక్షింప గలదు.

వివరణ : బ్రహ్మ నిష్ఠలో ప్రవేశించిన పూర్తి కానిచో ఫలము గలగ దనియు దోషము సిద్ధించుననియు కొందరు చెప్పుదురు. అట్టి వాక్యములు విని భయ పడనక్కర లేదు ఈ అనుష్ఠానము కొద్దిగా చేసినను చిన్న ఓడ వల్ల సముద్రమును దాటునట్లు భవ సాగరమును దాటించు ననియు నిప్పు కొంచెమైనను మహారణ్యమును భస్మమొనర్చుననియు అజ్ఞానారణ్యమును దహింప చేయుననియు శ్రీ కృష్ణ భగవానునిచే ఉపదేశించడమైనది. అలాగే గీతా పారాయణ మును ప్రారంభించి కారణాంతరముచే ఒక్కరోజు తప్పి పోయినచో పాపము కలుగునని చెప్పి భయ పెట్టు వారు కూడ గలరు. దానికి భయ పడనక్కర లేదు. అని వార్య కార్యముచే ఒక్క రోజు లేక రెండు రోజులు నిలిచి పోయినను మరల సమయము దొరికినప్పుడు ప్రారంభించు కొనవచ్చును. కాని సాధ్యమైనంత వరకు విడువకనే అభ్యసించుచుండవలెను. లేక గీత యందు ఒక్క శ్లోకము గాని రెండు శ్లోకములు గాని మూడు శ్లోకములు గాని హృదయంగతము చేసి కొనిన యాత్రలో కాని లేక ఇతర కార్యములలో నిమగ్నులై యున్నప్పుడు గాని స్నానాది అనుష్ఠానములకు అనుకూలములు లేకపోయినను భోజనమునకు కూర్చున్నపుడైన వాటిని స్మరించుకొని భోజనము చేయవచ్చును. ఇది ఒక్కటి మాత్రము కాదు. దైవానుష్ఠానములన్నియు స్నానముచేయలేదని తలంచి వదలనక్కరలేదు. ఆత్మ శుద్ధి అన్ని టికన్న ఎక్కువైనది. జల స్నానము ఒకటి మాత్రము కాదు. భస్మ స్నానము, మంత్ర స్నానము మొదలగునవి గలవు. వీటిలోనేదైన ఒకటి భావన చేసికొని ధ్యానానుష్ఠానములు చేసికొనవచ్చును. జలముచే ముఖ, పాద, హస్త ప్రక్షాళనము చేసికొని తిలక, విభూతి కుంకుమాదులలో నేదైన నొకటి ధరించిన చాలును. అయితే స్నానమునకు అనుకూలము కలిగి చేయక పోయిన అది సోమరితనము క్రిందికి వచ్చును.

మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వామి
హరిః ఓం తత్ సత్
సర్వే జనాఃసుఖినో భవంతు
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 13. చతుర్విధయోగములు - (ద్వితీయభాగము)

## [illegible]

వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత మొదలగు గ్రంధములు కర్మయోగమునకు ప్రాధాన్యత నిచ్చినవి. భగవద్గీత మొదటి ఆరు అధ్యాయములకు కర్మ కాండ అని పేరు గలదు ప్రతి జీవి ఏదో ఒక పని చేయు చుండును. ఏపని లేకుండ ఎవరూ ఉండరు. "బుద్ధిః కర్మానుసారిణి" అని పెద్దలు చెప్పిరి. జన్మ పరంపరగా వచ్చు పుణ్య పాపమిశ్రితీత కర్మయే సంచితము. దీనిని వర్తమాన శరీరముతో అనుభవించుట ప్రారబ్ధము. ఈ వర్తమాన కర్మను బట్టి ఆగామి కర్మయేర్పడును. బుద్ధి కర్మను బట్టియుండును. శారీరకము జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల వలన, వాక్కు తోడను, మనస్సు తోడను క్రియాకలాపము జరుగుచుండును. మనస్సులో అనుకొనినది, మాటలలో చెప్పినది, చేతలలో చేసి చూపవలయును. ఇవియే త్రికరణములు అనబడును ( మనో, వాక్కు,కాయములు ). మంచి పనులు చేయుట వలన చిత్తశుద్ధి ఏర్పడును. సాత్వికము, రాజసము, తామసమని త్రిగుణములను బట్టి కర్మ విభాగము మరల మూడు విధములు. <u>సాత్వికము</u> ఉత్తమము దేవతాకార్యములు, పరోపకారము, ప్రశాంత చిత్తము మొదలగునవి ఈ కోవకు చెందును. స్వార్థము ఉండదు. "కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన" అను గీతాచార్యుని వచనానుసారము వీరు నిష్కామ్యకర్మ చేయుదురు. మోక్షము నందు కోర్కెగలవారు. వీరిది దేవతా స్వభావము ( సాత్విక ఆహారము). <u>రాజసగుణము</u> కలవారు తమ స్వార్థము చూసుకొనుచు పుణ్య పాప మిశ్రితముగ మానవ స్వభావులై దేవాతాకార్యములు కామ్యదృష్టితో చేయుదురు. రాజస ఆహారము తిందురు. <u>తమోగుణ</u> స్వభావులు రాక్షస ప్రవృత్తి కలవారు. తమ స్వార్థమునకై ఇతరులకు అపకారము చేయుచుందురు. పాపభీతి ఉండదు. తామస స్వభావ ఆహారము గ్రహింతురు. కనుక ఇది అధమ స్థితి. ఈ మూడింటిని సాధకుడు గమనించి తన ప్రవర్తనను సరిచేసికొనవలయును. సత్వ గుణము అభివృద్ధి చేసికొనుచు, సత్కర్మలు చేయుచుండ వలయును.

1. నిత్యకర్మలు --- స్నానాదులు, భగవత్ ప్రార్థన, స్వధర్మాదులు.
2. నైమిత్తిక కర్మలు --- యజ్ఞ యాగాదులు, దాన ధర్మాదులు, పితృ కర్మలు మొదలగునవి.
3. కామ్య కర్మలు --- కోరికలతో చేయు పనులు.
4. నిష్కామ్య కర్మలు --- కర్మ ఫల త్యాగముతో భగవదర్పితముగ చేయుపనులు.

జ్ఞాని సకల కర్మలు అనాసక్తితో చేయును. యోగి నిర్వికారముగ చేయును. భక్తుడు భగవంతుని ప్రీతి కొఱకు చేయును. మిగిలిన వారు కర్మ యోగములోని ప్రత్యేకత తెలియక కర్మ బంధమును పెంచుకొనుచుందురు. పుణ్య కర్మలు ఎక్కువగా చేయుట వలన దేవతా శరీర ప్రాప్తి, పుణ్య పాప మిశ్రితము వలన మరల మానవ జన్మ, పాపకర్మ ఎక్కువైన పశు పక్ష్యాది జన్మ లేదా నికృష్ట మానవ జన్మ లభించును.

కనుక ప్రతి మానవుడు తనకు ఉన్నదానితో తృప్తి చెందుచు అత్యాశకు పోక, పరోపకారము, సమబుద్ధితో సాత్విక ఆహారము భుజించుచు సద్గుణ శీలియై సాత్వికుడై భగవదనుగ్రహమునకు పాత్రుడు కావలయును.

రాజస, తామస స్వభావులు అసంతృప్తులై తమ పనులు నెరవేరనిచో ద్వేషము పెంచుకొని మానసిక ఆందోళనతో ఆరోగ్యము, ధనము, ప్రేమానురాగములు కోల్పోయి అధమ స్థితికి చేరుదురు. కనుక కృష్ణ భగవానుడు చెప్పిన కర్మ ఫల త్యాగము ననుసరించుట ఉత్తమము. దీని వలన క్రమముగా జ్ఞానము కలిగి జ్ఞానియై మోక్షము నొందును. "జ్ఞానా దేవతు కైవల్యం" - గీత

ఓం తత్ సత్

## భక్తి యోగము

భగవంతుని చేరుటకు భక్తి ఒక మార్గము. ఇది సాకారము, నిరాకారము అని రెండు పద్ధతులు. మరల ఇది వైధీ భక్తి, పరా భక్తి అని మరి రెండు పద్ధతులు. ఈ భక్తులలో మరల నాలుగు రకములుగా ఉన్నారని గీతలో చెప్పబడినది. "ఆర్తో రర్థార్థి జిజ్ఞాసః" కష్టములో భగవంతుని కొలుచు భక్తులు, సంపద కొరకు భగవంతుని కొలుచు భక్తులు, భగవంతుని తెలిసికొనగోరువారు, మోక్షము కోరువారు. భక్తి అనేక విధములుగా చెప్పబడినది. ఇందులో ప్రధానమైనవి 9 మార్గములు. శ్రీ షిరిడీ సాయి బాబా తాను సిద్ధి ( దేహ త్యాగము ) పొందు సమయమున ఒక భక్తురాలికి నవ విధ భక్తులకు గుర్తుగా తొమ్మిది నాణెములను ఇచ్చెను.

1. శ్రవణము --- పరీక్షితుమహారాజ్ భాగవతమును విని మోక్షము పొందెను.
2. స్మరణము --- శుక బ్రహ్మ
3. పాద సేవనము --- లక్ష్మి, గుహుడు ( రామ భక్తుడు ), విభీషణుడు
4. నామ సంకీర్తనము --- నారదుడు
5. అర్చనము --- త్యాగరాజు
6. నమస్కారము --- అక్రూరుడు
7. దాస్యము --- గరుత్మంతుడు, హనుమంతుడు
8. సఖ్యము --- అర్జునుడు, కుచేలుడు
9. ఆత్మ నివేదనము --- బలి చక్రవర్తి

మరికొన్ని రకములు

1. వాత్సల్య భక్తి --- కౌసల్య, యశోద
2. మధుర భక్తి --- రాధ, గోపికలు, మీరాబాయి
3. శత్రు భక్తి --- రావణాదులు.

గీతలో చెప్పిన భక్తుల లక్షణములు

భక్తి యోగములో ఏడు శ్లోకములు చెప్పెను.

1. సమబుద్ధి 2. స్నేహశీలము 3. మమకారము లేకపోవుట 4. అహంకారము లేకపోవుట 5.ఓర్పు 6. సహనము 7. సంతృప్తి 8. ఉదాసీనము 9. త్యాగము 10. ద్వేషము లేక పోవుట 11. దేని యందూ ఆసక్తి లేక పోవుట 12. ద్వంద్వమునకు అతీతముగా ఉండువాడు. 13. మిత భాషి, మరియు 14. స్థిత ప్రజ్ఞ

లక్షణములు గలవాడు భగవంతునికి ఇష్టుడు. గీతలో పత్రం, పుష్పం, ఫలం, తోయం అని చెప్పెను. వీటిని భక్తితో సమర్పించిన యెడల భగవంతుడు సంతోషించును. శరీరమనెడి పత్రము, హృదయమనెడి పుష్పము, మనస్సనెడి ఫలము, ఆనంద భాష్పములనెడి తోయమును భగవంతునికి సమర్పించవలెను. తులసి దళము తో రుక్మిణి దేవీ, పుష్పములతో గోదా దేవి, ఫలములతో శబరి, జలమును సమర్పించి రంతి దేవుడు ముక్తిని పొందిరి. అనన్య చింతతో భగవంతుని పూజించిన వారిని మరియు "అన్యథా శరణం నాస్తి" అని శరణు పొందిన వారిని భగవంతుడు వారియోగ క్షేమములను చూచుచూ రక్షించును. భక్తుల యొక్క సంకల్పమును బట్టి భగవంతుడు మార్జాలము పిల్లలను కాపాడు నట్లు ( మార్జాల కిశోరన్యాయము) తాను రక్షించును. మరికొందరిని కోతి-కోతి పిల్ల పద్ధతిలో ను ( మర్కట కిషోర న్యాయము ) మరికొందరిని కూర్మ కిశోర న్యాయముతోను భగవంతుడు కాపాడును. మానవులే కాకుండా పశు పక్ష్యాదులు కూడా తమ భక్తితో భగవంతుని చేరుచున్నవి. గజేంద్రుడు, గరుత్మంతుడు, సాలె పురుగు, పాము, ఏనుగు, జటాయువు, జాంబవంతుడు, వానరులు, ఉడుత మొదలయినవి పేర్కొన దగినవి.

ప్రహ్లాదుడు, బలి చక్రవర్తి, శబరి, హనుమంతుడు, భీష్ముడు, విదురుడు, రాధ, గోపికలు, శుక బ్రహ్మ మొదలగు మహా భక్తులెందరో కలరు. పంచాయతన దేవతలుగా పేరు పొందిన గణపతి (తర్పణము),సూర్యుడు (నమస్కారము), శివుడు (అభిషేకము), శక్తి (అర్చన), విష్ణువు (అలంకారము) మొదలగు వారి భక్తులు కలియుగములో ఎందరో కలరు. త్రిమతాచార్యులు, కబీరు, రామకృష్ణ పరమహంస, అన్నమయ్య, పోతన, త్యాగరాజు, రామదాసు, తులసీదాసు, మీరాబాయి, సక్కుబాయి, జయదేవుడు, తుకారామ్, నామదేవుడు, విప్రనారాయణ, రోహిదాసు, గోరాకుంభా కారుడు, మొదలగు వారు ఎందరో మహాభక్తులు తాము ఉద్ధరింపబడి లోకమును ఉద్ధరించిరి.

అన్ని కులములకు చెందిన వారు ఇందులో కలరు. భగవంతుడు గుణము ముఖ్యము గాని కులము కాదని తెలియుచున్నది. కృతయుగములో తపస్సు చేత , త్రేతాయుగములో యజ్ఞ యాగాదులు, ద్వాపరములో దాన ధర్మాదులు, కలియుగములో నామస్మరణ చేత ముక్తి లభించగలదని "కలౌనామస్మర ణాత్ ముక్తిః" అను వాక్యము వలన తెలియుచున్నది కనుక యుగధర్మము ననుసరించి నామస్మరణ చేయుట మంచిది. భక్తి యోగము అనుసరించ దగినది. బాహ్య పూజలు, జపాదులు, యజ్ఞ యాగాదులు, విద్యుక్తముగా నాచరించినచో అది వైధీ భక్తి అనబడును. నిరంతర భగవత్ సేవ, మానసిక పూజచేయుట మొదలగునవి పరాభక్తి అనబడును. గోదాదేవి, మీరాబాయి, చైతన్య ప్రభువు, రామకృష్ణ పరమహంస మొదలగు వారు "సర్వము వాసుదేవమయముగా" భావించి తన్మయత్వ స్థితిలో భావ సమాధిని పొంది పరాభక్తికి పరాకాష్టగా నిలిచిరి.

సాకార పూజలో నామము చేత గాని, గుణముల చేత గాని, రూపము చేతగాని, మంత్రము చేత గాని స్త్రీ , పురుష రూపములలో భగవంతుని ప్రార్థించవచ్చును. అది శంకరులు 6 విధములు ( షణ్మత స్థాపకుడు) భగవంతుని అర్చనా మూర్తులను తెల్పెను. కాని పంచాయతన పూజలో 5 కలవు. సుబ్రహ్మణ్యేశ్వరుని అక్కడ ప్రత్యేకముగా చెప్పెను. ఆదిత్యం, శక్తిం, విష్ణుం, గణేశాయ, మహేశ్వరం అని పెద్దల నానుడి.

## పంచాయతన దేవతలు :



గణపతి : పృధ్వీ తత్త్వము, మూలాధార చక్రము, గరిక

విష్ణువు : జలతత్త్వము, మణిపూరకము. తులసి, పండ్లు, దధ్యాన్నము, పసుపురంగు, వెన్న.

శక్తి : అగ్ని తత్త్వము, అజ్ఞా చక్రము (కుండలిని ), వేప, ఎఱ్ఱని పుష్పములు, పాయసాన్నము, కదంబము.



సూర్యుడు : వాయు తత్త్వము ( సూర్యమండలము ), తెల్ల జిల్లేడు, పాయ సాన్నము.

శివుడు : ఆకాశ తత్త్వము, అనాహతము, మారేడు, కొబ్బరికాయ, తెల్ల పుష్పములు.

**ఉపచార పూజ** : సాకార పూజలో భగవంతుని రూపము, గుణములు, నామము లేక మంత్రముతో ఉపచార పూజలు జరుగును. ఇవి 5 రకములు, 16 రకములు, 64 రకములుగ నున్నవి. సామాన్యముగా పంచపూజ పంచ భూత తత్త్వములతో చేయుదురు.

1. పృధ్వీవీ తత్త్వము 'లం' బీజముతో గంధము
2. ఆకాశ తత్త్వము 'హం' బీజముతో పుష్పము
3. వాయుతత్త్వము 'యం' బీజముతో ధూపము
4. తేజోతత్త్వము 'రం' బీజముతో దీపము
5. జలతత్త్వము 'వం' బీజముతో నైవేద్యము

సర్వతత్త్వము ' సం' బీజముతో తాంబూలాది సర్వోపచారములు.

### 16 ఉపచార పూజలు

1. ఆవాహన 2. ఆసనము (రత్న సింహాసనము ), 3. పాద్యము ( పాదములు కడుగుట ) 4. అర్ఘ్యము (అర్ఘ్య ప్రదానము) 5. ఆచమనము (నోటిలోనికి 3 సార్లు నీరు ) 6. స్నానం (అనేక రకములు స్నానములు కలవు. సుగంధ తైల స్నానము, పంచామృత, శుద్ధోదకాది) 7. వస్త్రం 8. యజ్ఞోపవీతం 9. ఆభరణం 10. అలంకరణం 11. గంధం 12. పుష్పం 13. ధూపం 14. దీపం 15. నైవేద్యము 16 . తాంబూల నీరాజన మంత్ర పుష్పాదులు.

ఇవిగాక వీటికి విశేషముగా పరాశక్తికి శ్రీ చక్రార్చనలో 64 ఉపచార పూజలు చేయుదురు.

"యద్భావం తద్భవతి" అని మనము ఏ భావముతో పూజిస్తే భగవంతుడు ఆభావముతో కరుణిస్తాడు. కనుక సాధకుడు తన ఇష్టమునకు దగిన విధముగ భక్తి తో పూజించి ధన్యుడు కావలయును.

గ్రహములు

సూర్యుడు (రవి గ్రహము ) - శివుడు, అగ్ని

చంద్రుడు,శుక్రుడు - శక్తి పూజకు,

బుధుడు - విష్ణు పూజకు,

కుజుడు - కుమార స్వామి

గురుడు - శివుడు ( గురు పూజ )

శని - హనుమంతుడు, అయ్యప్ప మొదలగు సిద్ధ పురుషులకు.

కనుక సాధకుడు గ్రహస్థితి కూడా గమనించ వలయును.

గణపతి : పంచాయతన దేవతలలో గణపతి మొదటి వాడు. వైష్ణవులు విష్వక్ సేనుని విఘ్నాది పతిగా పూజించెదరు.గణపతి శివ పురాణాదుల ప్రకారము పార్వతి తనయుడు. బ్రహ్మాండ పురాణము లలితా ఉపాఖ్యానము ననుసరించి కామేశ్వరీ కామేశుల సంకల్ప మాత్రమున మహాగణపతి విఘ్న యంత్రమును ఛేదించుట కు జన్మించెను. గణేశపురాణములో కూడా చాలా విశేషములు కలవు. గణపతి సిద్ధి, బుద్ధి అను భార్యలతో నున్న వాడు. కొన్ని శాస్త్రములతో గణపతి త్రయోదశ మిధునములుగ వర్ణింపబడి నాడు. మూలాధార చక్రమునకు అధిపతి. పృధ్వీ తత్వము. గరిక ప్రీతి గలవాడు. గణపతి తర్పణ ప్రియుడు. చతురావృత తర్పణము చేయుదురు. ఉండ్రాళ్ళు నైవేద్యము పెట్టుదురు.

విష్ణుమూర్తి : సత్వగుణ సంపన్నుడు. జలతత్త్వ స్వరూపము (నారములు, జలములు). అలంకార ప్రియుడు, భక్త సులభుడు. ప్రస్తుత గ్రంధములో విపులముగా వ్రాయుట చే ఇచ్చట ఎక్కువ వివరించుట లేదు. ఈ అవతారములు కొన్ని సంపూర్ణము, కొన్ని తాత్కాలికము అయి ఉన్నవి. వేదముల రక్షణ, భూభారమును పాపమును తగ్గించుట, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, మోక్షము నిచ్చుట, సందర్భానుసారము భక్తి జ్ఞాన వైరాగ్యయోగాదులను భక్తులకు ఉపదేశించుట మొదలగు లక్ష్యములతో అనేక అవతారములు ఎత్తియున్నాడు. దశావతారములు కాక మిగిలిన అవతారములు భాగవతములో చెప్పబడినవి. వెంకటేశ్వరుడు, దత్తావతారములు, కపిలుడు, రామకృష్ణ పరమహంస (గదా ధరుడైన విష్ణువు అను గ్రహముతో జన్మించిన వాడు. ) రామానుజాచార్యులు, మంత్రాలయము రాఘవేంద్ర స్వామి, అన్నమయ్య, భక్త తుకారామ్ మొదలగు వారు ఎందరో ఈ యుగములో కలరు. రామాయణ, భారత, భాగవతాది మహాకావ్యములకు విష్ణువు కారకుడు.

శక్తి (పరాశక్తి) : దేవీ భాగవత పురాణ, ఉపనిషత్తులు, వేదములు శక్తిని స్తుతించినవి. ప్రకృతి పురుషుల సంకల్పమే సృష్టి. శివ శక్తులకు అభేదము అని శాక్తేయుల సిద్ధాంతము. శివుడు-పార్వతి, విష్ణువు-లక్ష్మి, బ్రహ్మ-సరస్వతి ఈ విధముగా దేవతా స్వరూపములన్నింటికి శక్తి స్వరూపము కలదు. పురుష సూక్తము, శ్రీ సూక్తము. ఈ శక్తియే వేదమాత, గోమాత, భూమాతగ చెప్పబడుచున్నది. నారాయణుని వలె ఈమెకూడా దుష్ట శిక్షణ, శిష్ట సంరక్షణ కు అవతరించును. లలిత, బాల, కాళి, లక్ష్మి, సరస్వతి, దుర్గ మొదలగు అనేక అవతారములు పురాణములో వర్ణింపబడినవి. మాతృమూర్తిగా ( శ్రీ మాతా ) కొలుచుట ఉత్తమము. ఈమె దక్షిణా చార వామాచార పద్ధతులలో పూజింపబడునది. గ్రామ దేవతలు ఈమె అంశయే. కలకత్తా కాళీ, ఉజ్జయినీ, కోల్హాపురీ, మహాలక్ష్మి, బాసర సరస్వతి, విజయ వాడ కనకదుర్గ, కాశీ అన్నపూర్ణ. ఈ విధముగా 64 స్థానములలో , 18 పీఠములలో ఈమె పూజింపబడుచున్నది. ఆది శంకరాచార్యులు 4 పీఠములు సరస్వతి ప్రధానముగా స్థాపించెను. రాముడు, కృష్ణుడు,దక్షుడు, హనుమంతుడు, కాత్యాయనుడు, వ్యాసుడు మొదలగువారు ఈమె అను గ్రహమునకు పాత్రులైరి. కలియుగములో

